# శృంగార శాకుంతల

గ్రంథకర్త:

పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి ప్రణీతము.



ప్రకాశకులు:

ఈశ్వర బుక్ డిపో,

కర్రా అచ్చయ్యా అండ్ సన్స్,

ప్రొప్రైటర్:— కర్రా మావుళ్లయ్య.

రాజమహేంద్రవరము.

# బాలవితంతువిలాపము.

గ్రంథకర్త:— మంగిప్రూడి వెంకటశర్మ.

వివిధగ్రంథములను రచించిన యీ విజ్ఞానకవియొక్క మృదుమధురశైలిని చవిజూచి సంతసింపుడు. భావములతో మిళితమైన భాషా చమత్కృతి పాఠకులనానంద సందోహంబున నీదులాడించును. పద్యము పద్యమొక్క మణియన నొప్పు 99 పద్యరత్నములు గలిగియున్నవి. జుంటితేనెనైన గెంటివైచు రసవంతము లీనుచు, చదివినకొలది వదలనీని భావకల్పనగల్గి సంఘసంస్కారులకు చేసహాయమై, పూర్వాచారులకు బాహుపోటై, ధనాశాపరులకు దండమై దేశాభ్యుదయమునకు తిన్నెయై, వర్ణప్రాబల్యమునకు వన్నెయై, బాలవితంతుల కడగండ్లు పఠించినవారి యుల్లములు ఝల్లుమని తల్లడిల్లక మానవు. పుట్టింట్లకు నత్తింట్లకు వితంతువువల్లపొందు హానులు పలంచినచో డెందంబులు కుందింపకుండునా! అట్టిదానిని చదివి అధోగతిలోనున్న స్త్రీ సంఘము నుద్ధరించి దేశసౌభాగ్యము గల్గింపుడు.

వెల రు. 0—5—0

# గీతగోవిందము.

జయదేవకవి ప్రణీతము.

(అష్టపదులు)

వైష్ణవభక్తులలో త్యాగరాజు, క్షేత్రయ్య, జయదేవుడు, రామదాసు మొదలగు మహాభక్తులొక్కొక్క రొక్కొక్క విధంగా భక్త్యుత్పాదకములైన సేవలుచేసారు. క్షేత్రయ్య పదాలుపాడాడు. త్యాగయ్య రాగాలాలాపించాడు. రామదాసు రామతారకాన్ని వెదజల్లాడు. జయదేవుడష్టపదులు గానము చేసాడు. ఈయష్టపదులు పాడుతోంటే పొందే ఆనందం, చదువుతోంటే సముద్రతరంగాలల్లా పొంగుతుంది. అందు ఏవర్ణము చూచినా రసము చిప్పిలుతూ గోవిందుని కీర్తించి విందు చేస్తుంది.

వెల రు. 0—8—0.

# శకుంతలా పరిణయము.

గ్రంథకర్త:

పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి



ప్రకాశకులు:

ఈశ్వర బుక్ డిపో.

కర్రా అచ్చయ్య అండ్ సన్సు, స్థాపితము:—1888.

ప్రొప్రయిటర్:—కర్రా మావుళ్లయ్య.

రాజమండ్రి.

1939.

శ్రీ ర స్తు.

# శకుంతలా పరిణయము.



## ప్ర థ మా శ్వా స ము.



శ్రీవత్సాంకుఁడు భక్తవత్సలుఁడు లక్ష్మీప్రాణనాథుండు రా
జీవాక్షుండు సమస్తభూతభువనక్షేమంకరానేక రూ
పావిర్భావుఁడు వాసుదేవుఁ డనుకంపావాసుఁడై దాన వి
ద్యావిఖ్యాతుని మంత్రివెన్నని నితాంతశ్రీయుతుం జేయుతన్. 1

సీ. భూని చరాచరంబు భరించు నొకమూర్తి యుడుపుఁ దృష్ణాఖేద మొక్కమూర్తి
యారగించు మనోజ్ఞమగు హుతం బొకమూర్తి యొసఁగుఁ జైతన్యంబు నొక్కమూర్తి
యాదిత్యులకుఁ బ్రోవయై పొల్చు నొకమూర్తి యుడుగణంబుల నేలు నొక్కమూర్తి
విశ్వంబుచీఁకటి విరియించు నొకమూర్తి హోతయై దీపించు నొక్కమూర్తి

తే. యరయ నెవ్వనియందు న య్యష్టమూర్తి, యిష్టఫలదాత కరుణాసమేతుఁ డగుచు
వెలయఁ జిల్లర నాగయవెన్నమంత్రిఁ, జిరతరైశ్వర్యసంపన్నుఁ జేయుఁగాత. 2

శా. చేయు న్విశ్వము నెవ్వఁ డంచితకళాశిల్పం బనల్పంబుగా
వ్రాయుం బ్రాణులఫాలపట్టికల నెవ్వం డర్హవర్ణంబు లా
మ్నాయవ్రాతము లూర్పు లెవ్వనికి నయ్యబ్జాతగర్భుండు దీ
ర్ఘాయుష్మంతునిఁ జేయు నాగవిభువెన్నామాత్యచూడామణిన్. 3

మ. జననీస్తన్యముఁ గ్రోలుచుం జఠర కంజాతంబునం గింకిణీ
స్వన మింపారఁగఁ దల్లిమేన మృదులస్పర్శంబుగాఁ దొండ ము
ల్లన యాడించుచుఁ జొక్కు విఘ్నపతి యుల్లాసంబుతో మంత్రి వె
న్ననికి న్మన్నన సొంపు మీఱ నొసఁగు న్భద్రంబు లెల్లప్పుడున్. 4

సీ. పగడంపుఁ జిగురుజొంపము సొంపు విహసింపు కడునొప్పుఁగుఱుచకెంజడలవాఁడు
విదియచందురుతోడ వీడుజోడాడెడు రమణీయదంష్ట్రాంకురములవాఁడు
సీధుపానక్రీడఁ జెంగల్వపూఁజాయఁ దొంగిలించెడు కన్నుదోయివాఁడు
క్రొత్తనీలాలరంగునకు నించుక మించి మెఱుఁగారు నల్లని మేనివాఁడు
తే. పృథివి కవతంసమణియైన బిట్రగుంటఁ, బానకంబుగ నవతారమైనవాఁడు
భైరవస్వామి సకలసంపదల నొసఁగి, మనుచుఁ జిల్లరవెన్నయామాత్యవరుని. 5
ఉ. మెచ్చుగు విచ్చుదమ్మిపువుమేడలలోన నిధానదేవత
ల్వచ్చి కటాక్షసంజ్ఞకుఁ గెలంకులఁ గొల్వఁగ నోలగంబు సొం
పచ్చుగనుండు చంద్రముఖి యాదిమలక్ష్మి వసించుఁ గావుత
న్మచ్చిగ వెన్నయప్రభుని మందిరరాజమునందు నిచ్చలున్. 6
మ. పొసఁగ న్నేఁ గృతిఁ జెప్పఁగాఁ బరిమళంబు ల్జాల కొక్కొక్కచోఁ
గొస రొక్కించుక గద్దెనేనియును సంకోచంబు గాకుండ సా
రసి యచ్చోటికి నిచ్చఁగాతఁ బరిపూర్ణం బొంద వాగ్దేవి యిం
పెసలారం దనవిభ్రమశ్రవణకల్హారోదయామోదముల్. 7
శా. అర్థిన్నాత్మక మానసాబ్జమున నధ్యాసీనుఁ గావించి సం
ప్రార్థించు న్యతిసార్వభౌముఁ బరమబ్రహ్మానుసంధాత సా
సార్థాలంకృతబంధురశ్రుతిరహస్యజ్ఞాత శ్రీభారతీ
తీర్థశ్రీచరణంబు నుల్లసిత ముక్తిప్రేయసీవల్లభున్. 8
వ. అని యిష్టదేవతాప్రార్థనంబుఁ గావించి, 9
సీ. వల్మీకసంభవ వ్యాసమునీంద్రులవాణి కంజలిబంధపాణి యొసఁగి
భట్టబాణమయూరభట్టారకుల మంజుభాషావిశేషంబుఁ బ్రస్తుతించి
భవభూతిశివభద్రబంధురభారతీ హేలావిలాసంబు నిచ్చగించి
మాఘు భారవుల నిరాఘాటచాటుసరస్వతీ పుణ్యగౌరవముఁ దలఁచి
తే. లల్లటుని గాళిదాసు సౌమిల్లకుని ని, భామహుని దండి వామను భాను హర్షు
హర్షసంపూర్ణహృదయుండనై కవిత్వ, సమధికస్ఫూర్తిభక్తి సంస్తుతించి. 10
క. ఇట్టల మగుమతి భారత, ఘట్టమునకు నడవయచ్చుఁ గట్టిన కవితా
పట్టాభిషిక్తు నన్నయ, భట్టోపాధ్యాయుఁ దలఁచి పరమప్రీతిన్. 11
గీ. ఉభయకవిమిత్రు నత్యంతశుభచరిత్రు, భానుసమతేజుఁ గొమ్మయప్రభూతరాజ
సుకృతవిభ్రాజిఁ దిక్కనసోమయాజిఁ, బ్రణుతబహుదేశకవిరాజిఁ బ్రస్తుతించి. 12
వ. ఒక్కప్రబంధంబు రచియింపఁ బూనియున్నంత. 13

సీ. సకలభూపాలకాస్థానసౌధంబుల వర్ణింతు రేమంత్రి వాగ్విభూతి
సంతానసురధేనుచింతామణులపెంపు దట్టించు నేమంత్రి దానమహిమ
యాశాంతదంతిదంతాఘాటములమీఁద విహరించు నేమంత్రివిమలకీర్తి
సుకవిగాయకబహుస్తుతిఘోషణంబున నలరు నేమంత్రి గేహాంగణంబు
తే. వాఁడు కౌండిన్యగోత్రాబ్ధివర్ధనుండు, మదపదరిసైన్యపతిమానవర్దనుండు
నాగయామాత్యతనయుండు నయవిశేష, విజితసురమంత్రి చిల్లరవెన్నమంత్రి. 14
వ. ఆమంత్రిమందారంబొక్కనాఁడు పురాణేతిహాసప్రసంగంబుల వినోదించుచుఁ దన
మనంబున.
శా. నల్లిల్లుం గుడియు న్వనంబును నిధానంబుం దటాకంబు రం
జిల్లుం గొండొకకాల మేగ నవి విచ్ఛేదంబునుంబొందు నే
పొల్లుం బోనిది కీర్తికిం గృతియపో భూమండలిం దానికిం
దల్లం బిప్పుడు రామ భారతకథాదీన ప్రబంధావళుల్. 16
సీ. వల్మీకిసంభవు వాక్యసంపన్నత దశరథాధీశ నందనునికీర్తి
సాత్యవతేయువాచావిలాసంబునఁ గౌంతేయపంచకాగ్రణిప్రశస్తి
చిత్తపవచనరాజినిబంధనంబున దారమహాపురాధ్యక్షుమహిమ
కాళిదాసవచోవిశాలతాప్రౌఢత విక్రమాదిత్యభూవిభునిచరిత
తే. మఱియుఁ దత్తత్కవీంద్రసమగ్రవాగ్వి, భూతిఁ దెలుపుచున్నది పూర్వరాజ
కోటిల దానాదిచర్యవిశేషములను, గీర్తిసదనంబు కృతియ తర్కింప ధరణి. 17
క. ఆచంద్రతారకంబుగ, భూచక్రమునందుఁ గీర్తిఁ బోషింపగఁ దా
రోచిష్ణు వనుప్రబంధము, వైచిత్రి యొనర్చు సుకవివరుఁడు గలిగినన్. 18
సీ. నన్నపార్యుఁడు ప్రబంధప్రౌఢవాసనాసంపత్తి సొంపు పుట్టింప నేర్చుఁ
దిక్కనయజ్వవాగ్భక్తికామోదంబు చెలువు కర్ణముల వాసింప నేర్చు
నాచిరాజుని సోము వాచామహత్త్వంబు సౌరభంబులు వెదజల్ల నేర్చు
శ్రీనాథభట్టు భాషానిగుంభంబుల పరిమళంబులఁ గూడఁబఱచ నేర్చు
తే. మహితగుణశాలి పిల్లలమఱ్ఱివీర, నార్యుఁ డాయింటఁ జైతామహాంబగుచును
వెలయుచున్నది నేఁడు కవిత్వలక్ష్మి, యఖిలసత్కవినికరంబు నాదరింప. 19
క. ఆ సుకవిచేత శివభజ, దాసక్తునిచేతఁ గశ్యపాన్వయుచేతన్
భాసురనవకవితా ల, క్ష్మీసదనునిచేత వలయుఁ గృతిఁ జెప్పింపన్. 20
మ. అని సాధ్వీమణి నాగమాంబకును విద్యాభారతీజాని గాఁ
దనకుం బుత్రుని వీరభద్రపదపద్మధ్యానశుద్ధాంతరం

గుని నన్నుం బిలిపించి లోనఁ దనకోర్కె ల్సందడింపంగ మ
న్నన దైవారఁగ గారవించి పలికెన్ గంభీరవాక్ప్రౌఢిమన్. 21
సీ. రచియించినాఁడవు రమణీయవాగ్రీతి నవరసదర్పణం బభినవముగఁ (?)
పలికినాఁడవు తేటపడఁజేసి నారదీయము సత్కవిశ్రేణి యాదరింపఁ
జెప్పినాఁడవు శేముషీవిశేషంబున మాఘమాహాత్మ్యంబు మంజుఫణితిఁ
గావించినాఁడవు ఘనబుద్ధి మానసోల్లాససారము సముల్లసితశయ్య
తే. భారతీతీర్థ యతిసార్వభౌమగురుకృపాతిశయలబ్ధకవితావిభూతి గలిగి
గౌరవము గాంచినాఁడవు కవులచేత, విపులచాటూక్తి నిర్నిద్ర వీరభద్ర. 22
గీ. కలదు చాలంగఁ బేరు నీవలన నాకు, వేడ్కనడిగెదఁ గవులెల్ల వేడ్కపడఁగ
షట్సహస్రకులోద్భవసచివులందు, సుకృతిగాఁ జేయు నాకొక సుకృతిఁ జెప్పి. 23
శా. ప్రఖ్యాతంబన మిశ్రబంధ మన నుత్పాద్యం బనంగాఁ ద్రిధా
వ్యాఖ్యాతం బగు వస్తువందు మఱి యధ్యాహారముం జేయఁగాఁ
బ్రఖ్యాతం బితివృత్తమైన కృతిచెప్ప న్వక్తకు శ్రోతకు
న్విఖ్యాతిం గలిగించుఁ బుణ్యమహిమ న్విశ్వంభరామండలిన్. 24
క. శృంగారము ముఖ్యంబగు, నంగియు నంగములు దలఁప నష్టరసములు
న్సాంగ మగునేని డంకము, బంగారముతోడి యొఱ ప్రబంధము వొందున్. 25
గీ. కథప్రసిద్ధము మిగుల శృంగారవతియుఁ, బరిగణింపంగ శ్రీమహాభారతమునఁ
గథితమైన శకుంతలాఖ్యానభంగి, నదిప్రబంధంబుఁ జేయు ప్రఖ్యాతినొంద. 26
సీ. సరపువ్వులుగ మాలకరి పెక్కుతెఱఁగుల విరుల నెత్తులుగఁ గావించినట్లు
కర్పూరకస్తూరికావస్తువితతిచే శ్రీఖండచర్చ వాసించినట్లు
ఒడికంబుగా గందవొడికి నానాసూన పరిమళంబులు గూడఁబఱచినట్లు
సరఘలు వివిధపుష్పమరందలవములు గొనివచ్చి తేనియఁగూర్చినట్లు
తే. భారతప్రోక్తకథ మూలకారణముగఁ, గాళిదాసుని నాటకక్రమము కొంత
తావకోక్తికి నభినవశ్రీవహింపఁ గూర్మిఁ గృతిసేయు నాకు శాకుంతలంబు. 27
వ. అని సవినయంబుగాఁ గర్పూరతాంబూలంబు జాంబూనదపాత్రంబున నర్పించి
ప్రార్థించినఁ దద్వచనప్రకారంబున మిశ్రబంధంబుగా శాకుంతలం బనుప్రబం
ధంబు బంధురప్రీతిం జెప్పఁబూనితి నేతత్ప్రారంభంబునకు మంగళాచారంబుగాఁ
గృతినాయకుని వంశావతారం బభివర్ణించెద. 28
క. ఖండేందుధరసమాను న, ఖండతపోరాజ్యసమధిగతపీఠస్థుం
గౌండిన్యుఁ జెప్పఁదగుముని, మండలముకుటావతంస మాణిక్యంబున్. 29

శా. తద్వంశాంబుధిఁ గల్గె మేడనసుధాధాముండు భూమండలి
న్విద్వత్సన్నుతశీలి యాచకసురోర్వీజంబు దిక్పాలయో
షిద్వక్షోరుహహారమౌక్తికమణిశ్రేణీలసత్కీర్తి జం
బూద్వీపావనిపాలమంత్రి విభవాంభోజాటవీచంద్రుఁడై. 30

ఉ. భూనుతవైభవస్ఫురణఁ బొల్పు వహించిన సోమరాజుప
ల్లీనగరామరావతికి లేఖపమంత్రియుఁ నీతివి
ద్యానిపుణత్వ మొప్పఁగఁ బ్రధానులలో నుతికెక్కె భామినీ
మీనపతాకమూర్తి యగు మేడన రాజులు గారవింపఁగన్. 31

సీ. లవణాబ్ధివేలహేలాకాంచి యగు నంధ్రధరణిమండలికి ముత్యాలజల్లి
సంగ్రామపార్థరాజన్యరాజ్యశ్రీకిఁ బెంపుమీఱిన జగజంపువెల్లి
దాతలు సముదంచిత ప్రమాణములుగాఁ గామితార్థములిచ్చు కల్పవల్లి
యఱువదినాల్గువిద్యలకు నపూర్వఘటాపథంబైన పట్టనమతల్లి
తే. పంటనృపకాన్తభములకుఁ బాలవెల్లి, కదనజయలక్ష్మి తొలుచూలుగన్నతల్లి
విపులభుజగర్వదర్పితవిమతరాజ, రాజిహృద్భల్లి ధరసోమరాజుపల్లి. 32

క. ఆనగరము పైతామహ, మైన నిజస్థానముగ సమంచితలక్ష్మిం
దానొంది మంత్రి మేడన, జానుగ భజియించె సప్తసంతానములన్. 33

క. ఆ మేడనమంత్రికి సా, ధ్వీమణి మాచాంబకున్ శ్రుతిత్రయముగతి
నాగ్నిత్రయంబు పోలిక, నాముష్యాయణులు గలిగి రనుపమతేజుల్. 34

వ. అందు. 35

శా. దుగ్ధాంభోధిగభీరు రూపజితచేతోజాతు నుద్యత్ప్రభా
రుగ్ధాముం గరుణాభిరాము ధృతిమేరుక్ష్మాధరంబు న్సుధా
దిగ్ధస్వాంతు నితాంతదాన సురపృథ్వీజాతము న్బాంధవ
స్నిగ్ధుం జిల్లరయొజ్జయప్రభుమణిం జెప్పందగుం బెంపునన్. 36

శా. ఆ యొజ్జయ్యకుఁ గూర్మితమ్ముఁడగు వెన్నాఖ్యుండు ప్రఖ్యాతిగా
మ్రోయించె న్బహుతేశభూవరసభామూర్ధంబులం దుల్లస
త్సాయంకాలనటన్మహానటజటాసంఘాటఘాటీవళీ
త్తోయస్ఫాలనఫక్కికానఘయశస్తుత్తుంభనిర్ఘోషమున్. 37

వ. తదనుసంభవుండు. 38

సీ. గౌతమమునినాథుచేత నొవ్వరి మేను వికృతి నొందనివాఁడు వేల్పుఱేఁడుఁ
బెండ్లిలో గిరిజాన్యబింబంబుఁ జూచుచోఁ దాల్మి వీఁడనివాఁడు తమ్మిచూలి,

కలశపయోరాశి చిలుకు కవ్వపు గమ్మ కుంది కబ్బినినాఁడు మందరంబుఁ
గాళికావిభుని డాకాలితాటింపులఁ గములఁ బారనినాఁడు కుముదహితుఁడు
తే. భోగధీధైర్యకాంతులఁ బోల్పఁబోలుఁ, గాని నాఁటికి నేఁ డీడుగారనంగ
వెలసె వెన్నయయనుజుండు వినయధనుఁడు, త్యాగశిబిరాజు చిల్లరనాగరాజు. 39
క. ఆ నాగసచివధీమణి శ్రీనాయకుఁ డిందిరను వరించినకరణి
న్మానవతీతిలకముఁ బృథ్వీనుతగతిఁ బోతమాంబ వివాహం బయ్యెన్. 40
ఉ. ఆ పురుషావతంసమున కా సుచరిత్రకు నుద్భవించి రు
ద్దీపితకీర్తి వెన్నయయు ధీనిధి మేడనయు న్సమస్తవి
ద్యాపరమేష్ఠి యాదెనయు ధార్మికుఁ డెఱ్ఱనయు న్సుధాను స
ల్లాపుఁడు వీరభద్రుఁడును లాలితనీతికళాధురంధరుల్. 41
వ. ఇట్లు సమంచితదానవంచితకల్పతరుపంచకంబగు నా యమాత్యకుమారపంచకంబు నందు. 42
మ. కులపాథోనిధిపూర్ణచంద్రముఁడు దిక్కుంభీనహేలాకటు
స్థలనీరంధ్రమదప్రవాహలహరీచక్రాంగసత్కీర్తికుం
డలిరాట్కుండలిపూజనారతుఁ డఖండశ్రీసమన్వీతుఁడై
వెలసెం జిల్లర వెన్నమంత్రి సకలోర్వీచక్రవాళంబునన్. 43
క. వెన్నయ కూరిమితమ్ముఁడు, సన్నుతచరితుఁడు సమస్తజనసమ్మతుఁ డ
త్యున్నతవాచావైభవ, పన్నగపతి మేడ మంత్రి ప్రస్తుతి కెక్కెన్. 44
ఉ. మేడన పేర్మి నొందెఁ బుడమిన్నయసంపద దేవమంత్రితో
నీ డన యాచకావళి కభీష్టపుటీగులకల్పశాఖికిం
జో డన ధీజనస్తుతవచోవిభవంబున శేషచక్రివాఁ
డో డన సాటివా రతనితోఁ బెఱమంత్రులు జాడు బేడనన్. 45
శా. ఉన్నారెన్నిక కెందఱో సచివులత్యుచ్చేడరు ల్వాలసం
పన్నుల్వారలఁ గింపచానుల గణింపంబోరు వాగ్వైఖరు
ల్మిన్నుల్మోయ వెలుంగు సత్కవిజను ల్మెచ్చయ్య వర్ణింతు రా
వెన్నామాత్యు ననుంగుఁదమ్ముని జగద్విఖ్యాతచారిత్రునిన్. 46
క. ఆతనియనుజన్ముండగు, నాతఁడు బుధవిబుధతరువు నళినదళాక్షీ
నూతనమదనుం డామె భూతలము యశఃపటీరమున వాసించెన్. 47
ఉ. ఆదినృపప్రధాను లెనయాదురుగాని సధీగుణంబుల
న్మేదిని నేఁటివారి నుపమింప సమానులుగారు ధర్మస
మ్మోదికి సత్కళానివహమోహనవేదికి లోకహృన్ముదు
త్పాదికి మిత్రభృత్యహితబంధువినోదికి మంత్రియాదికిన్. 48

సీ. కులసమాగతధర్మగుణరక్షణమున సీతాకాంతు రెండవతమ్మునికిని
నవికారనవమోహనాకారమునఁ బురందరసూతి రెండవతమ్మునికిని
సన్నుతాక్రాంతవిశ్రాణనంబునఁ బరేతస్వామి రెండవతమ్మునికిని
సుకృతసాధురక్షణాశోభితామలబుద్ధి దశకంఠు రెండవతమ్మునికిని
తే. ధరణి వెన్నయ్య రెండవతమ్మునికిని, సాటియనవచ్చు నవవిలసద్గుణముల
నఖిలబంధుజనంబుల నాదరింప, సన్నుతివహించు నాదెన సచివవరుఁడు. 49
వ. తదనుసంభవుండు. 50
సీ. జలజసంభవుఁడు ప్రజ్ఞావిశేషంబున నిర్జరాచార్యుండు నీతిగరిమ
వాతాశనస్వామి వాచానిరూఢత ధర్మనందనుఁడు సత్యప్రశస్తి
జహ్నుకన్యాసూతి సచ్చరిత్రంబున శైలారి శంభుపూజనము కలిమి
జామదగ్న్యుఁడు ప్రతిజ్ఞాపాలనంబున సౌమిత్రి భ్రాతృవత్సలత పేర్మి
తే. వంశవనవాటి చైత్రుఁ డన్వయపయోధి, చందురుఁడు గోత్రజలజకాసారతిగ్మ
కరుఁడు కులనందనారామకల్పతరువు, మహితగుణశాలి యజ్ఞనామాత్యమౌళి. 51
గీ. యజ్ఞనామాత్యు ననుజన్ముఁ డహిపభూష, ణాంఘ్రిపంకేరుహభ్రమరాయమాన
మానసుఁడు మానధనుఁ డసమానగుణుఁడు, వీరభద్రుండు వితరణ విబుధతరువు 52
ఉ. ఈ జగమెల్లనుం బొగడు నెప్పుడు నెన్నికచేసి నిత్యవి
భ్రాజితనీతిమార్గబలభద్రుని జాతకృపాసముద్రునిం
బూజితరుద్రుని న్వివిధపుష్పశరాసనకేలిభద్రుని
వ్రాజితదానసంపదమరుద్రుని జిల్లరవీరభద్రునిన్. (?) 53
వ. ఇట్లు విశిష్టమాతాపితృజన్ములు నభినందసౌజన్యులు నగు వీరలయందు. 54
సీ. కూర్చుండుపయసునఁ గూర్చుండ నేర్చెను ననుదినత్యాగసింహాసనమునఁ
గొంకక నడ నేర్చుకొనుచుండి నడనేర్చెఁ దప్పక వేదోక్తధర్మసరణి.
మాటలాడఁగ నేర్చు నాఁటనుండియు నేర్చెఁ బలుకంగ హితసత్యభాషణములు
చదువంగ వ్రాయంగ సరవడి నేర్చియు నేర్చెను గార్యంబు నిర్వహింప
తే. వినయమున కాకరంబు వివేకమునకు, సీమ జన్మస్థలంబు దాక్షిణ్యమునకు
నాలవాలంబు విద్యల కరయ మూర్తి, మరుఁడు చిల్లరవెన్నయామాత్యవరుఁడు.55
చ. అతఁడు వివాహమయ్యె సముదంచితవైభవమొప్పఁగాఁ బతి
వ్రత యగు భైరమాంబయును వర్ణితనిర్మలవాగ్విలాస వా
క్పతియగు సూరమంత్రియును భాగ్యఫలంబునఁ గన్న యన్నకన్
క్షితి ననమాయతోర్ధ్వ సరిసేయఁగవచ్చు సద్గుణాన్వితన్. 56

సీ. మాంగళ్యశృంగార మంగీకరించి వర్తించుచోఁ బార్వతీదేవిగుణము
నఖిలార్థులకును నిష్టార్థంబు లిచ్చి సంభావించుచో రమాదేవిగుణము
హితమితోక్తులచేత నెదిరికిఁ బ్రీతి నొందించుచో భారతీదేవిగుణముఁ
బరమపాతివ్రత్యపరతమై పతిభక్తి గావించుచో శచీదేవిగుణము
తే. వరుసఁ జేనోము నోచి యొప్పారసెఁ గాక, సతుల కిట్టిగుణంబులు జగతిఁ గలవె
యనఁగఁ బొగడొందె సుతబంధుజనకదంబ యాస్యజితపూర్ణశశిబింబయన్నమాంబ
శా. శ్రీవత్సాన్వయసింధుజాత యగులక్ష్మిం బ్రీతి నన్నాంబికం
దేవింగా వరియించి యాపరమసాధ్వీమౌళిరత్నంబుతో
శ్రీవత్సాంకుఁడు వోలె వెన్నన ఘనశ్రీమంతుఁడై సత్కృతు
ల్గావించె న్నిజబంధుమిత్రతతికిం గార్హస్థ్య మొప్పారంగన్. 58
సీ. రక్షించె బంధువర్గముఁ బ్రమోదం బంద నర్థులకిచ్చె నిష్టార్థసమితిఁ
గట్టించె ఘనతటాకంబు లంబుధులుగా ధర్మకాననములు తఱుచు నిలిపె
స్థిరసమున్నతి సంప్రతిష్ఠించె నల్లిండ్లు వరనిధానంబులు త్వరఘటించె
నన్నసత్రము లెడరైనచో సాగించె నోలిఁ జేయించె దేవోత్సవములు
తే. సప్తసంతానవతిఁ జేసె జలధినేమిఁ, జేసె ధర్మంబు లెన్నేనిఁ జెలువమిగులఁ
జేయుచున్నాఁడు సుకృతంబులాయతముగ, మనుజమాత్రుండె వెన్న యమాత్యమౌళి
మ. వెలయం జిల్లర వెన్నయప్రభుఁడు దా వేదోక్తసంసిద్ధి వే
శలఁ బ్రాసాదపుఁ బంచవర్ణమునఁ గాలగ్రీవుఁ బూజింపఁగా
నలవాలై మతి యొండెఱుంగవు తదీయశ్రీనివాసంబునం
బలుకుం బంజరశారికాశుకములు న్పంచాక్షరీమంత్రముల్. 60
చ. విడువక సోమవారములు వెన్నన సేయఁగ వత్సలత్వ మే
ర్పడఁ దనుదాన వచ్చి నిజభక్తముఖంబుల నారగింపఁగాఁ
దడఁబడిపోక గంధములతావులు పూనిన షడ్రసంబులం
గడుఁగఁబడెం గళస్థవిషకల్మషమర్ధశశాంకమౌళికిన్. 61
సీ. విలసితంబైన కావలి వెన్నమారాధ్యమణిదత్తయగు శైవమంత్రశక్తి
సమధికస్ఫూర్తితో శాశ్వతైశ్వర్యబీజంబైన శంభుపూజాఫలంబు
ప్రమథాధిపతిఁ గూర్చి భక్తితోఁ గావించు సోమవారవ్రతసుకృతగరిమ
యన్నమాంబిక కంధరాంతరంబునఁ జాల శోభిల్లు మంగళసూత్రలక్ష్మి
తే. సకలసౌభాగ్యములకును సాధనములుఁ, గారణంబులుఁ దగుబోధకములుఁ గాఁగ
సచివసంఘంబులోనఁ బ్రశస్తిఁ గాంచె, విశ్వనుతకీర్తి చిల్లర వెన్నమంత్రి. 62

## షష్ఠ్యంతములు.

క. ఏతాదృశగుణగణ వి, ఖ్యాతునకును నిత్యఘనదయాన్వితునకున్
శ్రౌతపదానందునకును, బోతాంబాగర్భజలధిపూర్ణేందునకున్. 63
క. శరనిధి గాంభీర్యునకును, బరహితకార్యునకుఁ దుహితపర్వతకన్యా
వరపదపంకజపూజా, కరికాలునకును నిరస్తకరికాలునకున్. 64
క. బాలామదనునకు రమా, హేలాసదనునకు బంధుహితజనరక్షా
శీలాయతమతికిని నిఖి, లేలాజనవినుతసురమహీధరధృతికిన్. 65
క. కౌండిన్యగోత్రునకు ను, ద్దండాహితసచివమతిలతాదాత్రునకుం
బండితచింతామణికిఁ బ్ర, చండవచోవిభవవిష్ణుశయ్యాఫణికిన్. 66
క. అన్నాంబికాసమంచిత, పన్నలిసాదిత్యునకు మహీదెవిజానీ
కొన్నత్యునకును జిల్లర, వెన్నామాత్యునకు సత్కవిస్తుత్యునకున్. 67
వ. అభ్యుదయపరంపరాభివృద్ధియు నభీష్టఫలసిద్ధియుం గా నాశీర్వదించి నాయొనర్పంబూనిన శాకుంతలకావ్యకథాలతాలవాలం బగు పురీలలామంబు. 68
సీ. పద్మరాగోపలప్రాకారరుచిజాలగండూషితవ్యోమమండలంబు
పాతాళజలరుఖరిపర్యాప్తకల్లోలసుకుమారపరిఘాపశోభితంబు
శక్రనీలశిలావిశాలగోపురరోచిరసమయజనితమిథ్యాతమంబు
కనకగోపానసీఖచితముక్తాఫలరాజీవలగ్నతారాగణంబు
తే. రాజసదనాగ్రదేశవిరాజమాన, తోరణాలీనమణిగణద్యుతివితాన
విఫలలక్ష్మీవిలంబిత విబుధేంద్ర, చాపరుచిచాపలము హస్తినాపురంబు. 69
ఉ. ఆపురి నున్నతస్ఫటికహర్మ్యవిభాపటలంబు నింగి ను
ద్దీపితమై చెలంగ నది దివ్యతరంగిణి యొత్తివచ్చెఁ దా
నీవయి త్రోవనంచు బయ లీఁదుచుఁ గోయఁదలంతు రగ్రసం
స్థాపితహేమకుంభములు తామరలంచు వియచ్చరాంగనల్. 70
మ. దివిఁ బ్రాకారము ముట్టియుండఁగఁ దదుద్దేశంబునన్ గోటతోఁ
దవులుం జక్రము నిక్రమించుఁ బురిమీఁద న్నాక పార్శ్వంబులం
గవనుందోవ ననూరుయత్నమున రాఁగా నొటఁగాఁబోలుఁబో
రవితే రుత్తర దక్షిణాయనములం బ్రాపించి దీపించుటల్. 71
శా. ప్రాసాదోపరి నాట్యశాలికల పైఁ బద్మాననల్ నర్తనా
భ్యాసక్రీడ లొనర్పఁ దద్భ్రమిగతుల్ వ్యాయామజంబైన ని

శ్యాసామోదముఁ బ్రోదిసేయు నికటస్వర్వాహినీకూలకు
ల్యాసంవర్ధితకేసరప్రసవమధ్యాసారసౌరభ్యముల్.

చ. మెలఁతుక లప్పురి న్నిడుదమేడలఁ గ్రీడలు సల్పుచుండి మిం
చులు జళిపించు కన్గవల సోరణగండ్లను జూడ నీడగుం
దెలుపును నల్పుఁగూడ నెడతెర్వని చూపులఁ గైరవంబులుం
గలువలు దోరణావళులు గట్టినయోజల రాజవీధులన్. 73

క. పురికోట రత్నదీప్తుల, నరుణములై చుక్కలుండ నంగారకునిం
బరికించి యందుఁ దెలియక కరమువిచారింతు రెంత కార్తాంతికులున్. 74

క. పరిఘుజలంబులు మొదలను, సురనదినీరాడుపరిక చుట్టుననుండం
బురికోట లగ్గవట్టఁగ, నరిది వితర్కింప వాసవాదులకైనన్. 75

చ. శ్రుతి గవుడొందినం గమలసూతికినైనను దీర్చిచెప్ప నే
రుతురు పురాణశాస్త్రములు ప్రొద్దున నిండ్లను గీరశారికా
తతులు పరీక్షలీ విని ముదంబును బొందుదు రింద్రుపట్టముం
గ్రతువులు చేయునర్చినను గైకొన రప్పురి విప్రసత్తముల్. 76

ఉ. మందరగోత్రధీరు లభిమానధను ల్పరభేదివచ్చినం
గ్రిందుపడంగ నేరనియరిందము లంచితనిత్యభోగసం
క్రందను లార్తరక్షణపరాయణు లంబుజలోచనాళుక
స్యందను లర్థిలోక హరిచందను లాపురిరాజనందనుల్. 77

ఉ. వెచ్చము పెట్టుమన్నఁ బదివేలకు నుద్దరువోల్ల రర్థము
ల్దెచ్చిన శేషునాదలల దివ్యమణు ల్వెలెనన్న విల్వలక్ష
హెచ్చును గుందునాడుకొన కిత్తురు లాభముఁ గోరకెన్నఁగా
నెచ్చటఁ గోటికింబడగ యెత్తనివైశ్యులు గల్గరప్పురిన్. 78

క. సంగరము లేకయుండిన, సింగంబులఁ బులుల సమదసింధురముల నే
కాంగిఁ దొడరి పడవైతురు, పొంగునఁ దమ కుబుసుపోక పురి వీరభటుల్. 79

శా. పక్షంబు ల్మును శాలిహోత్రుఁడు శపింపం బోయినం బోవ నీ
శిక్షానైపుణి నర్కతేజుల నధిక్షేపింపఁగాఁ జాలిన
ట్లక్షీణత్వర నింగినైన గతిసేయుంజాలు నుచ్చైశ్శ్రవ
స్సాక్షాత్కారము లప్పురిం దురగముల్ ఘుంపాకళాసంపదన్. 80

మ. గణనాతీతములై సురేంద్రుఁ డెఱుక ల్ఖండింప వజ్రాయుధ
వ్రణరక్తంబున బిందువు ల్పొడముఁగా వర్తిల్లు జాతవ్యథా

క్వాణనంబై పటుబృంహితంబులు చెలంగ స్వామ్య మొందింపఁ బ
ట్టణమార్గంబునఁ బడ్డ పెద్ద నడగొండలో వ్వేలు శుండాలముల్. 81

సీ. హరినీలరుచుల నీలాలకంబులు గావు చిత్తజు మధుపశింజినులుగాని
క్రొన్నెలవంకలాగుల భ్రూలతలు గావు విషమాస్త్రు తియ్యని విండ్లుగాని
యలసంబు లైన వాలారుఁ జూపులుగావు రతిరాజు మోహనాస్త్రములు గాని
బంధురస్థితిఁ బొల్చు కంధరంబులుగావు కందర్పు విజయశంఖములు గాని

తే. నలినదళలోచనలు గారు నమువ నేర్చు, కంతునవశస్త్రశాలలుగాని యసఁగ
నంగకంబుల సౌభాగ్య మతిశయిల్ల, వారసతు లొప్పుదురు పురవరమునందు. 82

చ. వెలమఁ దగం బ్రినూనములు వేఁడుచు మార్వరికింప నెత్తులం
గలసి చిగుళ్ళు వెట్టి యడకట్టిన క్రొవ్విరిమొల్లపూవు లె
త్తులు దళవాధురద్యుతులఁ దోఁచినఁ బైకొసరేవిగా విటు
ల్వ్రాలువఁగ వారిచిత్తములు విల్తురు తత్పురి పుష్పలావికల్. 83

చ. సరసుల్ చొచ్చి సరోజకోటరకుటీసంవర్తి కా చారు కే
సరగుచ్ఛంబులు గ్రొచ్చి బాహ్యావనపుష్పశ్రేణి నిర్యన్మధూ
త్కరమముం దెచ్చి తదీయ సౌరభము లుద్గారింపుచు న్సంతత
స్మరసంజీవనమై చరించుఁ గలదు న్మందానిలుం డప్పురిన్. 84

గీ. శశవిషాణంబు గగనపుష్పంబు లైన, వణిజాలిందులలో వెలుపంగఁ గలవు
హంసగమనల మధ్యంబులందుఁ దక్క, లేమి యేవస్తువులయందు లేదు పురిని. 85

వ. ఇత్తెఱంగున సమస్తవస్తువిస్తృతిఁ బ్రిస్తుతివహించి పయఃపారావారంబు ననుకరిం
చుచు సర్వతోముఖదర్శనీయంబును సదాగతిసంచారసమంచిత బహులహరీమనోహ
రంబును సంతతానంతభోగలీలాలాలితపురుషోత్తమోపేతంబును సమున్నతలక్ష్మీజన
కంబును నై యమరావతియునుంబోలె శతమఖపవిత్రాయమానంబును నలకాపురంబు
నుంబోలెఁ బుణ్యజనాకీర్ణంబును మధురాపురంబునుంబోలె నుగ్రసేనాభిరతంబును
నంతరిక్షపథంబునుంబోలె ననువర్తితమిత్రరాజసంబంధంబును బతమేశ్వరు వామ
భాగంబునుంబోలెసర్వమంగళాలంకృతంబును మేరుమహీధరంబునుంబోలెఁగల్యా
ణమహిమాస్పదంబును మహాకవి ప్రబంధంబునుంబోలె నుత్తమశ్లోకబంధురంబును ✓
రత్నాకరంబయ్యును గుట్టిమప్రదేశనుగమంబై ముక్తామయుం బయ్యును భూరిక్ష
యోపేతంబై పరికటితపర్జన్యవైభవోదారంబయ్యును జిరప్రభాభాసురంబై మంగ
ళాచారమహితం బయ్యును సౌమ్యపరిచారికాధిష్ఠితంబై యారూఢపాతివ్రత్యంబు

క్రీడాకందుకంబులయందును బరిచితస్నేహనాశంబు రత్నదీపంబులయందును నీర
సత్వంబు సముద్రంబులయందును ద్రాసదోషంబు పద్మరాగాది మణులయందును
యతినిబంధంబు పద్యంబులయందును దారిద్ర్యంబు విద్రుమాధరామధ్యంబులయందును
బదచ్ఛేదంబు వాక్యంబులయందునుగాని దనయందుఁ గలుగదనవొప్పు నప్పురంబు
కప్పురంపు దాళువాళించు సన్న సున్నంబుచేత లేఁత వెన్నెలల నెమ్మించు
గ్రొమ్మించులుం గలమేడలును విరాజితంబగువాడలును రేయెండకు మాఱుమందు
పదాఱువన్నెబంగారుముద్దవరుస నద్దుకొనవైచి యద్దంబులమీఁదు వలె నుండ నున్నఁ
జేసి విన్ననువున మెఱుంగువెట్టినం ద్రొక్కిన జిక్కం జీరువారుచుం దళతళ
వెలుంగువేదులును విలసితంబులగు వీధులును బూర్వంబునం బార్వతి యొఱింగిన
తెఱంగగ్గిరికన్యచేతం బాణపుత్రి నేర్చినరీతి న్నారక్షోరాజి రాజనందనచేత ద్వార
వతీగోపికాపికవాణు లభ్యసించినబుద్ధి శుద్ధదేశివృత్తంబుల విశేషంబులు భిత్తిభాగం
బులం జిత్తరువులం జిత్తరంజకంబులగుచుఁ బ్రత్యక్షభంగి నంగీకరించు విలాసలీల
లను విలసిల్లు నాట్యశాలలును నొక్కడీఁక నాకసంబెక్క విశ్వకర్మనిర్మించిన నాకు
రంబులఁ బోలుచుగోపురంబులమీఁదికి రాఁబో నుసరంబులు గాఁ గట్టినం గాకుకొనుచు
నేచిన మేచకద్యుతులు పుక్కిలించు శక్రోపలసోపానంబు లన పాదపంబు
లగు ప్రాసాదంబులును నుదంచచ్చంచరీక చక్రహంసక్రౌంచజలపక్షికులకలకలంబు
లం గొలకొలమను కొలంకులనలంకరించు పంకరుహకుముదకువలయకల్హారషండంబులం
దండతండంబు లగు తావులం గదంబించు బావులును జిత్తంబులుబ్బ గబ్బితనంబున
విత్తంబు లొడ్డి నెత్తంబు లాడి యోడినధనంబు లాడినంగాని పెట్టమను దిట్టమాటలం
బుట్టిన జగడంబులు విగడంబులై యుద్ధపతత్త్రంబులం గొనివచ్చు జూదరిదట్టంబుల
హెచ్చుగురచ్చకొట్టంబులును గలిగి వినోదంబులకు నాకరంబును విశ్రామంబులకు
సీమయు విక్రమంబునకు నెలవును విజయంబునకుఁ దానకంబును విద్యలకు నుపా
ధ్యాయయు వితరణంబులకు సదనంబును విభవంబులకుఁ బ్రభవస్థానంబును విలసనంబు
లకు వినిమయంబును నైన యప్పురి కధీశ్వరుండు.

సీ. విశ్వసన్నుతశాశ్వతైశ్వర్యపర్యాయకుటిలకుండలి రాజకుండలుండు
దిగిభశుండాకాండదీర్ఘబాహాదండమానితాఖిలమహీమండలుండు
జనసన్నుతానన్యసామ్రాజ్య వైభవశ్లాఘాకలిత పాకశాసనుండు
కులశిలోచ్చయసానుకోణస్థలన్యస్త విక్రయజయశాసనుండు

తే. భాసమాన మనీషాంబుజాసనుండు, సకలదేశావనీపాలమకుటనూత్న
రత్నరారజ్యదంఘ్రినీరజయుగుండు, శంబరారాతినిభుఁడు దుష్యంతవిభుఁడు. 87

మ. రజనీనాథకులావతంసుఁ డనిధారాదారితారాతిరా
డ్గజకుంభప్రణమార్గనిర్గళితముక్తారక్తహారుండు స
ద్ద్విజసంతర్పణకేళిలోలుఁ డఖిలద్వీపావనీపాల ది
గ్విజయాన్వీతుఁడు పాపభీతుఁడు మహాధీరుం డుదారుం డిలన్. 88

మ. ప్రజ లెల్లం జయ వెట్ట ధర్మమహిమం బాలించె వీరారిభూ
భుజుల న్వ్రేల్మ్రులఁ జేసి యధ్వరములం బ్రోచెం బదాంభోజన
మ్రజనాధీశులఁ గాచి నిల్పె నిజసామ్రాజ్యంబుల న్సర్వసా
ధుజనస్తుత్యుఁడు సత్యకీర్తి యగు నా దుష్యంతుఁ డత్యున్నతిన్. 89

సీ. నిచ్చెనఁ జేసె దోర్నిశితాసి కే రాజు దివి కేగు సమదపృథ్వీభుజులకుఁ
గల్పవృక్షముఁ జేసెఁ గరకాండ మే రాజు భూచక్రమునఁ గల యాచకులకు
గేహాబ్జములు చేసె గ్రీగన్ను లే రాజు చెలఁగి సంక్రీడింప సింధుసుతకుఁ
బూఁటకాఁపుగఁ జేసె భుజభక్తి నే రాజు ఫణిరాజు మోచు భూభరమునకును.

తే. ననుచు వర్ణింపఁ దగదె శీతాంశువంశ, రాజహంసంబు దానధారాప్రవాహ
జలపరిక్షాళితాఖిల కలుషనికరు, సంచితాశాంతకృపు నిదుష్యంతనృపుని. 90

ఉ. ఆ జననాథయూథమణి యం దుదయంబును బొంది దిగ్జయ
వ్యాజమునం బ్రతాపనలినాప్తుఁడు కీర్తివిధుండు రాఁ దదు
ద్వేజితులౌటఁ గాదె పరివేషమిషంబున నాత్మగుప్తికై
యోజ నమర్చికొందురు రవియుం గమలారియు నింగి వప్రముల్. 91

సీ. ఆలానదండంబు హేలాహవాహూతరిపురాజధరణీకరేణువునకు
మానదండము మహామనుజేశ సర్వాబ్ధిగంభీరతాపరీక్షావిధికిని
నాళదండము సమున్నతజయశ్రీవధూసముచిత క్రీడాబ్జసౌధమునకు
నాధారదండంబు హరిణాంకకులకుభృజ్జనశుభ్రకీర్తిధ్వజంబునకును

తే. యష్టిదండంబు వృద్ధశేషాహిపతికి, మూలదండంబు సైన్యసముద్రతతికి
కాలదండంబు శాత్రవక్ష్మాపగతికి, బాహుదండంబు చెప్పఁ దత్పార్థివునకు. 92

చ. జగమున రెండుతత్త్వములు శాస్త్రులు చెప్పుదు రందులోపలన్
జగడము గాని యొక్కరయినం బొడఁగానరు వానిరెంటిలో
సగుణముఁ బట్టి నిర్గుణము శత్రువధూగళసీమలం జను
ల్పొగడఁగఁ జూపు నవ్విభుఁ డపూర్వముగా ఘనశాస్త్రపద్ధతిన్. 93

ఉ. పాయక శిష్టలోకపరిపాలనముం బహుదుష్టశిక్షయుం
జేయుచు రాజ్య మవ్విభుఁడు సేయఁగఁ దార్చు నిజప్రయోజనం

చే యెడలేక యున్న ధరియింతు రుదంచితలాంఛనార్థమై
తోయజనాభుఁడు న్శ్రీవినుతుండు సుదర్శనకాలదండముల్. 94

సీ. చెఱుపనేరఁడు విశ్వసించి యుండినవాని నభిలషింపనేరఁ డన్యవనిత
నిందింపనేరఁడు నీచశత్రుగణంబు బొంకనేరఁడు హాస్యమునకుఁ బలికి
విడువనేరఁడు చెడ్డవిటునిఁ జేపట్టినఁ గడపనేరం డర్థిగణమువాంఛ
నడుగువెట్టఁగనేరఁ డపయశం బగుత్రోవఁ జనఁగనేరం డార్తజనమువిడిచి

తే. యైదు పదిసేయనేరఁ డాహవముఖమునఁ, గ్రీడించునందును నేరఁడు గీడొనర్ప
ననుచు నేరము లెన్నుదు రవనిజనులు, విపులయశుఁడైన దుష్యంతవిభునివలన.

వ. ఆరాజపరమేశ్వరుం డొక్కనాఁడు శుకతుండరోచిరుద్దామవిద్రుమస్తంభసంభార
సమున్నతంబును హాటకమణివిటంకాలంకార విశ్రుతనిశ్రేణికాపదగమ్యమానచంద్ర
శాలోపకంఠంబును గంఠేకాలకంఠమేచకరుచికచాకచిక్రీడాచతుర సితేతరపట్ట
పటలపాళిలంబముక్తాఫల వితానతారకితవియత్సీమంబును నత్యంతసమున్నతిమదుప
రినిశాతశాతమన్యవశిలాశలాకానీకనీలచ్ఛర్దిఃలగ్నవినూత్నరత్నకేసరస్తబకనిబిడబి
సకనకకుముదారవింద సౌగంధికసందర్శితకపటగగనపుష్పంబును నభిరామదూర్వా
దళదామకోమలప్రభాపటల గర్వసర్వస్వపశ్యతోహరహరిదుపలభిత్తి కాంతరజిత
రూపవాతాయనంబును నశ్లక్ష్ణకిరణచ్ఛవిచ్ఛటావిస్ఫుటస్ఫటికపాషాణఘటకసోపాన
మార్గనిర్గమప్రవేశద్వారవిద్యోతమానవిపులతపనీయకవాటాలంకృతంబును నభ్రంక
షశిరోభవనశిఖరస్థాపిత శాతకుంభకుంభకాంతి గండూషితనభోమండలంబును దివ్
యాంతరాస్తీర్ణవిచిత్రరత్నకుడ్యాధవవిన్యాసంబులశోభిల్లుసభాసౌధంబున నమూల్య
రత్నకీలనజాజ్వల్యమానకల్యాణభద్రపీఠాంతరంబున నాసీనుండైయొక్కముం జవా
ణివింజామరంబును నొక్కజోటి వీటికాపేటికయు నొక్క బాలయాలవట్టంబును
నొక్క కరటిగమన సురఁటియు నొక్క లేఁజిగురాకుబోణి కాళంజియు నొక్క
చందనగంధిగందవొడిబరిణయు నొక్క పుండరీకనయన యగరుధూపధూమకరండం
బును నొక్కకన్య పన్నీరుతోడి కప్పురంపుగిండియు నొక్కభృంగాలక బంగా
రుసంగెడయు ధరియించి డగ్గఱి కొలిచియుండఁ బాండ్యపల్లవపాణి యాటలాడ
ఘోటకకరహాటకళింగాంగ వంగబంగాళ చోళ నేపాళకాది భూపాలక కుమార
వర్గంబు దగిన నెలవులం బలసి సేవింప హితపురోహితామాత్యబంధుమిత్రభృత్యపాఠక
పీఠమర్దవిదూషకాదులు భజింప సుధర్మాంతరంబున నోలగంబైన దేవేంద్రుండ్ను
నుంబోలె సాంద్రవైభవంబునం గొలువుకూర్చున్న యవసరంబున

ఉ. జుంజుఱుతుల్ల వెండ్రుకల జొంపములుం గల మస్తకంబులుం
గెంజిగురాకుఁ గెంపుఁ దులకించెడువ్రుటువకన్నులుం జర
త్కుంజగచర్మపట్టములకున్ సరివచ్చు పెఱళ్ళ మేనులు
న్మంజులుగాల్వఁ గొందఱు సముద్ధతివచ్చి పుళిందవల్లభుల్. 97

సీ. కాననేత్తువుల ముక్తములైన ముత్యాలు ముదిరిపండిన మంచి వెదురుఁ బ్రాలు
దినములోఁ గ్రొత్తయొత్తిన కఱ్ఱజవ్వాది ముక్కలు మురియని మొరళిపప్పుఁ
జంద్రికారుచిఁ బొల్చు చమరవాలంబులుఁ బొందుగాఁ గాఁచిన పూతిమధువు
అలఁతి దంతంపుఁ గామల పీలినుగఁటులు శోధించి వడిచిన జుంటితేనె

తే. కప్పుఁబిల్లులపిల్లలు కారుకోళ్లు, కన్నుదెఱవని కస్తురిగమిశిశువులు
పులులకూనలు ఛల్లూకపోతకములు, నాదిగాఁ దెచ్చి పతి కుపాయనములిచ్చి. 98

వ. ప్రణామంబు లొనర్చి కేలుదోయిలు ఫాలంబులం జేర్చుకొని వినయవినమితస్కం
ధులై క్రిందిచూపుల నెఱ్ఱతారల వారం గనుగొనుచున్నవారల నవలోకించి చిత్తము
మృగయాయత్తం బగుటయు నృపోత్తముం డిట్లనియె. 99

క. బలముగఁ గ్రొవ్వినమృగములు, గలిగి సమీపమున నేఁటిఁ గాలువయేదేఁ
గలిగి తఱచైన తరువులు. గలిగిన పేఱడవి యెచటఁ గలదు గణింపన్. 100

క. నావుడు వారలు విభుతో, దేవర వేఁటాడవలసితే విచ్చేయం
గావలయును యమునాతటి, నీవరసీమంతి కావనీవనమునకున్. 101

క. క్రొమ్ముమ్ము వెతికిన నెత్తురు, సామములే దొడలు చయుపనం జేసినయ
ట్లామ గవిసియుండును నా, నాముఖయూధంబు లవ్వనంబునఁ గలయన్. 102

గీ. ఊళ్లకూళ్లు సమీపమై యునికిఁ జేసి, లేళమైనను గొరగామిగ లేమిఁ జేసి
యచటికొర్నెలఁ బసికి మేయంగఁ గలిమి, నగరి గీలార మున్నది నరవరేణ్య. 103

ఉ. జల్లెక పాటువడ్డ యుపసంబులు మేసి సమీపసీమలం
జల్లని నీరు ద్రావి సుఖసంగతి దాపులు గ్రేపు లాఁగఁ గాఁ
బొల్లగఁ జేరి గోవృషభముల్మది కింపులుసేయ నుండియుం
బల్లిక బెబ్బులుల్దిరుగ సాధ్వసమందును మందధేనువుల్. 104

ఉ. సాయక పుంఖితంబు లగు చాపములం ధరియించి యుక్కునం
బాయక రేయునుం బగలుఁ బాలెము వెట్టి మొకంబుఁ గన్నచో
నేయుచుఁ బొంచి రాఁ దెఱపి యీక చరియించుచున్న మంద క
త్యాయతవర్ణసత్త్వ నినదావళి వాసళి మాన దెప్పుడున్. 10›

గీ. కోలఁ బడి నైదుగుఁదిగుచ్చికొనఁగ నేయ, వచ్చు మృగముల నెమకంగవలదచట
పసికి నయ్యేడు కీడు వాపంగఁగలదు, వేడుకకు నిమ్మృగాఁగ వేఁటాడఁగలదు. 106
వ. ఆవల దేవరచిత్తంబు కొలఁది యనిన గోరక్షణంబుకొఱకును దుష్టమృగశిక్షణంబు వలన సుకృతంబుగా మృగయాసౌఖ్యంబు సిద్ధించె దేవరప్రసాదంబు జాదులుం బలె నయ్యెనని యమాత్యుల యనుమతంబునం గొలువుదీర్చి యందఱ సముచిత ప్రకారంబుల వీడుకొలిపి వేత్రహస్తులం బిలిపించి పట్టణంబున మృగయావిహార సన్నాహంబునకుం జాటించిన. 107

సీ. పులిమల్లుఁ డడవిపోతులరాజు గరుడుండు గాలివేగంబు పందేలపసిఁడి
విష్ణుప్రసాదంబు వేఁడిగుండులపరి పచ్చిమిరియము వెఱ్ఱిపుచ్చకాయ
వేఁటమాణిక్యంబు శరవాది మెడబల్మి పెట్టుఁగాఁడు వకారి పిడుగుతునుక
జిగురుఁడు చిత్రాంగి శ్రీరామబాణంబు పులియందు కస్తూరి బొడ్డుమల్లె
తే. యనఁగ ఖ్యాతియను బెక్కుతోయముల పేళ్ళు, దారకులు దేరవచ్చె నుద్దండవృత్తి
వేఁటకుక్కలు మృగరాజవిగ్రహములు, వటుకనాథుని వాహ్యాళివాహనములు. 108
మ. శబరుల్ బైడతాళ్ళఁ బట్టి దిగువం జండోద్ధతిం గిట్టి వ
ట్టిబయల్ ద్రవ్వుచు విద్వరాహముల గుండెల్ వ్రియ్య నాకాశముం
గబళింపం జనునోజ మోగ లెగయంగా నెత్తి గర్జిల్లఁగాఁ
బ్రబలెం గుర్కురకంఠనాళకుహరీభౌభౌమహారావముల్. 109
గీ. మృగయు లంతటఁ దెచ్చిరి లగుడు గిద్దు, జాలె జలకట్టె కణుజు వేసడము బైరి
కురుజు వారిణ మను డేగకొలము సాళు, వములఁ బిలుపుకు వేఁటకు వచ్చువాని
సీ. బంగారు మెరవడి పల్లనంబులతోడ గెంబట్టు కీలుపక్కెరలతోడఁ
ముఖసమర్పితహాటకఖలీనములతోడఁ గాంచన గ్రైవేయకములతోడ
సమకట్టిముడిచిన చామరంబులతోడఁ దాఁపఁబెట్టిన యడిదములతోడఁ
గనకఘంటలయూరుగజ్జెపేరులతోడఁ గర్ణకీలిక దీర్ఘకళలతోడఁ
తే. జిత్రమున వ్రాయఁగారాని చెలువుతోడ, నొప్పి యుచ్చైశ్రవముతోడి యుద్దులనఁగ
వాహకులు దేఱ వచ్చె దుర్వారలీల, వసుమతీనాయకుని పూజవారువములు. 111
సీ. వలనంబు పుట్టించి వంకంబు వలయించి డిల్లాయి ప్రకటించి కేవచూపి
వరసంబు నొందించి పల్లంబు కలిపించి నిగుడంబు సమకొల్పి నెఱను నెఱపి
లలిగూర్చి లలిదేర్చి లాగించి శుంఖాలముల నోజవట్టించి ఖలువుదెచ్చి
[illegible] దెచ్చి [illegible] రసనిద్ధి [illegible]

తే. సాలుతావకములను గృత్యమ్ము లేదు, నరువదేనాసనంబుల నెఱిఁగి హరుల
నెక్కురసికులువచ్చిరి హెచ్చునగరి, రాగరవుతులు సమరానురాగమతులు. 112

సీ. జడలల్లి ముడిచి పాగడఁజో శ్శ్రైయులుదీర్చి తలముళ్ళు బలువుగా నెలవుకొల్పి
మృగముచేరఁగవచ్చు మొగసిరి చూర్ణంపుఁ దిలకంబు లలితసీమల ఘటించి
వాకట్టువదినికె చేకట్టుమండలు కరకాండమధ్యభాగములఁ దొడిగి
కులుచగాఁ గట్టిన కరకదట్టీపంచు నంతరమ్మున బిసి మూలుకొ పి

తే. వండిపోట్లును దడవిండ్లుఁ బాఅవాతి, యమ్ములును జిల్లకోలలు నడిదములును
వలఁతియాటెలు ధరియించి వచ్చిరంగ. రక్షకులు తాతతరముల పాఁతవారు 113

క. అరిగెలు నిష్ఠురబాహా, పరిఘులు ధరియించి నగరపాలురు నేతెం
చిరి శిఖిపటుజిహ్వాసమ, కరవాలద్యుతులు గగనకాలిమగఁడుగన్. 114

శా. సింగంపుంబొది వచ్చుచందమున వచ్చెం బోయ కాలారి యు
త్తుంగ శ్యామలదేహసంజనితకాంతు ల్వీరలక్ష్మీనవా
పాంగచ్ఛాయలతోడఁ బెల్లొదవి బ్రహ్మాయ స్వేల్లదుద్యద్భుజా
సంగత్వంగదభంగభంగురధనుర్జ్యావల్లరీ ఝల్లరుల్. 115

గీ. ఊరులు జిగురుగండె దెరలును బోనులు, వారువారెనలును వసులు గసులు
మిళ్ళువలలు పేట్లుగోళ్లుదీమంబులు, నాది గాఁగఁ దెచ్చి రాటవికులు. 116

వ. మఱియును మూలభృత్యబలంబును సామంతకుమారవర్గంబును సర్వప్రకారంబుల
సముచితాలంకారులు సాయుధులు సవాహనులు నై చనుదెంచి రప్పు డప్పుడమి
ఱేఁడు వేఁటకుం దగిన శృంగారం బంగీకరించి గతివిజితమనస్తురగంబులగు
తురంగంబులంబూనిన యరదం బెక్కి యిరువంకలన్మంగలింబింగలింజతురంగబలం
బులుగొలువ శంఖకాహళ వేణువీణామృదంగంబులు చెలంగ నెడలేక సందడిం గ్రం
దుకొన నమందవైభవంబున నం బురందరవైభవుండు పురంబు వెడలి వృద్ధహాయనంబు
మీఁద విదూషకుండగు మాండవ్యుండు దోడరాఁ గొంతదవ్వరిగి యొక్కచిక్క
ణప్రదేశంబున రథవేగంబుఁ దెలియు వేడుక సారథిం జూచి నిమ్నోన్నతంబులు
గాక యిచ్చట సమతలంబై యున్న యది నీహయంబులరయంబుఁ జూపుమనవుఁ
డు నతండు యుగ్యంబులపగ్గంబుల వదల్చి యదల్చిన. 117

సీ. కనుదృష్టి నెయ్యది మినుమినుక్కను మండు ఘనత వ్రేల్మిడిలోనఁ గానఁబడఁగ
నెడ త్రెవ్వియుండు నెయ్యదియోని నదికూడ నదికినచందాన నవ్వయింప
నెయ్యది విలువంక యై యుండుఁ బవమున నది సమరేకలో నంవమంద
దూరాన నెయ్యది తోఁచు నాలోకింప నది పార్శ్వమున లేక యవులఁ జనఁగ

తే. శ్రవణములు నిక్క నిక్కంపచామరాగ్రముగని రాయతపూర్వాంగములఁ దనర్చి
ఘనఖురోద్ధూతరేణువు గడవఁ బాఱి, నిగిడె భువి తేరిహయములు మృగజయములు.
వ. అయ్యవసరంబున. 119
గీ. కుక్కలలయకయుండఁగఁ గొంచువచ్చు, మంది యొకకొంత చిక్కనాస్యందనంబు
గూడి రారాక వడిచెడి కొంతచిక్క, ననిలగతి నేగురథ మెవ్వఁడంటఁగలఁడు.
క. సారథిఁ గనుఁగొని యపుడా, క్ష్మారమణుఁడు రథము దవ్వుగా వచ్చెఁ బరీ
వారము గూడదు రానై, వ్వారలు గలరిచట నిలువవలయు ననుటయున్. 121
వ. అతండును నృపాలకానుశాసనంబునం దేజుల నేఁగనీక వాగెలు గుదియించి వీఁపు
లునిమిరి నిలుపుటయు సకలజనంబులుం గూడుకొని యుల్లసితయానంబున మెల్లన
చని మంద చేరంజన నయ్యవసరంబున విజయకాహళారావంబు లాలకించి బిరుద
ధ్వజవితానంబు లవలోకించియుఁ దమరాజు రాకఁ దెలిసి నిసర్గభీరువులగు నాభీరు
వులు భీతచేతస్కులై నవీనంబగు హైయ్యంగవీనంబుఁ గానుక తెచ్చి ప్రణామంబు
లాచరించి కరంబులు శిరంబునం బెట్టుకొని తిర్యగాలోలంబు లగుచూపులం గద్గ
దకంఠులగుచుఁ బ్రస్ఖలిత వినయవాక్యంబుల నిట్లని విన్నవించిరి. 122

సీ. దూరంబువచ్చినవారిట సైన్యంబు ప్రజలెల్లఁ జాల దూపట్టినారు
నీర్వట్టుగొని దీర్ఘనిశ్వాసములతోడ వరరథ్యములు ప్రేలవైచెఁ జెవులు
వేఁటకుక్కలుడస్సి వివృతాస్యముల నిల్చి వగరించుచున్నవి దగలుదొట్టి
శిథిలపక్షముల నక్షియుగంబులనోర్మిడ్చి శ్రమనొందె డేగలు సాళువములు
తే. తిమురు మధ్యాహ్నమయ్యెను దేవ యిచట, నేఁడు కాలాఁగి మామందపాడిఁ జూచి
గోరసము పాయసంబులు నారగించి, నిగ్రహంబైన మమ్ము మన్నింపవలయు. 123
గీ. అనుచు విన్నపమొనర్చు నవసరమున, హయముడిగ్గి మాండవ్యుఁడు రయముతోడ
నవనిపాలునిరథము డాయంగవచ్చి, చేయి పుడిసిలివట్టి యాశీర్వదించి. 124
ఉ. ఒల్లమి చేసి వీరలకు నుత్తరమీకు నృపాల పెర్వాలుం
జల్లలు నమ్మ కొన్నయవి చాలఁగనున్నవి చిత్రిధాన్యము
లొక్కల్లలు త్రివ్వితండములు కప్పలు నేతులు పాలు వెన్నలుం
గొల్లలకేమిమాడె మనకు న్మతి కూడొకపూట వెట్టినన్. 125
క. కానిక కప్పము వెట్టరు, మానముదప్పఁ దిని క్రొవ్వి మనుబోతుల సం
తానమువలె నుస్నారీ, కాననమున రాచసొమ్ము గతముగఁ గొనుచున్. 126
వ. అది యట్లుండె నింక నొక్క విన్నపంబవధరింపుము. 127

గీ. వేఁట వోయెడువారలు విప్రుమాట, కలుగుమరు పాదపూర్వాన కలిగినట్లు
విన్నవింపక నాలుక మిన్నకుండ, దేచినీమేలుగోరెడు హితుఁడఁ గాన. 128

క. పాయసముం గలలో భూ, నాయక భోజనము సేయు నరులకు నెంతే
శ్రేయస్కరమని స్వప్నా, ధ్యాయంబునఁ జెప్ప వింటిఁ దజ్ఞుల చేతన్. 129

గీ. భోజనము సేయుమనఁగఁ దాంబూలగంధ, పుష్పములుగొమ్మనఁగఁ ద్రోచిపోవఁజనదు
ఇంపుతోడుత నంగీకరింపవలయుఁ. గార్యఫలసిద్ధి కవి యాపి కారణములు. 130

క. ఇలు వెడలి మానవుఁడు తన, తలఁచిన తావునకు జేరుదాఁకను నే యం
కిలిలేక యెక్క తీరుపు, వలయును శాకునికనరుల వచనవిధమునన్. 131

సీ. హర్మ్యంబు వెడల వాయసము చేరువఁ దీర్చె వృషభం బెదుర అంకె వేసి నిలిచె
వాడలో శునకంబు వచ్చెను దక్షిణాంబుదపూర్ణకుంభంబు లెదురు పడియె
గవని వెల్పట బెరిక యుఁ బోతు పలగొనె వల యెక్కు చూపెఁ జేవలఁతిఁ జెమురు
పరువు నేలను వచ్చెఁ బాలపయ్యెరపంక కుడినుండి యెడమకు నడిచె నక్క

తే. నీవు వేఁటకు విచ్చేయునెడ నృపాల, పంబి పెండ్లికి నగు శకునంబులయ్యె
నేఁడు గొల్లలమాట మన్నించి నిలిచి, మృగయ కరుగుట మిక్కిలిమేలు దేవ. 132

క. నావిష్ణుః పృథివీపతి, నావిష్ణుం డనగ నీవ నరవరదైవం
బీ వారగింపకుండిన, నీ వల్లవులకు శుభంబు లేలా కలుగున్. 133

వ. వీరలఁ గృతార్థులం జేయం గృపగల దేని యారగింపవలయు నది యన్నిదినంబులం
గోలెఁ గన్నయది లేదు దండుగదర్శనంబులు గొనందలంపయ్యె నేని ముందఱఁ జాగి
విచ్చేయు మనినగొల్లలుల్లంబునం దల్లడిల్లి యీ బ్రాహ్మణుండు పలికినది యథార్థంబు
మా యర్థప్రాణంబులు నీసొమ్ము వలసినట్లు చేసికొమ్మని నమాండవ్య ద్రిమ్మరి మాటలకు
దిగులుసొచ్చిన గోపాలకుల భూపాలకుఁడు మృదువచనంబుల నుపచరించి సైన్యంబు
సముచితక్రమంబున విడియించి కనకకుంభ కలితంబై కనుపట్టు గొల్లెనలం గృతా
వాసుండై. 134

సీ. పెనుపారు కడియంపుఁ బిండివంటలతోడఁ గమ్మని సద్యోఘృతములతోడఁ
గనరువోకుండఁ గాచిన యానవాలతోఁ గడిసేయవచ్చు మీఁగడలతోడఁ
బెక్కులాగులఁ గదంబించు జున్నులతోడఁ బేరి డాఁకొన్న క్రొంబెరుఁగుతోడఁ
జిడిచిన జమురు గారెడు మాంసములతోడ దేటతియ్యని జుంటితేనెతోడఁ

తే. పాయసాహారములతోడ శ్రేయులొసఁగ, నఖిలసేనాప్రజలతోడ నారగించి
సంతసంబంది పటకుటీరాంతమున జనవిభుండు భజించె నిశాసుఖంబు. 135

శా. కౌండిన్యాన్వయసింధుచంద్ర వినుతక్ష్మాపాలకామాత్యవే
దండానీకమృగేంద్ర చంద్రవిశదఖ్యాతా తారుణ్యకందర్ప శ్రీ
ఖండక్షోదవిపాండునిర్మలయశోగంగాజలక్షాళితా
జాండాఘోరకలంక శంకరనివాసాహార్యధైర్యోన్నతా. 136

కం. సురసురభి కల్పభూరుహ, తరణిజశిబిఖచరదేవతామణిరజనీ
కరకాలబలాహక సఖ, కరపద్మ సమస్తవిబుధకవినుతసద్మా. 137

మా. జనహిత సుచరిత్రా సజ్జనాబ్జాత మిత్రా జనితవృషపవిత్రా సత్యవిస్తోత్రపాత్రా
వనరుహదళనేత్రా సంకమాకంపచైత్రా యనుపమశుభగాత్రా యన్నమాంబాకళత్రా.

గద్యము.

ఇది శ్రీ భారతీతీర్థగురు శ్రీచరణకరుణాలబ్ధ సిద్ధసారస్వతపవిత్ర గాదయామాత్య
పుత్త్రయారాధితామరవీరభద్ర పిల్లలమఱ్ఱి పినవీరభద్ర ప్రణీతంబైన
శాకుంతల శృంగారకావ్యంబునందు
ప్రథమాశ్వాసము.



శ్రీ ర స్తు.

# శకుంతలా పరిణయము

ద్వి తీ యా శ్వా స ము.

శ్రీసదన సదారాధిత
వాసుకికేయూర వంశవర్ధన వినయా
వాసవయోజాసనక
న్యాసఖకీర్తిప్రసన్న నాగయవెన్నా! 1

వ. ఇత్తెఱంగున దుష్యంతమహీకాంతుండు సంతోషంబున ఘోషంబునవారాత్రినిలిచి మఱునాఁడు సూర్యోదయం బగుటయుఁ గాల్యకరణీయంబులందీర్చి లావరుల నేర్చి కదలి.

చ. మెకములఁ బట్టి గట్ట మిటి చనం జనసీశ యానఁ దెం
కిశిఁ జనఁజేయ బోనునకుఁ గిర్కొలువం బయి వచ్చె సేనిఁ ద
ప్పక పొడువంగ నేర్పు ఘనబాహుబలంబును గల్గి మేటినేఁ
టకు వెలివాడు లైన సుభటప్రకరంబులు మోహిల నేఁగఁగన్. 3

క. ముదమును మదమును మనమున, గుదిగొన గోష్ఠంబుఁగడచి కొండొకచని య
ల్లదె యిదె కాంతారం బన నెదురం జూపట్టుదాఁక నేఁగ నఖటన్. 4

సీ. ఛాయామృగంబుల వేఁటియ గర్జిల్ల (బ్రిచండమై పొడము భేరుండరవము
భేరుండ ఖినదకంపితశ్రుతులై పాఱెడు శరభసంతతి పొద్వసస్వనములు

శరభనినాదవిస్రస్తంబులై గమనించు కంఠీరవానిక్వణంబు
కంఠీరవారవస్ఖలితంబులై చను భీతవన్యకరీంద్రబృంహితంబు
తే. మక్కడింపఁ దదీశకల్పాప్రభీమ, ఘోరగిరిఘోషంబునను సత్త్వయూథవివిధ
సత్త్వరధ్వానములు బహుజాతపక్షి, కలకలంబులు వినవచ్చెఁ గర్ణములకు. 5
క. ఆరావములఁ గృతాంతా, కారములై వేఁటకుక్క కదుపులు వెలుచం
దారకులు పట్టి తిగువం, గా రయమున మృగయులను మొగంబుల కెగయన్ 6
గీ. సంతసం బందు నృపతియాస్యంబు జూచి, తిమురుకుక్కలబెడిదంపుఁ దెంపుచూచి
మృగయవర్గంబు గర్వంపుఁ బొగరుజూచి, యుల్లమునఁ జాలమాండవ్యుఁడులుకుపుట్టి.
వ. వనంబు జేరవచ్చితిమి, మృగంబులు గానవచ్చుచున్నయవి, యీ వచ్చినవారిలోన నెవ్వరిని విచారించినం గాతరత్వంబు లేదు పోతరంబు బహుళంబైయున్నది. ఏను వేఁడ బ్రాహ్మణుండ నిర్వాణ మృగంబులనవలోకించిన శరభస్వామి తలంపునంబడి పుట్టినశరభంబులును వైకుంఠకంఠీరవంబు మీఁది యుత్కంఠ నావిర్భవించిన సింగంబులును జాంబవంతుం డల్ల పనిచేయునప్పు డుప్పతిల్లిన భల్లూకంబులు నాగ్రహంబున వ్యాఘ్రచరక్షోభర్తలాక్షారుణాక్షంబుల నధిక్షేపించి చేయునిక్షుచాపవ్యాపారంబున నుదయించిన పులులును గుంభిదానవునకు సంభవంబైన యిభంబులును గృతాంతునిలాయంబులాయంబు సంతతిం బ్రబలినకాసరపోతులును గుహానా వరాహంబుపై మోహంబున సమూహంబైన పందులును గాని యేతన్మాత్రంబులుగావు. నాకుం బోవుట బుద్ధిగాదని మగుడ నుద్యోగించిన మందకును దూరంబుగా వచ్చితిమి నడగఁడు నడతెగి మానిసి మట్రిచిట్టాడని యీ చిట్టడివి నెట్లు చననేర్తు నొకయుపాయాంతరంబునఁ దోడుపెట్టించుకొనియెదంగాక యని యల్లనల్లన భూవల్లభుం జేరంజని యిట్లనియె. 8

సీ. కర్మకాండం బెఱుంగని పామరుండఁ గార్యాదిఁ జేకొని వినాయకునిఁ గొల్చి
వేఁటపైఁ బమి విఘ్నవిభుని బ్రార్థనము సేయకయ వచ్చినారము గమనవేళ
శరభశార్దూలాది చండసత్త్వంబుల మర్దించుకొఱకునై మనదురాక
మృగములు మనచేతఁ దగులువడంగ నందులఁ భీతి ప్రజలకు గలుగకుండ
తే. గజముఖుని నేను బ్రార్థింతు ప్రజములోనఁ బాలకును నేతి కుండ్రాలప్రాలకచటి
గొల్లలకుఁజెప్ప నన్ను దోడ్కొని చనంగ, నంగజాలలనను ధరాధినాథ. 9
క. సేమంబుపూని మృగజయ, కామన సంకల్పపూర్వకముగా జపమున్
హోమము జేయుచు నుండెద. సామజవదనునకుఁ దత్త్వసారము కలిమిన్. 10

సీ. చిక్కఁజీరఁగఁ గూల్చు సింహపోతకములఁ బోలి తొప్పఱలాడు గ్రోలుపులుల
విలయంబు నొందించు విపినంబుపందుల వెరఁజి వెంపఱలాడు వారణములను
విఱువుకంఠాష్ఠుల నుఱికి చివ్వంగుల మొత్తి మోసఱలాడు మత్తకరులఁ
గూల్పు మర్వరఁదన్ని కొన మన్నుఁబోతుల వ్రచ్చివండఱలాడు వాహరిపులఁ
తే. జంపివసియాడు శశములగుంపు కుఱికి, చించి చెండాడు కణఃజులఁ జేతికోలఁది
వెదకి వేఁటాడు దుప్పుల మెదలనీక, చండవిక్రమచాప దుష్యంతభూప. 11
క. అనుటయు మాండవ్యుని మన, మునఁగలిగిన భీతిఁ దెలిసి భూపాలకుఁడి
ట్లను బ్రాహ్మణమిత్రునిఁ బా, ఱుని నేని న్నకట యేమఱుదు నేరెచటన్.12

వ. నీవు నావెంట నంటుకొని యొంటినడక తొడునీడయుం బోలె నే తెమ్మొప్రమాదంబుగాకుండఁ బ్రమోదంబుగా వేఁటవేడుక జూపి కనుమఁబునుంబోలె గందకుండ నిన్నుండెచ్చెదనని భుజంబప్పళించి మృగయువర్గంబునుం దానును నిరర్గళప్రచారంబుల దాయనేగి పోఁగువారించి దాఫులమేపుల జువ్వలమొవ్వల రేఁగులగోఁగుల రేలల జాలల నొద్దులమద్దుల గురుగుల ఓరుగుల నెమ్మలజమ్మల నేరేళ్ళమారేళ్ళ గలువుల బలువులఁ గొడిసెల నొడిసెల నందుగుల నిందుగులఁ గలుగొట్లఁగొట్లఁ బంచారుల నారులఁ బ్రేంకణంబుల గణంబుల గొండమావిళ్ళ వావిళ్ళ తాండ్లమాండ్ల జంద్రుల సుంద్రుల వెలఁగల మొలగల బీగల గారల వేములఁ బ్రేముల మఱియునుం బెదపిచ్చి పినపిచ్చి నల్లింద నుల్లింద యిప్పకప్పురమద్దిగద్ద గోరుగోరంట వెలమయులిమిరి మూఁగ వేఁగిస మొదలుగాఁ బెక్కుతెఱంగుల మ్రాఁకులు మూఁకలుగొని యిసుము జల్లించిచల్లిన రాలనిదట్టంబునం బొడకట్టులేకపరిక్రీడమానక్రోడ సింహ సైరిభశరభశార్దూలచమరురురుకురంగాది జంతుఘోషంబులును గంకకలవింక కడింజర ఖంజరీట కపోతశిఖావళ శుకపికానేకపక్షికులకలకలంబులను గంకకలవింక కడింజర ఖంజరీట కపోతశిఖావళశుక కానేకపక్షికులకలంబులును ఝుంఝూపవనఝంపా సంపాతకంపమాన కల్పాంత కాలజలధి ననుకరించు నరణ్యంబుఁ బ్రవేశించి వలయు వంకలం గాలువలలు నురులు బోనులు దీమంబులుం జిగురుం గండెల వేయించి సారమేయంబుల విడిపించిన.

సీ. గళశాళములఁద్రుంచెఁ గారుపోతులఁ గొన్ని తోలాడెఁ గొన్ని శార్దూలములను
ఎలుఁగులఁగొన్ని మేనుల నఖంబుల వ్రచ్చె జమరీమృగంబులఁ జంపెఁ గొన్ని
కొలపాణములఁజేసి కూల్చెదుప్పులఁగొన్ని చెండె మన్నులఁ గొన్ని గుండెలవియఁ
గఱచెఁ బందులఁ గొన్ని కంధరాంతరములు కొండగొఱియలమన్నిగొనియెఁగొన్ని
తే. చటులగతిఁ గొన్ని కణుజులసంహరించె, వెంటఁబడి కొన్ని శశముల విత్తుమాల్చెఁ
గొన్ని జింకల ప్రేవులు గ్రుచ్చివైచెఁ, గుక్కలాఁ ఖేటకంబున నుక్కుమిగిలి. 13

సీ. కడిమిమైఁ బిడియానఁ బొడిచియొక్కఁడు కొఱప్రాణంబుతోఁ బులిఁబట్టి తెచ్చె
భల్లాన నిర్గతప్రాణంబుగావించి లావున నొకఁ డేకలంబుఁ దెచ్చె
నసిధార మెడఁద్రెవ్వ నడిచి కొమ్ములతోన నొకఁడు కార్పోతుమస్తకముఁ దెచ్చె
బాణాభిహతిఁ గూలఁబడవేసి యొకఁడు కాననదంతితొండంబు నఱికి తెచ్చెఁ
తే. గుఱుచకుంతానఁ బెనుమోరఁ గ్రుచ్చియెత్తి యెలుఁగు నొక్కఁడు కాల్పట్టి యీడ్చి తెచ్చె
శేవమైఁ జిల్లకోల నాటించి యొక్కఁ, డెద్దుఁ గొనివచ్చెఁ గరిపురాధీశుకడను. 15
చ. అవి గనుఁగొంచు నెంతయుఁ బ్రహర్షమునొందుచుఁ దాను లీలఁగా
నవిరళశక్తిఁ గాంచనసమంచితపుంఖశిలీముఖంబులం
గవయవరాహదంతిరురుకాసగపఙ్క్తులఁ గూలనేయుచుం
గవిసి తదీయకంఠములు ఖడ్గముఖంబునఁ ద్రివ్వనేయుచున్. 16
క. వనచరులను జూచుచు నటఁ, జని జనపతి కాంచె నొక్కచక్కని యిఱ్ఱి
న్మునిపతి పెంపుడుబుఱ్ఱిని, వనమునఁ జరియించువేళ వలపులకుఱ్ఱిన్. 17
క. హరిణము నెఱిఁగని పుంఖిత, శరుఁడై వెంబడిన యరిగె జనపతికడిమి
న్వరయజ్ఞమృగము వెంబడి, నరిగెడు సాక్షాత్పినాకహస్తుఁడు పోలెన్. 19.
చ. విలుగొని వెంటవెంటఁ బృథివీపతి రా శరపాతభీతిఁ దా
మలఁగి మలంగి కన్గొనుచు మార్గము క్రేవకు నడ్డగించుచు
న్నిలుచుచుఁ గొంతకొంత గమనించుచు నర్ధము మేసి మేసి ద
ర్భలు వివృతాస్యపార్శ్వముల రాలఁగ మింటికిఁ జౌకళించుచున్. — 19
సీ. శాలాంతరంబు మోసంబైన విడివడి యరుదెంచు గాడ్పువాహనమృగంబొ
శశముతో నొంటక జగతిపై వచ్చిన చంద్రునిలోని లాంఛనమృగంబొ
వీరభద్రుని కృపావీక్షణంబునఁ బునర్నవమై చరించు జన్నపుమృగంబొ
పార్వతీకన్యక ప్రార్థింపవిడిచిన యురగేంద్రకంకణుకరమృగంబొ
తే. యనఁగ మాయామృగమువోలె నామృగంబు, ధరణిపతిబాణనిహతికిఁ దగులువడక
నదులు నగములు ఘనకాననములు గడచి, చటులగతి నేగె మాలినీతటమునకును. 20
క. ఏ తెరువున నరిగె మృగం, బా తెరువున నదులు వనము లద్రులనక ధా
త్రీతలపతి సైన్యసమా, న్వితుండై యరిగె మాలినీనదిదాఁకన్. 21
గీ. ఆచటుమృగమును బోలేక యలసినిలిచె, నా నెలవు నాశ్రమాంతిక మగుటఁ జేసి
స్థలవిశేషం బదెట్టిదో ధరణిపతికి, హరిణపతిమీఁద నెంతయుఁ గరుణపుట్టె. 22
వ. ఇత్తెఱంగునం గురంగంబుమీఁదఁ గురంగాంకకులీనుండు కృపాతరంగితాంత
రంగుండై యేయకయుండం దత్తరంగిణీతటంబున. 23

సీ. కడఁగిసంక్రీడించు నడవియేనుంగుల గండస్థలుల దానగంధములను
జెంచులరాచకెంజిగురాకుఁబోఁడుల శిరసుల జవ్వాదిపరిమళముల
విచ్చినక్రొత్తమ్మివిరులఁ దుమ్మెదలాడఁ జాటినపూఁదేనె సౌరభములఁ
గూలదుర్గమంబుల గాలితాఁకునరాలి వచ్చినయలరు క్రొవ్వాసనలను
తే. శబలితంబగునయ్యేటిసలిలకణము, లల్లనల్లనఁ గొనుచు మందానిలుండు
చల్లఁగావీచి వనపథశ్రాంతిఁ దీర్ప, నది గనుంగొను వేడుకఁ గదలి కదలి. 24
మ. ఒకచోఁ మత్తమరాళనృత్తనినదం బొండొక్కచోఁ జక్రవా
కకుటుంబస్మరకేలిజాతకలనిక్వాణంబు వే ఱొక్కచో
వికచాంభోజమరందసన్మధుమదావేశభ్రమద్భృంగగా
నకలాపధ్వని మానసంబునకు నానందంబు సంధింపఁగన్. 25
క. కంజకుముదోత్పలచ్యుత, కింజల్కపరాగపటలకీలిత మగుచు
న్మంజుసరోవరదేవత, మాంజిష్ఠము గట్టుకొనినమాడ్కిం దనరున్. 26
మ. చలదిందీవరచారునేత్ర సముదంచచ్చంచరీకాలకం
జలజాతాననఁ గంబుకంఠి బిసహస్తం జక్రవాకస్తనిం
బులినశ్రోణి మరాళరాజగమన న్భూజాని గాంచె న్నట
జ్జలకల్లోలపరంపరానినదవాచాశాలిని న్మాలినిన్. 26

వ. కాంచి వితతపరిశ్రాంతుండును సంతోషితస్వాంతుండును నై చెదరి చెదరి తనవద
నంబు గనుంగొనుచుం గదలకున్న యిట్టిగున్న వీక్షించుచున్న యవసరంబున. 28

సీ. దీర్ఘదీర్ఘంబులై తిరిగట్టి మడమలు గడచి తూలాడు కెంజడలతోడ
వింజామరము విచ్చి వ్రేలవైచినమాడ్కి డాలొందు నరపగడ్డంబుతోడ
ఫాలబాహూదరపార్శ్వదేశంబులఁ గొమరారు భూతిపుండ్రములతోడఁ
బుచ్ఛంబు విడిచి కప్పుకొనవచ్చిన క్రొత్తమసుఁగుఁజమూరుచర్మంబుతోడఁ
తే. బ్రహ్మతేజోధికులరైనబ్రహ్మచారు, లిద్ద ఱిరువంక నలమి రా నెలమితోడ
నగ్నిశిఖవోలియును జల్లనైనకాంతి, యడర నొకవృద్ధముని వచ్చె నధిపుకడకు. 29
వ. వచ్చి వెడవెడ దీవించి కృతాంజలియై యున్న రాజునుం గూర్చుండు మనక తాను
నాసీనుఁడుం గాక నిలిచి హరిణంబు నంగుళీముఖంబునం జూపి. 30
క. ఆశ్రమసారంగం బిది, యాశ్రితమందార దీని నలయించితి నీ
విశ్రామమునకు నిది మా, కశ్రాంతము బ్రాణమిత్రమై చరియించున్. 31

ఉ. ఏమని చెప్పవచ్చు నటులీనినమైఁ దడియాఱ లేదు, తా
నీ మహితాశ్రమంబునకు నే నరవింబడి తప్పి వచ్చెనో
ప్రేమను జేసి యంగుళులఁ బెట్టినదర్భలు మేయుచుండఁగా
నోమనఁ బాపగోలెఁ గృప నోమితి నీ మృగరాజడింభముకా. 32

క. తనతల్లులు మునిపత్నులు, తనతండ్రులు మునిజనములు తనసహజన్ముల్.
మునికన్యలుగా గారవ, మునఁ బెరిగి వనౌకసులకు ముద్దులు గురియుకా. 33

వ. ఇది యొకనాఁడాహారవిహారార్థంబరిగి కాననంబులంగసవు మేయుచుఁ బాపసజనంబు పేర నెవ్వరుం గనుంగొనినం గనుచూపుమేరనమేఁత చాలించి డాయవచ్చి యొరసి కొనుచు సౌహృదోత్కంఠతంగంఠంబెత్తి కండూయనంబు జేయించుకొనుచు మమ్ము సమ్ముఖంబున నాలోకించుచుండియు బెండుపడి యోలంబునం దలవ్రాలవై చికొని మిన్నకున్న యది యొచ్చెల యొంతనొచ్చెనోకదా యుని డగ్గఱి కపోలంబులు పుడికి గళంబు దువ్వి యంగంబులు నిమిరి సాసంగంబు నుపలాలించుఁ గృపాతరంగిణీ తరంగంబులగు నపాంగంబుల మృగంబు వీక్షించు మునిపుంగవుంగని నృపపుంగవుండు కలంగిన యంతరంగంబున. 34

క. నొచ్చెనో వీరల హృదయము, లిచ్చట నా మీఁద నలిగి యే ముని శాపం
బిచ్చెదరో కదా నాలుక, వెచ్చన మునులకును గినుక వేగమ వచ్చున్. 35

సీ. భృగుని నూసరవెల్లి వగు మని యొకఁడగ్గె సగరుల నొకఁడు భస్మముగఁజాచె
శీతాంశు నొకఁడు నాసిలుచుండఁ గోపించి భానుని నొకఁడుర్వీఁబడ నదల్చె
నబ్ధులేడును నొకఁడాపోశనము గొనె నగభేది నొక దేవముగళపించె
జంకించి యొకఁ డగ్ని సర్వభక్షుకుఁజేసె నహుషుని నొకఁ డంపె నహులఁగలయ
తే. గోత్రరిపులక్ష్మి మున్నిటఁ గూల్చెనొకఁడు
మునుల మనసులు నొప్పించి మొక్కవోయి
బైసి దోలఁగినవా రెంతలేపివార
లితరజనముల గణుతింప నెంతవారు. 36

చ. దిరిసెనపూవుకంటెను మతింపఁగ మెత్తన చాలఁజిత్తముల్
కెరల యుగాంతవాయుసఖకీలకంటెను వేఁడి నాలుకల్
దొరసినఁ గూలఁద్రోయుదురు దొంతులతోడి దిగీశరాజ్యముల్
కరుణ వహించిరే మునులు కట్టుదు రల్పుల బ్రహ్మపట్టముల్. 37

గీ. కుడిచి కూర్చుండి యురక యొన్నఁడును లేని, వేఁట యే నేలవచ్చితి విపినమునకు
వత్తుఁగాకేమి దుష్టసత్త్వములఁ జంపి, యేల తనియక వచ్చితి నిట్టిబడిని. 38

వ. విధికృతం బెట్లు కానున్నదో కాక యని యాకులితచిత్తుండై యానృపోత్తముండు తాపసోత్తముపదంబులకు ముదం బొదవం బ్రణామంబు చేసి కరకంజంబు లంజలిబంధంబు గావించి యంటియంటి మంజులోక్తుల:దపస్వికుంజర, యేను దుర్వ్యసనంబున మృగయావిహారంబునకుఁ గడంగినది లేదు, సింహశరభసైరిభద్వీపిద్విపాదిదుష్టమృగంబులు గోష్ఠంబులకు నధిష్ఠగ్రామంబులకు నరిష్టంబు సేయుచున్న యవి యని భిల్లపల్లవజనంబు లెఱింగించిన వాని మర్దించుటకునై నిర్దయశార్దూలసమ్మర్దంబును మదభరోత్కంఠకంఠీరవారావభైరవంబును శరభసైరిభధ్వానభయదంబును బ్రచండవేదండప్రకాండబృంహితాకాండజలదగర్జానూర్జితంబును సముల్లసద్భల్లూకహీంకారనిక్వణకలితంబును నుద్ధతస్తబ్ధరోమోద్దామనిర్ఘృణదీర్ఘఘుర్ఘురనిర్ఘోషభీషణంబును దర్వీకరభీకరంబును నైన యరణ్యంబున వేటలాడుచు వచ్చి యిది యాశ్రమమృగంబొట యెఱుంగక నురంగలించియుండ వన్యమృగంబ కా నిర్ణయించి వేటాడి యలయించితి నీయజ్ఞానంబు సహింపవలయు ననినం బరమజ్ఞాని యగు మునీంద్రుండు నరేంద్రు నాలోకించి. 39

క. జననాథ దుష్టమృగమ, ర్దన మొనరింపంగ నీ వరణ్యంబునకుం
జనుదెంచు టంతరవలో, కనముల నెఱుఁగుదుము నీకుఁ గలుషము గలదే. 40

గీ. దీని నాశ్రమమృగమని తెలియుకీవు, వచ్చు టెఱుఁగుదు మవనీశ వలదుభయము
వైరిమర్దనుఁడవు వంశవర్ధనుఁడవు, కీర్తిధనుఁడవు నీ కొకకీడుగలదె. 41

ఉ. సర్వజనైక పూజ్యుఁడవు సత్యయుతుండవు నీవు మామకా
శీర్వచనంబునం గను ప్రసిద్ధు నపూర్వసుపర్వనాయకాం
శర్వనుఁ డైన నీ యనుఁగుఁదాతఁ బురూరవుఁ బోలువాని నీ
యుర్వరఁ జక్రవర్తిపద మొందునుపుత్రుని సచ్చరిత్రునిన్. 42

క. ఈమాలినీతరంగిణి, సీమముగా నింతనుండి క్షితినాయక ని
స్సీమ తపోనిధికణ్వమ, హాముని తప ముండు నాశ్రమాటవి యిచటన్. 43

సీ. మునులు నిత్యస్నానములు దీర్చి యొడలక కాసారముల కంచ గదియవెఱచు
మౌనిజనం బనుష్ఠానంబు దీర్పక మృగశాబకము దర్భ మేయవెఱచు
సంయమీంద్రులు శివార్చనలు చెల్లింపక ప్రసవంబునకుఁ దేఁటి ముసరవెఱచుఁ
శారికాంత్యులు ఫలహారతృప్తులు గాక కీరంబు పంటికిఁ జేరవెఱచుఁ
తే. తపసిజనములు నుతిమంత్రజపము లుడిగి వచ్చియుండక పికశిఖావళీములాది
గా వనంబునఁ గల విహంగమకులంబు, తత్తరమునొంది నోరు వా యెత్తవెఱచు. 44

సీ. వృద్ధసింహమునకు విహరింపఁ దోడంబు కైదండగా నిచ్చు గంధగజము
పులిక్రొత్త యీనిన పొదరింటిలోనికిఁ బురుటాలుతగవు గొంపోవుహరిణి
శరభంబు కొనగోళ్ళ శిరము దువ్వఁగఁ జొక్కి కనుమోడ్చుసుఖనిద్ర గండకంబు
సింహకిశోరంబు చేరవచ్చిన వింతలేక చన్నిచ్చు బాలెంతకరిణి
తే. తొలుకతోడుతఁ జెరలాడు నెనసిపిల్లి, నెమ్మిపురివిచ్చి నిలిచి పింఛమ్మునీడ
భుజగకన్యక నాడించుఁ బూరినచులి, యనఘకణ్వమునీంద్రు పుణ్యాశ్రమమున.
మ. పవనుం డాహుతిగంధము ల్గొనుచుఁ బైపైవచ్చె నాసాపుటీ
వివరప్రీతిగ నాస్వాదింపుము చతుర్వేదోక్తమంత్రధ్వనుల్
కవియం బారెడు యజ్ఞవాటముల నాకర్ణింపు వీక్షింపు వ
చ్చెవి యద్వేదికి హోమధూమలతిక ల్జీమూతజీవాతువుల్. 46

వ. సంయమీంద్రులు నరేంద్ర నీవిచటికి వచ్చుట తమదివ్యజ్ఞానంబున నెఱింగియున్న వారు నీవెఱుంగమిచేసికొని పోవక యాయురైశ్వర్యాభివృద్ధికరంబును గలుషకర్శనంబును నగు తాపసదర్శనంబుజేసి పొమ్మని యమ్మునివరుండు నిజేచ్ఛం జనియె. నృపవరుండును నచటినుండి యరదంబెక్కి చనుట యనుచితంబు గావింజేసి, తేరు మాలినీతీరంబున నునిచి శరాసనాదిసాధనంబులు సారథిచేతికిచ్చి వనంబునఁ బరమపావనంబగు తపోవనంబుసొచ్చి.

సీ. శుకగర్భకోటరచ్యుతములై నివ్వరిప్రాల్క్రింద జెదరినపాదపములు
దలలకు గారకాయలు నూఱ నందులఁ జమురంటి మెఱయు పాషాణతతులు
నిబిడవల్కలశిఖానిష్యందరేఖల జాఱులుగల జలాశయపథములుఁ
దమమేను లారసికొంచు మనుష్యు లరిగిన భయమునఁ జంచలింపని మృగములుఁ
తే. గలిగి యన్యోన్యమైత్రి నక్కడఁ జరించు, పులులకూనలు జింకపిల్లలు మృగేంద్ర
పోతకంబులు నాలక్రేపులును గదుపుఁ, గట్టికొని కూడిమాడ నక్కజము జెంది. 48
శా. వేదధ్యాపకులైన రాచిలుకలన్ వేదాంతమీమాంసలన్
వాదం బిమ్ములఁ జేయు శారికలఁ దత్త్వం బిందు జారుండుఁగా
నాదేశించుపురాణముల్ చదువు చక్రాంగంబులన్ సామముల్
నాదంబొందఁ బినాకిఁ బాడు నళులన్ వందారుఁడై చూచుచున్.
చ. చనునెడ నంతలోఁ గుడిబుజం బదరంగఁ దొణంగినన్ మనం
బునఁ గడుఁజోద్య మందుచుఁ దపోవన మిచ్చట దీనికిన్ ఫలం
జానర మనోజ్ఞమూర్తి యగు యుగ్మలిఁ గౌఁగిలిఁ జేర్పఁగావలెన్
గొనకొని యీశ్వరుండ యెఱుఁగుం గనరా దిది మానుషంబునన్. 50

మ. అని వాగ్గేయపదంబు లేగునెడఁ గర్ణానందసంధాయులై
వినఁగా వచ్చెఁ బ్రియంవదా మగిడిరావే యంచు రారాఁగదే
యనసూయా యని వృక్షసేచనముచేయంజాలఁ బ్రొద్దెక్కెఁ గా
యని యాక్షేపము సేయు నొక్కతనుమధ్యామంజులాలాపముల్. 51

క. ఆమాట లాలకించుచు, భూమీశుఁడు కొన్ని చరణములు చని యడరన్
గాముని దీపములనఁ జను, వామాక్షుల మిగులఁ జూచి వారలలోనన్. 52

శా. చంచత్పల్లవకోమలాంగుళికర న్సంపూర్ణచంద్రానన
న్యంచచ్చందనగంధి గంధగజయానం జక్రవాక స్తనిం
గించిన్మధ్యఁ దటిల్లతావిలసితాంగిం బద్మపత్రాక్షి వీ
క్షించెన్ రాజు శకుంతల న్మధుకరశ్రేణీలసత్కుంతలన్. 53

సీ. దర్పకురాజ్యంబు దలచూప నెత్తిన బంగారుటనఁటికంబము లనంగ
రతిమన్మథులు విహారమునకై చేతులఁ బట్టియాడెడి నిమ్మపండ్లనంగ
రేయి వెన్నెలనాఁటి రేయెండ యుదయింప బెదరు చకోరంపుఁబిల్ల లనఁగ
శృంగారసరసరాజీవకాననమున విచ్చినకనకారవింద మనఁగ
తే. నూరుయుగమును జనుదోయియొప్పువిప్పు, కన్నుఁగవ నెమ్మొగంబునుత్కంఠ బెనుపఁ
గౌతుకముఁజేసె మేదినీకాంతుమదికి, విపులలావణ్యపరసీమ తపసిలేమ. 54

వ. అప్పు డప్పుడమి యేఁడు విస్మయాయత్తం బగు చిత్తంబున నత్తపస్విమత్తకాశిని
నవలోకించి తనమనంబున. 55

సీ. సురకన్య కాఁబోలు సురకన్యయయ్యెనే భువిపై ఱెప్ప లాడించు టెట్లు
పుత్తడి కాఁబోలుఁ బుత్తడి యయ్యెనే హంసగతుల నడయాడు టెట్లు
వనలక్ష్మి కాఁబోలు వనలక్ష్మి యయ్యెనే కటివల్కలంబులు గట్టు టెట్లు
రతిదేవి కాఁబోలు రతిదేవి యయ్యెనే వలరాజుఁ బెడఁబాసి వచ్చు టెట్లు
తే. కన్నుఁగవ యార్పుటను సురకన్య కాదు, నడచియాడెడుఁగానఁ బుత్తడియుఁగాదు
లలిత వశ్చిహ్నమున వనలక్ష్మికాదు, ప్రసవశరము కర్తయైనది రతియుఁగాదు. 56

వ. మానవమానవతియ కావలయుఁ గాక దేవకామిని యయ్యెనేని నన్నవలోకించి
యంతర్ధానంబునొందుఁ గాకుండునేని నన్యోన్యసల్లాపంబులుజ్జగించియూరకుండురు
కావున నొక్కదిక్కున మఱుఁగుపడి యుండియవలోకింపవలయునని సమీపవట
విటపిమూలంబునందాఁగి కనుంగొనుచుండె నయ్యవసరంబున.

క. బిందెలు కరమునఁ గొని యర, విందాస్యలు జలముదెచ్చి వేడుకతో నం
దనతరుసేచనంబును, సందడిగొని చేయుచుండ్రు ససంభ్రమలీలన్.

క. అనసూయ నిగిడిచన న, య్యనసూయం గడచి వడిఁ బ్రియంవద చన న
య్యనసూయఁ బ్రియంవదయును, గొని వేగిరపాటుతో శకుంతల చనఁగన్. 59
సీ. అరుణపల్లవములు హస్తాంగుళంబులు గెంజాయఁ దమలోన గ్రేణిసేయ
వెలిమించు మొగ్గలు విమలదంతంబులు చెలువంబుఁ దమలోనఁ గలసి మెలయఁ
బరువంపుగుత్తులు బ్రన్ననిపాలిండ్లు మవ్వంబుఁ దమలోన మార్చికొనఁగఁ
జిందు తేనియలును జెమటచిత్తడియును క్రొత్తావి తమలోన బిత్తరింప
తే. లలితపుష్పితజంగమలతిక వోలె, వల్లికావృక్షముల యాలవాలములకు
జలము వోయు శకుంతలచంద్రవదన, చారుతరవైభవముఁ జూచి జనవిభుండు 60
చ. దిరిసెనపువ్వుకంటె గణుతింపఁగ మెత్తన మేనుదీఁగె యీ
తరుణికి నిట్టికోమలి లతాతరుసేచన మాచరింపఁగాఁ
గరుణయొకింత లేక కడఁగట్టె మునీంద్రుఁడు మాటలేటికిన్
సరవిరయెఱుంగలే కకట జాదులు వేఁచెను మరిగలంబునన్. 61
గీ. చందనంబునఁ బుష్పంబు గుందనమునఁ, బరిమళం బిక్షులతికను ఫలము వోలె
రతిమనోహరమైన యీయతివమేన, నరయఁ గనుఁగొంటిఁ గాదె యీ యౌవనంబు.
వ. ఈలతాతన్వి తపస్వినీచిహ్నంబులు పూని యున్నను నెరవుదోఁచుచు శరీరకాంతి
సౌందర్యసౌభాగ్యములవలన రాజసమును బ్రతాపమును గర్వమును తేవయు నించు
కించుక ప్రకాశించుచున్న యవి మౌనికన్యాకలితం బగు బ్రహ్మతేజోవిశేషంబు
లేశంబును గానరాకున్న దదియట్లుండె. 63
ఉ. సందియమేల యీ వికచసారసలోచన రాజపుత్రి నా
డెందము మౌనికన్యలబడిం జననేరదు నిక్కువంబ యే
చందమునందు సంశయవిచారపదం బగునట్టివస్తు నీ
మం దమచిత్తవృత్తులు ప్రమాణము లుత్తములైన వారికిన్.
ఉ. పౌరవవంశసంభవుల పావనచిత్తవిధంబు లన్యకాం
తారతికిం బ్రమోదభరితంబులు కావు ప్రశంసపొంది యీ
ధారుణి సంచరించినను చామరచూలి పరంబు దప్పినన్
వారిధులింకినన్ మఱి దివాకరచంద్రులు తప్పఁ గ్రుంకినన్. 65
క. కానీ సంశయ మెల్లను, మానుం బరిపాటి వీరి మాటలవలనన్
లోనున్న రాగి వెలుపలఁ గానంగావచ్చు పూఁతకడియము భంగిన్. 66
గీ. వీనులకుఁ బండువులుగాఁగ వీరిమాట, లాలకించెదఁ గాకని యధిపుఁడుండె
నంత నొక తేఁటి వచ్చి శకుంతలాముఖాంబుజమునందు ముసరిన నలఁత నొంది. 67

క. కరమునఁ బలుమఱు నా మధు, కరము వదల్ప నది నెమ్మొగము విడువకయికిం
గరము వడంకుచు రజనీ కరముఖి యనసూయఁ జూచి కడుదీనతతోన్. 68

ఉ. ఈ యలిపోతమే నెఱుఁగ నెక్కడనుండియొ వచ్చి మోముపై
రాయిడి చేయుచున్నది కరంబులఁ జోపినఁ బోవ దన్న నో
తోయజనేత్రి నే నెఱుఁగుదున్ విరవాదికి నీరువోయఁగా
నా యొడనుండి వచ్చు భవదాననగంధము నాస్వదింపఁగన్. 69

మ. శ్రవణేందీవరముం భజించె నదియుం బ్రస్థానయుక్తంబుగా
భవదక్షిన్ వసియించె నక్షిముకుళింపం దేఁటి నెమ్మోముపైఁ
దవిలెన్ దానిఁ దొరంగఁ జోపుటకు హస్తంబెత్తి వారించె దా
నవు నంభోరుహసామ్యదోషము వయస్యా లేదె నీచేతికిన్. 70

గీ. కమలరుచి నీ ముఖాక్షి హస్తములు చూచి, పద్మినీభ్రాంతి నీ యళి వాసిపోవ
దదిరొ యెఱుఁగు నీ నెఱుఁగుదువనిన విభుఁడు, తెలివమోమున భ్రమరించు తేఁటిఁ జూచి

మ. వనితం జంచదపాంగఁ జేసి కనుఁగ్రేవం ముట్టుచున్ జేరి మం
తనముం జెప్పెడుభంగి నొయ్యఁ జెవిచెంతన్ మ్రోయుచుం మెల్ల నె
ల్లన మోవిన్ రతిసౌఖ్యసంపదలు గొల్లల్గొంటి ధన్యుండ వీ
వనఘా తుమ్మెద నేను వెల్వడితిఁ దత్తాన్వేషముం జేయుచున్. 72

వ. విమలసుధాకరకులీనుండ నేను శంకాకులచిత్తుండనై యుండ మలీమసమధుపకులీ
నుండ వీవు నిశ్శంకం గొంకక పంకజముఖిం జవిఁ గొంటివి చండాలిభర్తృపుణ్యుండు
ను విశ్వంభరాభర్తృ యపుణ్యుండును నయ్యెం గదా యనుచు నా చంచరీకంబు నాక్షే
పించుచు నాఁడు పల్లవాధరులసల్లాపంబులు చెవులకుఁ జల్లగా వినుచు నుల్లంబున
భూవల్లభుండు చప్పుడు సేయకుండె నప్పుడు శకుంతల విస్రస్తకుంతలియు విధ్వ
స్తధైర్యయు విన్యస్తసాధ్వసయునై యనసూయా ప్రియంవదల నవలోకించి. 73

గీ. ఏను మీ చెలి నింతేల యెరవుసేయ, వింతవారైన మొఱ యాలకింతు రకట
ప్రాణసఖులార కావరే ప్రాణమిచ్చి, మమత విడువక మార్పరే మధుపబాధ. 74

క. నేఁ జనినచోటికెల్లను, దాఁ జనుదెంచుచును మరలఁ దనుఁ జోపంగా
మీఁ జేతు లెల్ల గిజిగిజి, గాఁ జేసెను మొగలిముండ్లు గాఁడినభంగిన్, 75

గీ. వివర మొనరింప బొందులు వేఱుగాని, ప్రాణ మొక్కటి మనకుఁ బద్మాక్షులార
ప్రాపరే నాకు నీ యార్తిబాధ యనిన, జిట్టకాలకు నారల చెల్లెలువల్కె. 76

ఉ. ఇంతి! తపస్వికన్యకల మే మసమర్థల మీతిబాధ భూ
కాంతుఁడు మాన్పి ధాత్రి ప్రజఁగావను బ్రోవను గర్త కాన, దు
ష్యంతున కేముచెప్పెదము సాధుజనార్తిహరుం డతండు దు
ర్దాంతుని నివ్వలిం గెడపి తామరపూఁజెఱసాలఁ బెట్టెడున్. 77

వ. రాజుసన్నిధికిం బోయెదమని నడవులకు రెండుమూడుపదంబు లరిగిన ననసూయా ప్రియంవదల వెంట నాక్రోశంబు సేయుచు శకుంతలయుం గదలె నయ్యవసరంబున భూవల్లభుం డప్పల్లవాధరలం గనుంగొని లీలావ్యాజంబున నీ రాజవదన లాశ్రమసదనంబునకుం జనకుండ నెఱింగించుకొన నిది యవసరం బని ప్రమానిచాటువిడిచి జవనిక వాయందట్టినం బోడనూపు బహురూపితెఱంగున మఱుంగుపడియున్న తాన న్నలినవిలోచనలకుం గోచరుండై నిలిచి వెఱవకుం డోడకుండు తపస్వికన్యలకు మీకు నాకులం బొనర్చిన దుశ్చరితుఁ డెవ్వండు వానినాజ్ఞాపించెద ననిన సుధామధురంబులగు నతనివాక్యంబు లాకర్ణించి కనుంగొను నెడ. 78

సీ. కస్తూరివ్రాసిన కరణి మీసలు నల్లదొగడుశేసు జనించుమోగము మెఱయఁ
గ్రొత్తమిక్కిలి సోగ టేకులమీఁదఁ దుమ్మెద లున్నలాగునఁ బెద్దకన్నులమర
నాజానుదీర్ఘంబులైనబాహులపెంపు శేషభోగాకృతిఁ జెలువమొందఁ
బిడికిలింపఁగవచ్చు నడుమియొప్పిదముతో నురము విస్తారంబు సిరివహింప
తే. నాననము పూర్ణచంద్రుపెం పపహసింప, గగనమునుండి వేడ్కనకాండమిలకు
నదరిపాటుగడిగిన జయంతుఁ డనఁగఁ, జాలనద్భుత మొసఁగె దుష్యంతమూర్తి. 79

వ. ఇట్లు పొడచూపిన నృపాలచంద్రు నాకారతేజోవిశేషంబులు భావించి జయంతుం డో, కంతుండో, నలకూబరుండో యిచ్చటికి వచ్చుట కెయ్యదికారణంబకో యని యద్భుతంబును భయంబును మనంబునం బెనంగఁ గొండొకవడిఁ గనుంగొని నరుండకా నిశ్చయించి యతని కులనామధేయంబులు తెలిసికొనవలెనని యనసూయాప్రియంవదలు రాజు వదనారవిందం బాలోకించి. 80

ఉ. ఎక్కడివాఁడ వన్న జగతీశ్వరలక్షణలక్షితంబు నీ
చక్కనిమేను దీర్ఘభుజశాఖలఁ దేజముఁ జర్చ సేయఁగా
నిక్కడి కొంటివచ్చుటకు నెయ్యదికారణ మంతవట్టు నీ
నిక్కముఁ జెప్పుమన్న ధరణీపతి సత్యచరిత్రుఁ డాత్మలోన్. 81

క. వారక యసత్యవచనము, నారకహేతు వనఁగను వినంబడెడుం బు
ణ్యారణ్యములోపల ముని, ధారికలకు బొంక నేల ధర్మచ్యుతిగన్. 82

వ. అని విచారించి వారలతో నేను దుష్యంతుండఁ గాంతారంబున దుష్టమృగంబుల
మర్దించుటకై వేఁట వచ్చి మాలినీతీరంబునం బరివారంబు నిలిపి కణ్వమహాముని
న్నమస్కరించి పోవుతలంపున వచ్చి యిచ్చట నొక్క కలువకంటి యొంటి నా
క్రోశింప నార్తనాదంబు విని యరుగుదెంచునప్పటికి మీ సరససల్లాపంబులై
యున్నయవి యని యల్లనల్లన శకుంతలం గనుంగొనుచుండ నచ్చట. 83

శా. ఆ కాంతాతిలకంబు చన్నుఁగవపై నందంద రోమాంచ మ
స్తోకం బై పొడకట్ట నుత్కలికఁ జేతోభీతి సంధిల్ల నా
క్ష్మాకాంతామణి మంజుభాషణము లాకర్ణించుచుం గోన తా
నాకర్ణించె మనోజచాపగుణసాహంకార ఠంకారముల్. 84

క. భావభవపుష్పచాప, జ్యావల్లీరవము తన్మయత్వముఁ దెలుపం
దేవేంద్రతనయసన్నిభు, నా విభుఁ గనుఁగొనుచు నుండె ననిమిషదృష్టిన్. 85

చ. కొలఁదికి మీఱు కోర్కుల శకుంతల చూడ నృపాలు డెందము
న్నలుపును దెల్పునైన నలినచ్ఛద లోచనలోచనచ్ఛవు
ల్యలలము లట్లు నాటుకొన సౌరభలోభమున న్మధువ్రతం
బులు దగులంగ నాటుకొనెఁ బుష్పధనుర్ధరుఁ డేయుతూపులున్. 86

క. వాలికలై విరిదమ్ముల, యేలికలై భావభవుని యెలదూపులకుం
బోలికలై యుత్కలికల, మూలికలై యబలఁ దాఁకె నొగి నృపుచూపుల్. 87

ఉ. బాలికచూపులున్ ధరణిపాలనుచూపులు నొండొకళ్ళపైఁ
గీలుకొనం జనంగఁ గనుగ్రేవల నవ్వుచు నిల్చి యుద్దఱ
న్వాలిక పువ్వుఁదూపు లిరువంకలఁ బాఱఁగ నిక్షుచాపముం
గేల నమర్చి యేయఁదొడఁగెం బ్రసవాస్త్రుఁడు సవ్యసాచి యై. 88

ఆ. కాముఁడనెడు వేఁటకాఁ డేయుచును రాఁగ, సువిద చేతమనెడు నోదమునను
వసుమతీశచిత్తవన్యకరీంద్రంబు, పడియెఁ గాని మగిడి వెడలదయ్యె. 89

వ. ఇత్తెఱంగున లతాంతశరనికరనిర్భిదేళిమస్వాంతుండై యుండ నందు శకుంతలాలి
కుంతల తన మనంబున.

చ. విరులశరంబులుం జెఱకువిల్లును బూనఁడు గాని వీఁడు గో
మరుఁడు మరాళయానలకు మానవతీవచనంబు వల్లవా
ధరలకుఁ జెల్లదింక విదితంబుగ నీతనిఁ జూడ లేని నా
తరుణి కితండు గూర్చునది దర్పకుసేలవె యింటిబంటుగన్. 91

గీ. యక్షనందను రూపంబు హాస్యకరము, పాకశాసనిరూపంబు బడిసివాటు
విషమబాణునిరూపంబు వినిమయంబు, ధరణి నారాజచంద్రు సౌందర్యమునకు. 93
వ. ఇతండు ప్రియుండు గాఁగల భాగ్యవతికన్య యెవ్వతియొకో యని చింతించుచుఁ
గనుంగొనుచున్న యన్నలినలోచనతో ననసూయాప్రియంవదలు రాజు విచ్చేసియు
న్నవాఁ డెక్కడఁజూచెద వేల నివ్వెఱపడి యున్నదాన నర్ఘ్యపాద్యంబు లొసంగ
వలయుఁ బర్ణశాల కతిత్వరితమ్ముగ నరమ్మని కరమ్ము వట్టుకొని తోడ్కొనిపోయి య
చ్చట సర్వంబును సమీచీనంబు చేయించి భూపాలుపాలికి నొక్కశిష్యం బుత్తెంచిన,
క. అంతేవాసియు నా దుష్యంతునిఁ గని యధిప! యాతిథిసత్కారము నీ
కంతయు భక్తి నొనర్ప శకుంతల పుత్తెంచెఁ దోడుకొని రమ్మనుచున్. 94
గీ. వేగ విచ్చేయుమనిన నా విప్రుతోడ, ననఘ యందు శకుంతల యనఁగ నెవ్వ
గె తపస్విని వ్రత మెద్ది యెట్టిచర్య, యరయ కింతులచేఁ బూజ యనుచితంబు 95
క. అనవుడు భూపాల! తపస్విని గాదా యింతి భువనసేవ్యుండగు క
ణ్వునికూఁతు రా యమకునై, మునిముఖ్యుఁడు సోమతీర్థమునకుం జనుచున్. 96
వ. అతిథిసత్కారం బొనర్ప నా కన్నియను నియమించిన నంతరాంతరంబు లెఱింగి
యార్యులకు సపర్యలు సేయుచుండు నని నతనివదనంబు నవలోకించి యార్యవ్ర
తేతుండు కణ్వమహామునీంద్రుం డతనికి నపత్యలాభం బెట్టుగలిగె నది యద్భుతంబు
వినవలయున నిన. 97

క. ఎంతేనియుఁ గల దీ వృత్తాంతము మీ లరసినాఁగ లరుదెండు పథ
శ్రాంతి హరియింపుఁడమల, స్వాంత శకుంతల యొనర్చు నాతిథ్యమునన్. 98
క. తడయవల దనిన నేమిట, బడలినయది లేదు కాశ్యపమునీంద్రున కీ
పడఁతి జనించినక్రమ మేర్పడ వినుపింపుమన నతఁడు భాసురఫణితిన్. 99
వ. మధ్యమలోకపాలకుండవైన నీ వచనంబు మాకు నలంఘనీయంబు తత్కథాక్రమంబు
యథాక్రమంబునం జెప్పెద సావధానుండవై చిత్తగింపుము. 100
సీ. మునిమనోమోహనముక్తినటీనాట్యరంగంబు లగు హేమశృంగములను
కనకాబ్జకైరవకల్హారసౌరభోద్గారంబు లగు జలాధారములను
గిరిదారతిశ్రాంత కిన్నరీపరిచితస్నేహంబు లగు గుహాగేహములను
గుంజన్మదాలిసీమంజులమంజరీపుంజంబు లగు లతాకుంజములును
తే. నలరి పెంపొందుఁ బూర్వాపరాంబునిధుల నడుమ ధరణికి మానదండంబువోలె
దేవతాత్మధరాధీశదిగ్విభూష, పుణ్యనిలయంబు నీహారభూధరంబు. 101

ఉ. ఎంచి నుతింపశక్యమె యహీశ్వరునంతటివానికైన ర
త్నాంచితరోచిరుద్గమ నిరస్తసమస్తరవీందుజాలముం
గాంచనకందరాయవనికాయితవారిధరాంతరాళ ని
ర్వంచితదేవతామిథునవాంఛితమూలము శీతశైలమున్. 102

గీ. భూధరములెల్లఁ దను వత్సముగనొనర్పఁ, బృథునృపాలోపదిష్టయై ప్రియమువీఱ
నఖిలరత్నౌషధులను జన్నవిసి పిదికె, నమరశైలంబు దోగ్ధగా నవనిసురభి. 103

ఉ. వారని మంచుపైఁబొదివి వచ్చినపోయిన చొప్పు మాసిన
న్భూరినఖాగ్రముక్తమయి పొల్పగు ముత్తెపుఁజాలు వెంట నా
చారణులేగి కాంతురు హతద్విపకేసరివాససీమలన్
పీతకిరాతు లద్రివనవీథుల సింగపువేఁట లాడుచున్. 104

ఉ. మానము దప్పకుండ ననమానదరీముఖరాయమానహే
లానిలపూర్ణరంధ్రనిచయంబయి కీచకరాజి మ్రోయఁగా
నా నగరాజు కిన్నరుల యంచితగానవినోదవేళలన్
దానొక వాసికాఁడువలెఁ దక్కఁగ నూల్కొనఁ జేయుఁ దానముల్. 105

క. ధరణిధరసానుతటములు, పరిమళవంతములు సేయుఁ బాయక యెపుడుం
గరిగండూషిత నిస్సృత, సరళక్షీరప్రసూత సౌరభలహరుల్. 106

ఉ. బింగపుటాలుగా హిమము పేరిన యగ్గిరిత్రోవ దుర్వహో
త్తుంగకటీకుచాలసవతు ల్తురగాస్యలు సంచరించుచో
నంగుళి పార్శ్వభాగముల కార్తియొనర్చినఁగాని యడ్యేడ
జ్జంగలుచాఁచి మందగమనంబున కొందర నీరహారుముల్. 107

సీ. ఏ దేవి నఖరోచు లిందురేఖలభంగిఁ బ్రవహించు నోంకారపాదపీఠిఁ
గొమరొందు నే దేవి కుడివంక నర్ధవల్లవితశంకరరూపలలితముద్ర
ఏ దేవియందు బ్రహ్మేదు లీడని నతావృత్తిఁ దాల్తురు కల్పవిరమవేళ
జనియించు నే దేవి శాంభవీవిలసన శ్రీశతాంశమున వైరించ దృష్టి
తే. కన్నుసన్నల నే దేవి కడ జరింతు, రఖిలదిక్పాలశుద్ధాంతహారిణనయన
లా మహాదేవి పుత్రికయయ్యెఁ గూర్మి, నెట్టితపమాచరించెనో హిమనగంబు 108

వ. ఇట్లనన్యసామాన్యసౌభాగ్యప్రాభవవైభవంబుల జగన్నుతంబగు నమ్మహాశైలంబు నుపాంతంబున సర్వర్తుకిసలయప్రసవఫలభరప్రకాండమండితం బగు కాననాంతరంబునఁ బుండరీకకైరవోత్పలషండసంపన్నం బగు జలజాకరసమీపంబున నొక్క చిక్కణ సికతాప్రదేశంబున. 109

సీ. పంచాక్షరీమంత్ర పరమోపనిషదర్థ వాసనాసురభి యెవ్వానిబుద్ధి
శ్రుతిపాఠపూతవాక్పతిముఖస్తుతులచే వదలె నెవ్వఁడు నవస్వర్గసృష్టి
బాహాబలుండగుచుఁ దపశ్శక్తి నెవ్వాఁడు బ్రహ్మర్షియై యెక్కె బ్రహ్మరథముఁ
బందె మోడి దివంబు పంచి యిప్పించె నిశ్శంక నెవ్వఁడు హరిశ్చంద్రునకును
తే. సమ్మహోత్కృష్టుఁడు సకలలోకైకవినుతుఁ, డార్యసేవ్యునితోడి మండ్రాటకాఁడు
నిష్ఠతోడుత నాశ్చర్యనియమవృత్తిఁ, దపమునకునుండె నంబికాధవునిగూర్చి. 110
ఉ. పద్మజసంభవుం డతులభాస్కరతేజుఁడు గాధిసూనుఁ డ
చ్ఛద్మమతిం దపోనియమసంగతి నొంది సముల్లసన్మన
స్సద్మమునందు నిందుధరు, శైలసుతాధవు, భోగికంకణు
న్బద్రినిశాచరాంతకుఁ, గృపానిధి నిల్పి యనన్య చిత్తుఁడై. 111
మ. ఇవముం గందువులం జలంబునను నట్టెండ ల్వెసం గాయ వే
సవులం బంచమహాగ్నిమధ్యమున వర్షావేళల న్వన్యపు
ష్పవితానంబులు లేని బట్టబయల న్నాకాశనుండై యుమా
ధవుఁ జింతించుచు నిల్చి చేసెఁ దపముం దాత్పర్య ధైర్యంబునన్. 112
గీ. మానసాంబుజకర్ణికామధ్యమునను, గొన్నిదినములు శశిమౌళిఁ గుదురుకొల్పి
మీఁదిగాడ్పుఁ గ్రిగాడ్పుతో మేళవించి భానుశశిమార్గములు గట్టువఱపితగను 113
శా. లీల న్మధ్యమనాడి నా జమిలిగాలిం జొన్ప లానెక్కి యు
త్కీలం బై యెగఁబ్రాఁకి చిద్గగనవీథిం జెంది యం దున్న యా
ప్రాలేయద్యుతిమండలంబుఁ గరఁగింపం దత్సుధాపారముల్
మూలం గూర్కెడు పాఁపకన్నె దులుప న్మూర్ధాభిషేకంబునన్. 114
క. కరువలిఁ దరిగెడు తొల్లిటి, తెరువులు చెడ నంతరరులఁ దెఱపిఁ గనుకనిన్. 115
బరువులు వ్రెబ్బెడు తమతమ, యిరవులు గోల్పడిరి పడిరి యెట్లనొ తారుణ్. 115
మ. వశమై పశ్చిమనాడియందుఁ బవనద్వంద్వంబు వర్తింపఁగా
దశనాదంబులు సంభవించి మొగయ న్నాన న్సదానందుఁడై
యశనాయానలపీడయు న్మతియు దైన్యావైన్యము ల్లేక యా
శశిజాటుండును దాను దాన యయి విశ్వామిత్రుఁ డిట్లుండఁగన్. 116
మ. అవనీచక్రముఁ గ్రుంగ నింగి ఘనగర్జాడంబరం బయ్యెఁ జి
క్కువడెం జుక్కలు డుల్లె దిక్కరులు సంక్షోభించెఁ గుంభీనస

ప్రవరుం డుర్విం దలంకె ధాత పగిలెం బ్రహ్మాండభాండంబు చి
ట్లువిసెం నిర్జరరాజధాని వడి నూటాడె న్మహాశైలముల్. 117

వ. ఇట్లు విశ్వాధికుండగు విశ్వామిత్రుండు తపంబు సేయ భీతుండై పురుహూతుండెం
తయు నంతరాయంబు నొందింప నిలింపచంపకగంధులందు నెవ్వరుగల రోకో యని
సమీపంబునం గొలిచియున్న నిర్జరజనంబు నవలోకించి. 116

సీ. కమనీయ సురసభాగారమధ్యమునకు దీపించు మాణిక్యదీపమనఁగ
రంభాదిదేవతా రంభోరువులకెల్లఁ జారుచూడావతంసంబనంగ
జగములు గెలువంగ సానఁ బట్టించిన రతిరాజు నవఖడ్గలతిక యనఁగ
యతులమానసము లుద్ధృతుల సాకర్షించు వరవశ్య మంత్రదేవత యనఁగఁ

తే. బంతమాడిన హరినైనఁ బద్మభవుని, నైన హరునైన మోహారసాబ్ధిఁ ద్రోచి
యీఁదు లాడింపనోపెడు నిగురుబోఁడి, మేనకాసతిఁ జూచి సమ్మాన మెసఁగి.

వ. సకల సౌభాగ్యసౌందర్యమందిరం బగు నీచేతం గాని గాధినందనుతపంబు విఘ్నం
బుఁ గానేరదు. శీఘ్రంబ చని యమ్మౌనివరుని మరుని యాజ్ఞకు లోనుజేసి రమ్మ
నిన మహాప్రసాదం బని యక్కొమ్మ పాకశాసను శాసనంబునఁ గౌశికుతపోవనం
బునకు వచ్చి వియచ్చరపతియాజ్ఞ నయ్యచ్చరమచ్చెకంటి వెనుకొని. 120

శా. ఏతెంచె న్మధుమాసలక్ష్మి, తరుణీహిందోళరాగధ్వను
ల్వేతెంచె, న్భటుమీనకేతనముతో విల్లంది పూఁదేరిపైఁ
దోతెంచె న్దలిరాకుఁగైదువులుఁ దోడ్తోఁ దాల్మి లేఁదీఁగల
న్వేతెంచె న్జగదేకవిక్రమకళావీరుండు మారుం డొగిన్. 121

ఉ. వామనదిగ్గజంబు మదవాసనకుం జన కోహటించు ను
ద్దామగతి న్నభోమణిరథంబుహయంబు లనూరుఁ డుద్ధతుం
డై మగుడింపఁగా మగుడ కడ్డము దాఁకె ననంగ నుత్తరా
శాముఖవీధి నేగె దివసంబులు దీర్ఘత పల్లవింపఁగన్. 122

గీ. తరుణి మధువేళఁ బద్మినీసరసకేళిఁ దడసె నన వాసరంబులు నిడుపులయ్యెఁ
బాపి విరహంబు సైఁపమిఁ జేసి రథముఁ, దఱిమికొనివచ్చె నన రేలు కుఱుచలయ్యె.

క. భూరుహము లెల్ల నామనిఁ, గారాకులు రాలి చిగురు గలయ నలమి సొం
పారెను మధుమాసమున న, గారంబులు డులిచి క్రొత్తగప్పిన భంగిన్.

చ. మలయసమీరమ న్విటుఁడు మచ్చరికంబునఁ బట్టి తీవలం
జెలువుల పైఁ బురాణదళచేలములన్ హరియింప లజ్జవోఁ

జలనము నొందఁగా ననుపు జాణఁడు చైత్రుఁడు గప్పెఁ దోనతో
నొలసిన కూర్మిఁ పేర్మి చెడకుండఁగఁ గెంజిగురాకు బట్టలన్. 125

సీ. తళతళమించు కెందళిరుటాకుల నెడనెడ నొయ్యనొయ్యనఁ దొడిమలెత్తెఁ
దొడిమల నడుమ వాత లొకింత గనవచ్చె రావన నన లంకురంబు నొందె
నన లంకురం బంది నవకంబుతోఁ గూడ బలసి లేఁదావుల కలికలయ్యెఁ
గలికలపరిమళంబులు కొల్పు నును మోము లరవిచ్చి మవ్వంపు టలరులయ్యె
తే. నలరు గుత్తులు మకరంద మలకనెఱయ, విచ్చి సోడుముట్టఁగా వనవీధికలను
దరుణభావంబు నొందించెఁ దరుల లతల, నభినవంబైన నవవసంతాగమంబు. 126

శా. సంపెంగ ల్పరువంది క్రొవ్విరులచే శంపాలతాలక్ష్మి నొం
దింపం బాదపము ల్లసంబులయి పూఁదేనె ల్దువాళించి వ
ర్షింప న్వల్పిరి చల్లి పాంథజనరాజి న్దమ్మ గాడ్పు ల్చలిం
పింప న్మాధవుఁ డంబుదాగతి విడంబించె న్విజృంభించుచున్. 127

శా. హేమంతం బను రాజు సేనపఱపన్ హేలాగతిన్ జైత్రుఁడన్
సామంతుం డెదురం దదీయజవరాజత్క్రూర తుక్షారరిం
ఖామార్గంబుల నించు పాంసువులు నాఁగాఁ బర్వె నారామగుం
జామల్లీలవలీలవంగనవపుష్ప శ్రేణికారేణువుల్. 128

ఉ. తెమ్మెర లూఁపఁగా నలరు తేనియ లాని మదించి యింపువన్
దుమ్మెద లేమ లా గతులతో మధురస్ఫుటకోకిలానినా
దమ్మునఁ బాడుచుండెను లతానవడోలల నూఁగి యాడుచుం
గమ్మనివింటిజోదు జయగాథలు పుష్పితభూజవీధులన్. 129

ఉ. ఆ పువువింటిజోదు మధుపావళి నారియొనర్చి చక్కఁగా
మో పిడి పట్టి జుమ్మనుచు మోయఁగ మీటుచునున్న వాఁడు మా
కా పనిగాదు తాల్మిఁ గొఱఁగా దిఁకఁ జన్నుల నంటఁబట్టుకొం
డో పతులన్ లతాంగులను నోజఁ గరం బెలుఁగించెఁ గోయిలల్. 130

క. వలరాజు దండువెడలఁగ, బలములు నియమించు సైన్యపతు లెదురెదురన్
దలతలఁ దను నెలుఁగుల క్రియఁ, గలకల నెలుఁగించె నెల్లకడ రాచిలుకల్. 131

సీ. సమవర్తి రాణివాసాలపాలిండ్లపై మృగమదామోదంబు మేఁతవట్టి
దర్వీకరస్త్రీలు తన్నువాచవిచూడ గందంపుఁగొండ చెంగట సుఖించి
దర్దురశైలమధ్యమునఁ గర్పూరంపుఁ దరువాటికలలోనఁ దెరువుదప్పి
తామ్రపర్ణఖ్యాతిఁ దనరారు ముత్యాలయోటి ఘటంబువుల్లలో నీఁదులాడి

తే. విరహిజనములహృదయకోటరములందు, రాఁజు మదనానలము మించి రవులుకొల్పి
గాధిపుత్రుండు తప మున్న కాననమున, నల్లనల్లన వీచె మందానిలుండు. 132

వ. ఇత్తెఱంగున సకలజన సంతోషిత స్వాంతంబగు వసంతంబు సనుదెంచిన నుల్లసిత పల్లవంబును నుదారకోరకంబును నుత్ఫుల్లకుసుమంబును నున్నత స్తబకంబును నుద్గతమకరందంబును నుద్ధూతపరాగంబును నుదంచితఫలంబు నై చైత్రరథమునకుం బ్రత్యాదేశంబును నందనంబునకుం బ్రతిచ్ఛందంబును నగు విశ్వామిత్రు నాశ్రమ వనంబున మనంబు లలర నలరువిలుకాఁడు సహాయంబుగా విహారశీలాకినులు పుష్పాపచయంబు సేయంబూని. 133

క. దలదరుణతరుణకిసలయ, విలసత్ఫలభరితవిపినవీథీవిచర
త్కలకంఠశారికాశుక, కులకంఠధ్వనులు చెవులకుఁ జవులొసఁగన్.

గీ. వలపుగాడుపు లూర్పులఁగలసి వెలయు దుమ్మెదలు గుంతలమ్ములఁ దొట్రుకొనఁగఁ
బువ్వులును నవ్వులునుగూడి పొత్తుగలఁయ, విరులు గోయఁదొడంగి రవ్వేళయందు.

ఉ. ఆసవగంధులైన వదనానిలముల్ పయిఁ బోవిదిసేయఁగాఁ
గోసినకంటె వేగమునఁ గోసినవృంతమునందుఁ బుట్టఁగాఁ
గోసె మనోజ్ఞమూర్తి యొకకోకిలభాషిణి నిండువేడుకన్
డాని వయస్యలెల్లఁ బొగడ న్పొగడ న్పొగడ ప్రసూనముల్. 136

క. మవ్వఁపుటలరులు గోసెను, గ్రొవ్వాఁడి నఖాంకురములఁ గొమరుదలిర్పన్
బువ్వారుబోఁడి యొక్కతె, నవ్వులు బువ్వులును జడిఁగొనన్ సురపొన్నన్. 137

సీ. చటుకున నడిచి రసాలంబు నొక్కతె ననిపించి యా ప్రసూనములు గోసెఁ
జులుకఁగాఁ దన్ని యశోకంబు బూయించి విద్రుమాధరి యొర్తు విరులుగోసెఁ
నవ్యగీతులఁ బ్రేంకణము వికసింపించి వనితయొక్కతె ప్రసవములు గోసె
సమదరాగస్థితి సంపెంగ విరియించి చంద్రాస్య యొర్తు పుష్పములు గోసెఁ

తే. గలికిచూపులఁబరువంబుగా నొనర్చి, తిలకమునఁ బూవు లొక వేల్పుతెఱవ గోసె
నిండుఁ గౌఁగిటఁ గొరవిమన్నించి యొక్కె, సురతలోదరి యలరుమంజరులుగోసె

వ. మఱియును బురందరపురాగవిందలోచనలును లోచనానందకరంబులగు తరులతాంతరంబుల లతాంతంబులు దెచ్చి రేకు మడంగకుండఁ గందకుండ మకరందంబు చిందకుండఁ దేఁటిఁగ్రోలకుండఁ బరాగంబు రాలకుండ మేనకాహస్తంబునకు నిచ్చిన నా హస్తిరాజగమన యా నవీనప్రసూనంబుల ప్రసూనశరధమనమూర్తి యగు

విశ్వామిత్రపాదపద్మంబులకు సమర్పించి దండంబువెట్టి లేచిసమీపంబునం బూచిన సహకారంబు నీడ నొక్కపాదం బాకుంచితంబుగాఁ దరువున నొఱఁగి యొయ్యారంబున నొసలి చిట్టంటుఁ జెమట మాటిమాటికిఁ గొనగోరమీటుచుఁ దుంట

విలుకాని మోహనశక్తియుం బోలె నున్నయెడ. 139

సీ. తేఁటిమొత్తము నేవుఁదూఁటిబుచ్చఁగనొప్పు కమనీయనీలాలకములు చూచి
చిగురుటాకుల డాలుఁజిన్నఁబుచ్చఁగఁజాలు సౌందర్యంపు కెంపుహస్తములు చూచి
కరికుంభముల క్రొవ్వుఁగాకుసేయఁగ నవ్వు దోరంపు నెరి చన్నుదోయిఁజూచి
చంద్రబింబము పెంపు సవతుగా దనిపింప మొలకనవ్వుల ముద్దుమోముఁజూచి
తే. రసములూటాడు బింబాధరంబు జూచి, పసిఁడిఁబోడి రాలు కతుకవైభవముఁజూచి
కమలముల నేలు పాదపద్మములు చూచి, మునికిఁ జక్కిలిగింతలుగొనె మనంబు.

శా. ఆ తన్వంగిపయిం బ్రియం బొదవి విశ్వామిత్రుఁ డీక్షించుచుం
జేతఃపద్మమునందు నున్న శివునిం జేమోడ్చి ప్రార్థించి తా
నా తారాద్రికిఁ బంపి యచ్చటు లతాంతవాసనీమ న్మనో
జాతుం బ్రీతునిఁ జేసె దేవగణికాసంభోగసౌఖ్యంబులన్. 141

క. మేనకయుఁ దాను హిమగిరి, తానకముగ జపముఁ దపముఁ దనమదిలోనం
బూనక యొకనాఁడైనను, మానక సుఖియించుచుండె మన్మథకేళిన్. 142
సీ. ప్రసవకార్ముకుఁ డను పాపకర్ముచేత నూనాస్త్రుఁ డనెడు దుర్మానిచేత
నంబుచరధ్వజుం డను కిరాతునిచేత మన్మథుం డను వసన్మార్గుచేత
శంబరాంతకుఁ డను జాల్మచిత్తునిచేతఁ గందర్పుఁడను బలుగాకిచేత
నంగసంభవుఁ డను నతినిర్దయునిచేత దర్పకుం డను నాతతాయిచేతఁ 143
తే. జెడ్డవారలఁ గథలుగాఁ జెప్పనేల, వేల్పు లేఁ డంప నొక దేవవేశ్యఁజూచి
తొడరి యజునైన నొసలివ్రాలుదుడనొప్పు, కౌశికునియంతవాఁ డూడ్చెఁగచ్చడంబు
క. ఈ గతి వేలుపురోయిల, నాగను దగులుకొని నాఁడు నాఁటికిఁ గోర్కుల్
ద్రీఁగలు సాగఁగ మన్మథ, భోగంబుల మనసు తృప్తినొందినపిదపన్. 144
క. ఆళీమిళ దమరీగత, కేళీవనపవన చలిత కేసరధూళీ
పాళీముహురనుగతభృం, గాళీగణ్యంబు హిమనగారణ్యంబున్. 145
వ. ప్రవేశించి యచ్చటఁ దపంబునకు నిలిచె మేనకయు నమ్మౌనిసంగంబున నొక్క క్షణం బురం గని యవ్వం డటుపుట్టిన యుప్పరటిపట్టి నల్లనల్లన పట్టుకొనిపోయి

నీనదీసైకతంబునఁ జేకతంబునఁబద్మపత్రంబులు పొత్తులుగా నమర్చి మెత్తమెత్తన యునిచి దినంబున కరిగె నిచ్చట. 146

క. ఆ తటిని శకుంతంబులు, తత్తనువున కెండ గాలి దాఁకక యుండ
న్మెత్తన యీఁకలఁ బొదువుచు, నెత్తురఁగంపు పయి నిల్పె నెయ్యము గృపయున్

ఉ. ఆ నది నొక్కనాఁడు ముదమారఁగ శిష్యులఁ దాను గూడి వి
జ్ఞానఘనుండు పుణ్యసిధి సాధువరేణ్యుఁడు కాశ్యపుం డను
స్నానము సేయ నేఁగి యచటం బొడఁగాంచె శకుంతపక్షర
క్షానిరుపద్రవస్థితిఁ బొసంగిన కౌశికవీర్యసంభవన్. 148

వ. కాంచి యది విశ్వామిత్రవీర్యంబగుట నార్యజనసేవితుం డగు కణ్వమునీంద్రుండు గాధిపుత్రుని మీఁది మైత్రియుఁ బల్లితో అంగుని సంగుమీఁది కారుణ్యంబు నఁ బెనఁ గొన నా వేల్పుం బూఁప నొక్కశిష్యునిచేతికిచ్చి యాశ్రమంబునకుం దెచ్చి శకుంతరక్షిత యగుటయు శకుంతల యను నామంబు పెట్టి ప్రేమంబునఁ బెనుపు చున్న నాఁ డన్నప్రదాతయు, నభయప్రదాతయు నీ యిద్దఱుం గన్యలకు గురువులై రీ రెండు దెఱంగులు న మ్మునిపుంగవుని యందు కలిగెఁ గావున, నతండు తండ్రియు న య్యెంతి కూఁతురయ్యె నిది శకుంతలావృత్తాంతం బని యాద్యంతంబును నెఱింగించిన మహీకాంతుండు నితాంత సంతోషంబు నొందె నంతట నూష్మకాంతుండును జరమగిరిశిఖరంబునకు బంధూకపుష్పమంజరియుం బోలెఁ గెంజాయ నలంకరించె.

గీ. అపుడు భూపతి విప్రుని నాదరించి, చరమసంధ్యావసర మయ్యె సంయమీంద్ర
కన్యకలు చెప్పి పుత్తేరఁ గాదనంగ, రాదు నడువుము వేగమ పోద మనుచు. 150

శా. శంకాతంతువుఁ ద్రెంపె నీ వడుగు దాఁజక్షుఃప్రియం బొప్పఁగాఁ
గొం కొక్కింతయులేక నిర్భయుఁడనై కోర్కుల్ కొనల్ సాఁగఁగా
నింక న్నాకొకమాటు చూడఁగలిగెన్ హేలాశరత్పూర్ణిమా
పంకేజాహితబింబ చారుముఖబింబ శ్రీకబింబాధరిన్. 125

మ. అని చింతించుచు సంతసించుచు రయంబారంగ సారంగలాం
ఛనవంశాగ్రణి యేగుచోఁ జటులవర్షాకాల కాలాంబుద
స్తనితధ్వానపథధ్వనీనగళగత్రక్రోడనిష్ఠూతని
స్వనవిర్భగ్న నితాంత శాంత బహుసత్త్వస్వాంత కాంతారమై. 152

క. శైలద్రుమచరదేణీ, జాలోదరదళక్రేళిసముదాతిగళ
తీక్ష్ణాలాలసిక్తదంష్ట్రా, భీలనఖంబగుచు నొక్క బెబ్బులి వచ్చెన్. 153

శా. ఆ శార్దూలముఁ జూచి భీతహృదయుండై మేను కంపింపఁగా
నాళల్ చూచుచు బ్రాహ్మణుం డపుడు ప్రాయప్రాణరక్షార్థమై
యో శార్దూలమ్ము గెందరిచర్మధర! యో యుగ్రాక్ష! యో యద్రిజా
ధీశా! యీ యపమృత్యువుం గడపరావే! యంచుఁ గీర్తింపఁగన్. 154

వ. ఆ విప్రవరుని యార్తియు, నిర్దయశార్దూలవిస్ఫూర్తియుంగ నుంగొని కారుణ్యమూ
ర్తియగు నారాజు భీతచేతస్కుండైనవాని నుపచరించుచు శీఘ్రగమనంబునవచ్చి
వ్యాఘ్రంబు నడ్డగించునప్పు డది నగరి వేటపులి యగుటం దెలిసి మృగయు లెట్టు
దీని నేమనిరి. దీనివలన నీయాశ్రమననతనుసత్వంబులకు నపాయంబు పుట్టిన మహాప
రాధంబు వచ్చుననుచు న మ్మృగరాజుం బట్టుకొన బంధురగమనంబున నిజస్కం
ధావారంబునకుం జనుచుఁ దనమనంబున. 155

క. తాపసశిష్యుని లలితా, లాపంబుల నాశకుంతలావృత్తాంతం
బేపారఁగ వినియును నా, క్ష్మాపాలుఁడు సంతసిలక సంశయచింతన్. 156

గీ. కన్య క్షత్రియవీర్యయౌఁ గాక యేమి, కణ్వుఁడొకనికి నీఁగడ కట్టె నేని
చెలువ నామీఁదఁ గూరిమి సేయదేని, యెంట దుష్యంతు కోర్కి పూరించు టెట్లు. 157

చ. కొనకొని తావిమూర్కొనని క్రొవ్విరి, యెయ్యెడ వజ్రినూచి డా
యని రతనంబు, జిహ్వ చవి యానని తేనియ, గోరుమోపి గి
ల్లని చిగురాకు, లాలితవిలాసనికేతన మా లతాంగిఁ దా
ననుభవకర్త యే ఘనుఁడో యా విధియత్న మెఱుంగనయ్యెడున్. 158

ఉ. ఆడదు గాని మాట లొకయించుక యించుక వీనులొగ్గి నా
యాడినమాట లెల్ల విను నర్మిలితోఁ దను నేను జూచినం
జూడదు గాని యొండుదెసఁ జూచినఁ దా నన్నుఁ జూచుచుండు నీ
జాడలు నాపయిం దగులుచందము డెందముఁ జేర్ప నేర్పగున్. 159

ఉ. ఆ చపలాక్షి కన్య విమలాశ్రమవాసిని ప్రేమచిహ్నము
ల్మచ్చికలేక చేయ దనుమానము గల్గదు సత్యసంతతు
ల్వచ్చపుఁగూరిముల్ పరిఢవింపఁగ నేరరు నేర రజ్జసం
పచ్చటులంబులై మెఱయ పచ్చనిమాపులకోర్కి చూడఁగన్. 160

మ. చికురంబుల్ మొనలంట నున్న చెమటల్ జెక్కుల్దలిర్పన్ ఘటో
దకభారమ్మునఁ గెంపుహస్తయుగ ముద్ధారింప నంసంబు లిం
చుక జాఱం జనుదోయి యూర్పుపడి సంక్షోభించి కంపింపఁ దా
నొకకేలం దుఱు మావటించు చెలువం బుల్లంబుఁ గొల్లాడదే. 161

వ. అనుచు నచ్చెలువ చెలువంబుఁ దనమనంబున నునుచుకొని యచ్చోటువాసి మగిడి
చూచుచు నిలుచుచు నివ్వెఱపడుచుఁ బ్రొద్దువంకఁ గనుఁగొనుచుఁ బెద్దవడిం గొండొ
కదవ్వు గమనించుచు నిట్టూర్పు నిగిడించుచు నెట్టకేలకు వేలంబున్నచోటికిం దపసి
పోటికి మనంబిచ్చి యేటి కెదురంటినకరణి ధరణీనాయకుండు ప్రవేశించి. 162
చ. తనకు శకుంతలావదనదర్శనయాత్రకు విఘ్నమాచరిం
చిన పులిఁ జంపఁ జూచియును పెంపుడుగావున వేటకాండ్రమీఁ
ద నెపముపెట్టి యేమఱుట తప్పుగఁ గట్టి యథాపరాధదం
డన మొనరించె నుత్తమజనంబులు చూప రనర్థకోపముల్. 163
గీ. అవనిపతి యివ్విధంబున నరుగుదెంచి, యపరసంధ్యాభివందనం బాచరించి
యుష్ణమును దీర్ఘమును గాఁగ నుస్సురనుచు, సంయమీంద్రకుమారిక సంస్మరించి 164
సీ. పిలువవచ్చినఁ బోక నిలిచి యేటికి నింతి పుట్టువుఁ దెలియ దుర్బుద్ధి పుట్టెఁ
బుట్టినీ యతఁ డేల పూర్వాపరంబులు సూచించి విడువక డోలివట్టెఁ
బట్టినీ గమనసంభ్రమవేళ శార్దూల మదరిపాటున నేల యడవిసొచ్చెఁ
జొచ్చి రానీ మాఱునుద్ది పంపకయుండఁ జనుదెంచె నేటికిఁ జరమసంధ్య
తే. విఘ్నములు పెక్కు లిటు సంభవింపఁ జేసి, తెఱవఁ గని కన్ను లాఁకలిఁ దీర్పకుండ
నదయుఁడై విధి కంచము మోవఁదివాని, లేశమంతయుఁ గృపలేక లేవనెత్తె. 165
క. అని దైవము దూఱుచుఁ దన మనమెల్లను గొల్లఁగొనిన మానిని తపసే
చనచర్యలు నలసవిలో, చనముఖభావములు మానసము నలరింపన్. 156
ఉ. మజ్జనభోజనక్రియలు మాని వలాని యశోచికంబునన్
ఖజ్జముఁ గొంతకొంత కసిగాటులుగా భుజియించి యెవ్వరిం
బజ్జకుఁ జేరనీక తనభావములోపలఁ దాఁపురంబుగా
సజ్జకుఁ జేరినాఁడె నృపచంద్రుఁడు సాంద్రవియోగవేదనన్ 167
క. ఆవేళ హాస్తినగర, క్ష్మావల్లభుఁ డున్నయెడకుఁ జనవునఁ జేరం
గా వచ్చిన మాండవ్యుఁడు, భావము దెలియంగఁ బలికెఁ బరిహాసోక్తిన్. 168
క. వనమునకు నొంటి నరిగితి, జననాయక యచట మనసు శంకించెనో య
మ్మునివరు లేమి పరాభవ, మొనరించిరో నాకుఁ జెప్పు మున్నవిధంబున్ .169
చ. మనమున జంకుగల్గినను మాన్చెద నే నది మంత్రశక్తిచే
మునుల యవజ్ఞగల్గినను ముంపటికి న్మనసీమలోని కా

ననములు గుత్తుయిచ్చి జతనంబుగఁ జేసినఁ గందమూలము
ల్దినియెడువారు గాఁగ నరుదెంచి వశంవదులౌదు రందఱున్. 170

వ. దీని కింత చింతయేల జగతి యేలంగలిగిన నావంటి సేవకుండు సిద్ధించియుండ నశ
క్తుండునుంబోలె నుండు టేటి ప్రాభవంబని సాధుజనపోషకుండు విదూషకున
కిట్లనియె.

గీ. ప్రాణసఖుఁడవు నీకుఁ జెప్పక మదీయ, వృత్తగోపన మెట్లుఁ గావింపనేర్తు
మచ్చ నాలుక వాఁడవు మంతనంబుఁ, బొడమనీ కని రసనకు బుద్ధిచెప్పు. 172

మ. మదనారాతిసమానుఁ గాశ్యపమహామానీంద్రు సేవింప స
మ్మదమారం జని యాశ్రమంబు వనసీమం గంటి వాల్గంటిఁ దో
యదనీలాలకఁ గంబుకంఠిఁ గరిణీయానం బయోజాననన
న్మదసత్సంశయగోచరోదరి సుధాసంబాధబింబాధరిన్. 173

సీ. నిండుఁ జందురునకు నెత్తమ్మివలపుకు నద్దంపుఁ బొలుపును నబ్బనేని
కరికుంభములకు బంగారుతార్పులయొప్పు శకటాంగముల విప్పు జరగనేని
యరఁటి కంబములకుఁ గరభంబు నునుడాలుఁ దూణీరముల మేలు దొరకనేని
సరసిజాతములకు జంత్రంబుఁబెంపును జిగురాకుసొంపును జేరనేని

తే. చపలలోచన మొగముతో సరియవచ్చు, నింతిపాలిండ్లదోయితో నీడువచ్చు
వనితయూరుద్వయంబుతో నెనయవచ్చుఁ,జంద్రముఖిపాదయుగముతో సవతువచ్చు

వ. అని మఱియు నాపాదశిరోరుహాంతంబు వర్ణించు నుత్కంఠ నా రాజకంఠీర
వుండుమాండవ్య! యొండు తలంపులేక విను మని యిట్లనియె. 175

సీ. వెడవిల్తు చిగురాకుగొడుగులు గొనివచ్చి చరణద్వయంబుగా సవదరించి
సంకల్పసంభవు జయకాహళులుదెచ్చి జంఘాయుగంబుగా సంఘటించి
దుగ్ధాబ్ధిమనుమని తూణీరములు దెచ్చి యూరుయుగంబుగా నుపచరించి
శ్రీదేవినుతు హేమసింహాసనము దెచ్చి జఘనచక్రంబుగా సంతరించి

తే. నీరరుహానూతి శేషాంగ నిర్మితికిని, దగినయవిలేక కనకపత్రమున నిచటఁ
గడమ కలదని వ్రాయులేఖయును లిపియు,మధ్యమును నాఱునయ్యె నమ్మానవతికి

సీ. ప్రసవాస్త్రమాయావి శైలవ్రాసిన నుడి బిసరుహాసనకు గంభీరనాభి
మోహామార్ణము వోసి మూసిన బంగారుబరిణె లుత్పలగంధి గుబ్బచనులు
యౌవనామరభూరుహమున డిగ్గిన యూడ లరవిందవదనకుఁ గరయుగంబు
సౌందర్యజలధిలో సంభవించిన పాంచజన్యంబు మీనలోచనగళంబు

తే. వదన మను తామ్రపర్ణిఁ జెల్వంబులైన, విశదమౌక్తికములు లేమ దశనపఙ్క్తి-
శంబరారాతి సామ్రాజ్యసౌఖ్యపదవి, యలికులాలక కెంజిగురాకుఁ బెదవి. 177

గీ. జవ్వనం బను తొలుకారు నివ్వటిల్ల, ప్రాపితోడను మోహబీజంబు లలర
మానసక్షేత్రములు దున్ను మదనుఁడనెడు, కర్షకునకింతినాసిక కనకహలము. 178

క. శ్రీకమలగృహము మోము వి, లోకింపఁగ దీపకళికలు కనుంగవ యా
నాకొడివారిన సన్నపు, రేకలు నా బొమలు సుందరికిఁ జెలువొందున్. 179

గీ. మహితకీర్తి శకుంతలామంజువాణిఁ బోల నష్టాదశద్వీపములను గలుగ
రనుచు శ్రుతులను సంజ్ఞల నతివయందుఁ దొమ్మదులు రెండు లిఖియించెఁ దమ్మిచూలి

క. బాలేందునిపైఁ దిమిరము, పాశము వెట్టుకొని వేళఁ బరికించుచుఁ దా
వేలము వేసినపోలిక, బాలిక హరినీలకేశపాశం బమరున్. 181

గీ. చదువు రాజశుకబ్రహ్మచారులకును, దామరసనేత్ర వదన మధ్యయనగృహము
గాణలై మించు కోకిలగాయకులకు, నాతికంఠంబుఁ దలఁప సంగీతశాల. 182

ఉ. కన్నులతీరుఁ జక్కని మొగంబు మెఱుంగును జౌకళించు లేఁ
జన్నులమించు నెన్నడుము సంశయలేఖయు మేని యందమున్
బెన్నెఱివేణి సొంపు మురిపెంబును దిన్నని మోవికెంపులున్
వన్నెలుగాని కావు గవణంబులు వన్నియ లా లతాంగికిన్. 183

మ. నవలావణ్యపయోధిఁ జిత్త మను మంథానాద్రికిం జంద్రికా
పవనాశిం దరిత్రాడుగాఁ బెనచి యబ్జాతాశుగుం డిచ్చినన్
రవలిం గోకిలకీరము ల్దరువ నా రత్నాకరంబందును
ద్భవముం బొందిన లక్ష్మికావలయు నా పద్మాక్షి భావింపఁగన్. 184

ఉ. చిత్తరువు ల్లిఖించి మఱి జీవము వోసెనొ రూపసంపదం
జిత్తమునం దలంచియు సృజించెనొ రెండును జర్చ సేయఁగాఁ
జిత్తరు వందు నా కరణి చెల్వము గల్గ దనన్యచిత్తుఁడై
చిత్తమునం దలంచియ సృజించెఁ బితామహుఁడా తలోదరిన్. 185

శా. ఆదిం జంద్రుఁడు చంద్రికారుచుల నయ్యబ్జాస్యఁ గల్పించెనో
లేదేఁ గంతుఁడు చెల్వము ల్వెరజి యా లీలావతిం జేసెనో
కాదేఁ జైత్రుఁడు తావు లెల్లఁగొని యా కాంత న్వినిర్మించెనో
వేదాభ్యాసజడుం డజుం డిటుల గావించుం దథీయాకృతిన్,

సీ. పాలమున్నీటిలోఁ పల సంభవించిన జలజాతనయనల చక్కఁదనముఁ
జంచలాలతికల జననంబు గాంచిన ధవళలోచనల సౌందర్యలక్ష్మి
నమృతాంశకళలయం దావిర్భవించిన నీలవేణుల రామణీయకంబుఁ
బుండ్రేక్షు కోదండమునఁ బుట్టు వొదవిన లావణ్యవతుల విలాసరేఖ
తే. నరసఖుని యూరుకాండంబునను సముద్భవంబునొందిన యుడురాజవదన చెలువుఁ
గుప్పగాఁ జేసి మునికన్యయొప్పుతోడ, వాసిఁదలపోయ నీరాల కీసవెలితి. 187

శా. ఆ వాలుంగనుదోయి యా నగుమొగం బా గుబ్బపాలిండ్ల పెం
పా వేణీరుచి యా తనూవిలసనం బా యొప్పు నే జెప్పినం
గైవారం బగుఁగాని యయ్యెడ శిరఃకంపంబుతోఁ గూడ నా
హా వుట్టింపదె యిక్షుధన్వునకు న య్యబ్జాక్షి నీక్షించినన్. 188

వ. అని తదీయరేఖావిలాసవిభ్రమంబులు ప్రసంగించుకొనుచు నొండెఱుంగక మహీవి
భుం డుండె నంత నిక్కడ నాశ్రమపదంబున శకుంతలయుం దారునవచ్చినవిప్రుని
వలన రాజు తనజన్మప్రకారం బడిగినవిధంబును దదాకర్ణనంబున నిరస్త సంశ
యుం డై పర్ణశాలాభిముఖుం డై గమనించుటయుఁ దదవసరంబున నకాండంబుగఁ
బెద్దపుండరీకంబు వచ్చుటయు నా శార్దూలంబును గోవత్సంబునుంబోలె గొనివచ్చు
టయు నాలోనన యుపరసంధ్యాసమయంబు ప్రాప్తంబగుటయుఁ బ్రతివచనంబులకు
నెడలేకుండుటయుం జెప్పినఁ దనమనంబున. 189

గీ. నరవరుం డస్మదీయజన్మక్రమంబు, వినుట నాపుణ్యమయ్యె నివ్వనములోని
కన్నఁడును లేనిశార్దూల మెట్లువచ్చె, నరయరాకుండ సరికట్టె నామృగంబు 190

క. ఎప్పుడొకో యీ నిశి చను, నెప్పుడొకో తెల్లవాఱు హృదయేశు మొగం
బెప్పుడొకో చూచుట నా, కెప్పుడొకో భాగ్యలక్ష్మి యెదురగుటనుచున్. 191

మ. చెమటం జెక్కులు తొంగలింప ముఖరాజీవంబు వాడంగ సో
లమున న్రెప్పలువ్రాలఁగన్నుఁగవ దేల న్మోవినిట్టూర్పులం
గమలం దల్పముఁజేరుచు న్విభునిరాకల్గోరుచుం బ్రొద్దు భా
రమునం బుచ్చుచు వర్ధమానవిరహగ్లాని న్మదింగుందుచున్. 192

మ. మలయక్ష్మాధరనిర్గళత్పవనము ల్ఖండింపఁ గామాగ్ని య
గ్గలతం గాల్పకయుండఁ గంతునుమనఃకాండప్రకాండాహతిం
జెలువెల్లం జెడకుండ న వ్విభు నురస్సీమంబుతోఁ దార్కొనం
గలలోనైనను గల్గునొక్కొ యని యక్కంజాస్య దీనాస్యయై. 193

శా. ఆ చంద్రాన్వయరాజచంద్రముని పొం దాసించి చన్నుంగవన్
జాచుం, గన్నుల నీరునించుఁ, దలయూఁచు, న్మేను శయ్యాస్థలిన్
వైచు, న్లేచును, నవ్వు, నున్నురనుఁ, బోవం గంటగించున్, ధృతిం
గాచున్, బ్రొద్దుఁ గనుంగొను, న్వెతఁబడుం గామాంధకారార్తయై. 194

వ. ఇవ్విధంబున. 195

గీ. అచట విరహాగ్ని రాజును నిచట మదన, బాణవేదన నింతియుఁ బరితపింప
బ్రహ్మకల్పంబువోలె నా రాత్రి వేగ, నెట్టకేలకు నంతట నినుఁడు వొడిచె. 196

శా. నాగామాత్యకుమార భూరమణమాన్యశ్రీక శ్రీకంఠచూ
డాగంగాసఖకీర్తి కీర్తితనిరూఢప్రౌఢనిర్నిద్రవా
చాగుంభాంబుజగర్భ గర్భసుఖతాసౌభాగ్య భాగ్యస్ఫుర
త్త్యాగోద్యత్సురభూజభూజనహితవ్యాపారపారంగతా. 197

క. కవితాకల్పకలతికా, నవపుష్పమరందపారణామధుపనిజ
శ్రీవశేంద్రియ సకలజగ, ద్భవనతమోపకీర్తి భాసురమూర్తీ. 198

పృథ్వి. అమాత్యగుణబంధురా యఖిలబంధుకల్పద్రుమా
సమస్తజనసన్నుతా సమధిక ప్రభావోన్నతా
అమర్త్యతటినీధరాయతపదారవిందద్వయీ
సమంచితమధువ్రతా సతతపూత సత్యవ్రతా! 199

గద్య :

ఇది శ్రీభారతీతీర్థగురుచరణకరుణాలబ్ధ సిద్ధసారస్వతపవిత్ర గాదయామాత్య
పుత్ర ఆరాధితామరవీరభద్ర పిల్లలమఱ్ఱి పినవీరభద్ర ప్రణీతంబైన
శకుంతలాపరిణయం బను శృంగారశాకుంతల కావ్యంబునందు
ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు.

# శకుంతలాపరిణయము.



## తృతీయాశ్వాసము.



శ్రీకర పతిహితకార్యా ని
శాకర సౌందర్య బంధుసత్కవిజన ప
ద్మాకరసూర్య పయోర
త్నాకర గాంభీర్య వెన్నయప్రభువర్యా! 1

క. దిననాథుం డుదయించిన, జననాథుం డుచితభంగి సంధ్యావిధు లె
ల్లను దీర్చి యున్న సమయం, బున సేనావిభుఁడు వచ్చి ముకుళితకరుఁడై. 1

గీ. తోఁటగొల్లఁడుం బోయిన తోఁటసమము, నేఁటి వేఁటకు మృగములు గాటమనుచు
వేడ్కతో వచ్చియున్నారు వేఁటకాండ్రు, వేగ విచ్చేయుఁడనినఁ బృథ్వీవిభుండు.

సీ. కొమ్మల నుదకంబు గోరాడి వే చల్లు కలఁచి క్రీడించవే కాసరముల
దంష్ట్రాంకురముల ముస్తలు త్రవ్వి భుజియించి సుఖవృత్తినుండవే సూకరములఁ
గడుపార మేసి మార్గమును వేసి నీడల నెమరువెట్టుచు నుండవే మృగముల
నిష్ఠురజ్యాబంధనిర్బంధమునఁ బాసి గవిసెన నుండవే కార్ముకంబు

తే. వలలు బోనులుఁ గౌలేయకులము మగుడఁ, బట్టనమునకు సకలంబు బెట్టి యనుపు
పనుపు మృగయులఁ దమతమపల్లియలకుఁ జాలు మృగయావిహారవిశ్రామసుఖము. 4

గీ. ఆశ్రమాంతికమున వేఁట యనుచితంబు, ఏము నేఁడును రేపును నిచట నిలిచి
మునులఁబొడఁగని వారల ననునయించి, పిదపఁ బురికేగుదెంచు టభ్యుదయకరము

వ. ఏ మిక్కడనుండు దివసంబుల నాశ్రమంబులకు రాయిడి గాకుండ మదీయస్యంద
నంబును సారథియును నీవు మాండవ్యుండును గతిపయాప్తపరిజనంబునుం దక్క

దక్కి నళతాంగమాతంగతురంగపదాతివర్గంబు దుర్గంబున కనుపుమనిన నతండును నట్ల కావించె నిట్లు సకలసైన్యంబునుం గరిపురి కనిచిన నా రాజోత్తముండు చిత్తంబు శకుంతలాయత్తంబుచేసి చిత్తమాటల మాండవ్య సేనాపతులతోడ నే మేనిం బ్రసంగంబు జరపుచునుండె నయ్యవసరంబున. 6

గీ. వరతపోధను లిద్దఱం దరుగుదెంచి, సవినయంబుగఁ గృతనమస్కారుఁడైన
ధరణిపతిమౌళి మంత్రాక్షతములు వెట్టి, వరుస నాసీనులై మృదువాక్యములను. 7

మ. అతిరాత్రం బను పేరిట న్మఖము సేయం బూని కణ్వాశ్రమం
బు తపస్వు ల్భవదంతికంబునకు మమ్ముం బెట్టి పుత్తేర వ
చ్చితి మిచ్చోటికి నుల్లసద్విజయలక్ష్మీశాలి వచ్చోటికిం
గ్రతుసంరక్ష యొనర్పరావలయు నక్షత్రీశవంశాగ్రణీ.

మత్తకోకిల. జంభశాత్రవతుల్య వైభవ చక్రవాళ బహిః ప్రహస్తమ
స్తంభనక్షమ కీర్తివల్లభ దానవాహిత ఘోణిరా
ట్కుంభికుండలిరాజ కచ్ఛపకుంభినీధరబంధుదో
స్తంభ సంభృత భూమిమండల సంగరోరగకుండలా. 9

క. బాణాసనబాణతను, త్రాణకృపాణములతో రథస్థుఁడవై నీ
వేణాంకకులజ రాఁదగుఁ, గౌణపదుర్జనులుగలరు క్రతువిఘ్నకరుల్. 10

క. అనవుఁడు నట్లే కా కని, జనపతి యమ్మౌనివరుల సన్మానముతో
ననిచి రణోచితపటుసా, ధనసంపద సొంపుగా రథస్థుం డగుచున్. 11

వ. వచేళికంబు లగు పనససహకార నారికేళ ఖర్జూర జంబూజంబీర రంభాకపిత్థక ర్కంధూతిందుక సౌగంధికాది సుగంధ బంధురఫలంబులును నొడిసెవ్రాలు దూసరి బియ్యంబు నివ్వరివడ్లు గునుగులూద లాదిగాఁగలుఁగు వన్యధాన్యంబులు ముడియలం గావళ్ళం బెట్టించి పట్టించుకొని కదలి కదలికాచందనస్యందన మరువకాగరుకురవ కాశోకపూగపున్నాగభూర్జ ఖర్జూర సర్జ కార్జున శిగ్రున్యగ్రోధగుగ్గులు మధూక వ్యాఘకింశుకశింశుపచూతజంబీకోదుంబరకదంబవంజులకుంజరాశనకరంజభల్లాతకీ సల్లకీచిరిబిల్వ బిల్వప్రముఖ వివిధవిటపికోటరక్రోడ క్రీడాచిక్రోడ కంకకలవిం కకపింజలఖంజరీటకపోతపారావత శారికాశుకపిక శిఖావళావళి ముఖరితం బగు వనంబుం బ్రవేశించియతిచపలవిపులకపిలాంగునంబులం గరువలితాఁకునం బాయుక రాలుపండ్ల నదనితోరఁగు నసేకవిహస్వాదురసంబులు పెనువజవలై పండి పగిలిన కానసేకు దండప్రకాండంబులం బర్వనిర్ముక్తంబు లగు ముక్తాఫలరాసులపైఁ బొరలిచి వరవందాపహ్నిపర్ణిస్థలవిశేషంబు నభినయించు నభిరామప్రదేశంబులం

గనుంగొనుచుం జని చని తాపసపరిషదుపనిషదుపబృంహిత బ్రహ్మవిద్యాతర్కఫక్కి
కాదర్కరితనూతనశ్రుతిశుభగారవంబులను నిష్ఠానుబద్ధవృద్ధముని పద్యానుసారి
విద్యార్థివటుకపటుముఖోచ్చరిత వేదనాదంబులుం గర్ణగోచరంబులైన నాకర్ణాంత
విశ్రాంతలోచనుం డచ్చట నరదంబు డిగ్గి యరిగి. 12

మ. హరిదశ్వాధికతేజుల న్విమలభస్మాపాండు సర్వాంగుల
న్వరరుద్రాక్ష విభూషితావయవుల న్వ్యాఘ్రాజినాసీనులం
గరుణామూర్తులఁ బుణ్యవంతుల జహత్కందర్పుల న్శాంతులం
బరమబ్రహ్మశిఖామహోపనిషదభ్యాసస్థితస్వాంతులన్. 13

సీ. ఫలభోజనులఁ బర్ణభక్షులఁ బంచగవ్యప్రాశనులను జలాశనులను
నీహారభుజుల శాకాహారుల సమీరవాసులఁ ద్రసరేణు పారణులను
సూర్యావలోకనస్తోకులఁ బంచాగ్ని మధ్యవర్తుల సదా మౌనపరులఁ
బంచాక్షరీమంత్రపారాయణులను నిష్కలశివనిర్మలధ్యానరతుల

తే. సంతతబ్రహ్మచర్యుల సంగవర్జితుల, నకాముల నూర్ధ్వరేతుల విని
ర్జితేంద్రియుల నిర్మలులను నిరీహులను ని, రాకులుల నిత్యముక్తుల నేకమతుల. 14

సీ. అంధకాసురవైరి యపరావతారుల యక్షేశసఖుని పర్యాయతనుల
సాక్షాత్కరించిన శశిమౌళిమూర్తుల నంబికేశప్రతిబింబములను
భావజారాతిలీలావిగ్రహంబుల నిటలలోచనుని మాఱటయొడళ్ళ
నగరాజకోదండు నామాంతరంబులఁ బ్రమథాధిపతిబహిఃప్రాణములను

తే. ఫణికులాధిపధరు ననుప్రాసములను. దనుజపట్టణభేదను వినిమయములఁ
బంచబాణారిపట్టము భద్రకరులఁ, గాళ్యపునియాశ్రమస్థానకమున మునుల. 15

వ. కాంచి రోమాంచ కంచుకితగాత్రుండును నమందానందనిష్యందసలిలనేత్రుండును
నై యా ధాత్రీకళత్రుం డందఱకు వందనం బొనర్చి తాఁ దెచ్చిన వన్యఫలధాన్యం
బులు ముందఱం బెట్టి వినయవినమితస్కంధుండై నిలిచిన నా మహర్షులు ప్రహర్షు
లై యా రాజర్షభునియెడ నెడమఱుంగులేని మైత్రియుం గరుణయుం జేసి యుచి
తాసనంబున నాసీనుం గావించి హస్తపద్మంబులెత్తి యతని వదనపద్మం బవలోకిం
చుచు. నచ్ఛద్మంబులగు సుధామధురవాక్యంబులం బ్రస్తుతించి. 16

సీ. స్వస్త్యస్తు శశివంశజలధి కౌస్తుభరత్న శ్రీరస్తు సమరనిర్జితసపత్న
దీర్ఘాయురస్తు పృథ్వీజనస్తుతశీల కల్యాణమస్తు విక్రమవిశాల
ఐశ్వర్యమస్తు ధర్మానోకహస్కంధ సమధికోన్నతిరస్తు సత్యసంధ
సౌభాగ్యమస్తు సజ్జన చూతవనచైత్ర విశ్వతోవిజయోస్తు విమలచైత్ర

తే. భూవినుతకీర్తిరస్తు సత్పుణ్యగాత్ర, సంపదభివృద్ధిరస్తు విశ్వప్రశస్త
శక్రవిభవోస్తు పూరువంశప్రదీప, జగతి భవతశ్చిరాయు దుష్యంతభూప. 17
క. అని మఱియుఁ బెక్కుఁదెఱఁగుల, ముని లభినవవేదమంత్రముల దీవనల
న్ననుమని యాధృఢభూపతి, మనుమని దీవించి సంభ్రమదమానసులై. 18
చ. కొని చని రా నృపాలకులకుంజరు నాశ్రితవజ్రపంజరున్
ఘనకుశదర్భతంతుపరికల్పిత పంపరపల్లవావళీ
వినుతవిచిత్రతోరణపవిత్రపథంబును గా నితాంతపా
వనవిహితాతిపూర్ణశుభవస్తువిశాలకు యజ్ఞశాలకున్. 19
క. ఆ రాజున కిప్పించిరి, నీరాజనములు సువాసినీజనములచే
గౌరవమున నంచితస, త్కారముతో నిచ్చి రచట గంధాక్షతముల్. 20
వ. ఇవ్విధంబున నీవారముష్టింపచు లగు తాపసు లా రాజు సంప్రహృష్టహృదయుం జేసి
సీ. సవనక్రియాలక్ష్మి సంప్రీతిఁ గ్రీడింప వేదోక్తిఁ గట్టిన వేదిఁ జూపి
కృష్ణవర్త్మకుఁ డారగింపఁ దెచ్చినయట్టి సమిధాజ్యదర్భసంచయముఁ జూపి
కలుషసంఘమునకుఁ గళముకొట్టయి యున్న బంధురచిత్రయూపంబుఁ జూపి
యజ్ఞపురంబునకైన నమరావతికినైనఁ బదము వెట్టఁగఁ జాలు పసువుఁ జూపి
తే. శుభకరోలూఖలచషాల శూర్పముసల, హరిణచర్మపవిత్రముఖ్యంబులైన
సాధనప్రకరముఁ జూపి సాధునివహ, కలకలితమైన ప్రాగ్వంశకంబుఁ జూపి. 22

వ. నేఁడు మొదలు సప్తరాత్రంబులు సప్తతంతువు నిరంతరాయంబునం గావలయు
నంతికమహీధరంబున ఖరతనూజుఁ డను దనుజుండు వర్తించుచుండు నిందులకుం
దగిన తెఱంగున రక్షణంబు వలయు ననిన నప్పుండరీకవల్లభుండు మేఘగంభీరధీరస్వ
నంబున.

క. రక్షోభయ మేల సహ, స్రాక్షుండు దేవతలఁగూడి యరుదెంచినఁ బ
ద్మాక్షుం డెదిరించిన నిట లాక్షుండు వచ్చినను నిలుతు యాగముఁ గాతున్. 24
గీ. క్రతువుఁ జాఁగింపుఁ డేమియుఁగలఁకలేక, యనుచు వానులవీడ్కొని మనుజవిభుఁడు
నిష్ఠురాధిజ్యకార్ముకాన్వితుఁ డగుచుఁ, గెలన మఖశాలదెసఁ గనుఁగొనుచునుండె.
శా. ఆతంకం బొకయింత లేక మతులన్ హర్షించి యధ్వర్యు లు
ద్గాత ల్హోతలు మంత్రతంత్రముల మాంద్యం బేదియు న్లేక సం
ఘాతంబై క్రతుకర్మము ల్నడుప నాఘారాహుతిష్ఠ్యాత్రజీ
మూతశ్యామలధూమరేఖలు నభంబు న్ముంచెఁ జంచద్గతిన్. 26

క. ఆ పొగలు చూడ మదిలోఁ, గోపాగ్నియుఁ బొంగెననఁగఁ గుటిలభ్రుకుటీ
వ్యాపారముఁ గ్రతువిభవ, వ్యాపారప్రౌఢిమంబు నాపాదింపన్. 27

క. ఆకౌణపనాయకు రో, షాకరమగు వదముఁ జూచి యది మాన్పుటకై
మాకంటుఁ డనెడు మంత్రి వి, వేకి తదగ్రమున నిలిచి వినయముతోడన్. 28

గీ. మాను తమకంబు నీ వేళ దానవేంద్ర, మానవేంద్రుం డనన్యసామాన్యబలుఁడు
సవనరక్షణసేయ దుష్యంతుఁ డధిప, వచ్చియున్నాఁడు మునితపోవనమునందు. 29

సీ. చింతాకులత్వంబు చెఱచుఁ దేజోలక్ష్మి సీధుపానప్రీతి సిగ్గుఁ జెఱచుఁ
జెఱచు మిథ్యాదృష్టిశీలతాగరిమంబుఁ బిశునవాచావృత్తి పెంపుఁ జెఱచుఁ
జిత్తవైకల్యంబు చెఱచుఁ బ్రజ్ఞాప్రౌఢిఁ బరవధూసంసర్గ బైసిఁ జెఱచుఁ
జెఱచుఁ గ్రోధము తపస్థిరసమాధిస్థితిఁ గాముకత్వము వివేకంబుఁ జెఱచుఁ
తే. గుటిలమానవుమైత్రి సద్గుణముఁ జెఱచు, నసమవిద్యావివాదంబు యశముఁ జెఱచు
ఫలితకార్యంబు వేగిరపాటు చెఱచుఁ, దమక మొప్పదు పనికి నెంతటిఘనునకు. 30

వ. దుష్యంతుం డలంతులం బోవువాఁడు కాఁడు, వాఁడితూపుల వేఁడిమిఁ జూపక మూఁడు కన్నులవాఁడు వచ్చిన తెచ్చపడండు, వియచ్చరులకుం దోడువచ్చిన వేళ వాహనక్రీడ నతని బాహుబలంబును జలంబును శౌర్యంబును దేవరయుం జేవయుఁ దెంపును బెంపును నెఱపును నొఱపును గబ్బును నుబ్బును నెఱుంగుదు, జన్నం బేఁడుదినంబు లున్నయది యదియునుం గాక నక్తంచరుల మైన మనకు శక్తి యగ్గలంబు. దివసంబున జనంబు నష్టంబై యుండు, మాపు తదీయవైభవంబు జూపుద మనిన నట్ల కాక యని యెట్టకేలకుఁ గయ్యంబు మీఁది కాంక్ష యుడిగి యాఁకటం జిట్టిన యహియుం బోలె నిశ్వాసంబులు నిగిడించుచు వాసవారాతి నిలువలేక యుద్ధసన్నద్ధుం డగుచు నుండె నంత నిక్కడ నాశ్రమంబున. 31

గీ. ప్రథమసవనక్రియలు సుసంపన్నమైన, మునులు భూపాలుఁ బిలిపించి జనవరేణ్య
యక్షతం బైన భవదీయరక్షణమున, నధ్వరము సాఁగె నంతరాయంబు లేక. 32

చ. అలసితి వెంతయేనియును నాఁకలిగొంటివటంచుఁ దేనెలు
న్ఫలములుఁ దెచ్చియిచ్చి సవనక్రియ మాపటిదాఁకఁ గల్గ ది
చ్చలఁ జని విశ్రమింపు నృపచంద్రమ పొమ్మని యంప నత్తప
స్వులకు నమస్కరించి చనఁ జూచి విచారము చేసె నాత్మలోన్. 33

ఉ. పోవ ననుజ్ఞ యిచ్చిరి తపోధను లిందు శకుంతలా ముఖ
శ్రీవిభవంబు దర్శనము సేయక యేగినఁ గంతుఁ డుగ్రుఁడై

కోవని యార్చి లేఁజిగురుకుంతముఁ గైకొని యడ్డగించునో
తావులవింట నేయునో లతాంతశరంబుల గుండెఁ గాఁడఁగన్. 34

సీ. రవులుకొల్పును సన్నపావలతోఁ రాఁజెడు కామాగ్ని దక్షిణగంధవహుఁడు
పురుశింజినాదంబు చెవినూఁది వెలిపింపఁజూచునో మరునింటి జోగి తేఁటి
వరులతోఁడుత మాట పలుకాడకుండంగ వాకట్టునో మంత్రవాది చిలుక
తెరువడ్డకట్టంగ మరునికింకరులకుఁ గూకలువేయునో కోకిలంబు

తే. భావజునిచేత నోర్వక పవనుచేతఁ దూలిపోవక యళిచేతఁ దొట్రువడక
చిలుకచేఁ డాల్మి చెడక కోకిలముచేత, గాసి గాక శకుంతలఁ గనుట మేలు. 35

వ. ఈవేళఁ బర్ణశాల నా విశాలలోచన నిలువక తరుసేచనంబు సేయం బోవు నేను నచ్చోటికిం జని. 36

సీ. కుంతలమ్ములపేరి కొదమతుమ్మెదల నుగ్రాలుగన్నులపేరి గండుమీలఁ
జన్నుగుబ్బలపేరి చక్రవాకంబుల హస్తద్వయముపేరి యబ్జములను
త్రివళిరేఖలపేరి నవవీచికలను సన్ననాభిపేరి నెన్నడిమి సుడిని
గటిమండలముపేరి ఘనసైకతోన్నతిఁ గోమలాంఘ్రులపేరి కూర్మములను

తే. రుచిరమైన శకుంతలారూపసరసి, నీఁదులాడింపకుండిన నెట్లు పాయు
దర్పకానంగశరజాలదావదహన, తప్తమన్మానసమరాళతాపభరము. 37

ఉ. కూరిమి బోఁటికత్తియలఁ గూడి శకుంతల మేలమాడి సాం
పారెడు పల్కులందు దరహాసపుఁజంద్రిక లంకురింప న
య్యారిక లందమంద భుజియింపఁగఁ గల్గుటఁ జేసి యచ్చటం
గోరికలంద లోచన చలోరికలం దనుపారఁ జేసెదన్.

క. ఆరామచెలులతోఁడుత, నారామకీర్తిద మాటలాడికొనఁగ నా
సారపుఁబల్కులు మతిఘన, సారపుఁ బల్కులయి చెవులు చల్లంజేయున్. 39

వ. ఆకర్ణించుకొనుచు నొక్కలతాకుంజకుటీరంబు మాటుగొని యనంగవేదనాపనోదంబు గావించుకొనియెదం గాక యని తొంటితోఁటకుం జని నిగూఢవృత్తి నీక్షించుచున్నప్పు డంతకమున్న హృజ్జాతభల్లభంజమానమానసయగు శకుంతల నచ్చటికిం గొనివచ్చి కుముదకువలయసౌగంధికారవిందనిష్యందమకరందబిందుసందోహశబళనంబును నిగుడారు నీరు దొలంకునఁ గల కొలంకు కెలంకునఁ బల్లవసముల్లసితంబగు సహకారంబు నీడ మవ్వంపుఁదిఁగె యొవరిం బుష్పాడి నొప్పెడి యరుఁగు గ్నమ్మోధఁ గెంపెసఁగు కిసలయంబులఁ బఱపఁబఱచి యచ్చటికిం గొనివచ్చి.

సీ. కడచేకు లొలిచిన కల్హారదళములఁ దలగడబిళ్ళ లందముగఁ జేర్చి
మీఁది బల్పెడ గీసి మృదువుగాఁ విమలమృణాలహారములు వైచి
పూఁదేనెఁ బదనిచ్చి పుప్పొడి మేదించి కలఁగొవ మేన జొబ్బిల నలంది
చలువవెట్టిన క్రొత్త జలజపత్రములను దోరమ్ముగాఁ జనుదోయిఁగట్టి
తే. చరణముల లేఁతచిగురు మేజాలుదొడిగి, కటిభరంబునఁ గురుమేకరువేలఁ గట్టి
పొగడలును బొడ్డుమల్లెలుఁ బొన్నవిరులు, బొన్నవను నాల్గుదిక్కుల బఱచివైచి.
క. అనసూయయును బ్రియంవద, యును గెందలిరాకుసురఁటి యొయ్యనవేళ్లం
బెనచిన చామరములుగొని, యనువారఁగ విసరఁ దాప మగ్గల మైనన్. 42
క. అనసూయ ప్రియంవదతో, మన మీ చందమున నిన్న మాపటఁగోలె
న్వనితకు శీతలకృత్యము, లొనరించుచునున్నవార ముడుగని పనిగాన్. 43
గీ. నయమొకించుకయైనఁ గానంగఁబడదు, చలువమందుల శైత్యంబు సంభవిలక
నినుఁడు గుడిచిన నీరయ్యె నింతి మేన, నంతకంతకు సంతాప మగ్గలించె. 44
క. వెలఁదికి మన మొనరించెడు, చలువలు రవి మేననైన శైత్యమునొందుం
బలుకులు వేయును నేటికి, వలిగొని వడఁకాడుచుండు వైశ్వానరుఁడున్. 45
ఉ. వేసర కాచరించెదము వేయితెఱంగుల శైత్యకృత్యము
ల్వేసవిఁ బశ్చిమానిలము వేఁడిమికన్నను వాఁడిఁ గల్గితో
డ్తో సముదీర్ణమై యగరుధూపము పెట్టినఁ దావులుబ్బని
శ్వాససమీరణంబు వడ చల్లఁదొడంగెఁ గడంగి పైపయిన్. 46
క. చదువుల వినియుండుదు మీ, యదవద విరహప్రకార మని యీ పనికి
న్నదతి కలలోన నెఱుఁగదు, కది సెన్నఁడు వినదు తొల్లికథలం దైనన్. 47
వ. ఇది యేమిమాయయొకదా తాత కాశ్యపమునీంద్రుఁడునుం జేరువ లేఁడు, మన మీ పూఁబోఁడి యున్న పోఁడిమియు నగ్గలఁత వేఁడిమియు నే యుపాయంబులం జక్కఁజేయుద మెవ్వరికిం జెప్పుద మెక్కడం జొచ్చువార మే దైవంబుఁ బ్రార్థింత మని యనసూయ కన్నీరు నించినం బ్రియంవద యిట్లనియె. 48
చ. ఎఱుఁగుదుఁ గొంతకొంత యది యే నెఱిఁగుండియుఁ జెప్పనేల యుం
చెఱుఁగనిదానిఁబోలెఁ జరియింపుదు నిట్టి రహఃప్రయోజనం
బుఱక తమంతఁ జెప్పుట యయుక్తము నేఁ గనుఁగొన్న చిహ్నము
ల్వెఱవక చెప్పెద న్గినుకలేక శకుంతల సమ్మతించినన్. 49

క. అని భామ ముడియం బెట్టుచుఁ గనుగీటిన నమ్మతంబుఁ గైకొనినదియై
యనసూయ చెప్పమనుచును, దను నడుగఁగ నా ప్రియంవద గభీరోక్తిన్. 50
శా. నీవు న్నేనను జూడఁగా వనములో నిన్న న్మదాళివ్యథన్
దా వర్తింపఁగ వచ్చె రా జెఱుఁగవా తద్వేళఁ బాలిండ్లపైఁ
బ్రోవులోవ్వఁగినభంగి ముత్పులకము ల్పుంఖానుపుంఖంబుగా
నూఁగిళ్వ్వారుచు జూచె భూవిభునిఁ దా నొయ్యారపుం జూపులన్. 51
చ. మన తరళాక్షి సిగ్గుతెఱమాటున నుండక దాఁటి దాఁటిపా
టినఁ గదియంగఁ బట్టి యుసిరింతలచూపులఁ దన్నుఁ జూడఁగా
మనుజవిభుండు ప్రేమగరిమంబునఁ జూచె లతాంగినయ్యెడన్
జను మొన నాఁటె నా నృపతిచంద్రుని చూపులుఁ గంతుతూపులున్. 52
క. అప్పటఁ గోలెను లలనను ని ప్పంటినయట్లు మేన నిగిడెడుఁ దాపం
బి ప్పగిది నేను గన్నది, తప్పదు నిక్కంబటంచు దాఁపక చెప్పెన్. 53
క. ఆ మాటలు విని నృపతికిఁ, గాముని శరనిహతి నైన గంటులు పూడెం
గా మాగ్నియుఁ జల్లాఱెను, గామిని తనమీఁది ప్రేమకలిమియుఁ దెలిసెన్. 54
వ. ఇత్తెఱంగునం బ్రియంవద వృదూక్తులం దత్ప్రకారఁబు విరహవికారంబకా నిశ్చయించి తన్ముఖంబునం దెలియక ప్రయోజనం బోజవడ నేర దని యనసూయ శకుంతలం డగ్గఱి కుంతలంబులు దువ్వుచు నడుకుచుం దొరంగు కన్నీరు కపోలంబుల రాలినం దుడుచుచు మృదుమధురమందస్వరంబున. 55
గీ. తలఁపు వంచింపుదురు తలిదండ్రులకును, జెలులయెడ దాఁచి నిలుపరు చిత్తవిధము
ఇంతి నీ కింక నీ కింక యొందు మాను, జెప్పు నా తోడు నాతోడఁ దప్పుగాదు.
క. నీవు బహిఃప్రాణములము, మా కె యెఱింగింప వింక మఱి యెవ్వరికిం
గోకనదహస్త చెప్పెదు, డాఁకొని మదిలోననున్న తగులు న్నెగులున్. 57
ఉ. లాఁతితనంబు చేసి యబలా యెఱిఁగింపక నిల్వనోపుదే
శేఁతలు గాక గుండె లగలించెడు కోయిలదుండగీల పె
న్గూఁతలు గడుఁ దుమ్మెదల గుంపుల మ్రోఁతలు లోన నీఁతలుం
బోఁతలు నైనయట్టి తలపోఁతలుఁ గంతుని వీఁక చేఁతలున్. 58
క. రోగంబు పే రెఱుంగక, యే గతి నౌషధము శాంతి కే నొప్పదు నా
లాగున నీ హృదయమునను, రాగము కీ లెఱుంగ కే వెరవు నేయునగున్. 60

వ. ఏనును బ్రియంవదయు నీకుం బర్యాయదేహంబులము, ప్రతిచ్ఛాయలము మాకంటె నింక నెవ్వరు వశ్యులు వయస్యలుం గలరు నా యాస్యంబు చంద్రాస్య చక్కం జూడు నీ యాశాస్యంబు నెఱంగింపకున్న మ మ్మొల్లకుండుట బ్రియంవదప్రాణంబులకుఁ దప్పినదానవు నీవు ప్రేమనాటించి పెంచినమాలతీలత స్వహస్తంబునం దుంచిన దాన వని యాసలు వెట్టిన నిట్టూర్పు నిగిడ్చి మొగిడ్చినలోచనంబు లించుక విచ్చి నెచ్చెలివిధంబుఁ జూచి తదీయాంకపీఠంబున వదనపంకజంబు మోపికొని గద్గదకంఠనాళయై యుత్కంఠ నీకుం బ్రియంవద చెప్పినది తప్పదని.

శా. గంగాగర్భమునుండి నేఁటితుదదాఁక న్మాటరాకుండ నుం
డంగాఁ గల్గెను మీ మొగంబు లిఁకఁ జూడ న్నాకు మో మేది యే
భంగి న్నిల్తు మునీంద్రకన్యకలతోఁ బాటించి మా తండ్రిఁ ద
న్వంగీ! యే గతిఁ జేరఁబోదు నని యొయ్య న్వెక్కివెక్కిడ్చినన్. 61

క. కన్నీరుఁ దుడిచి గొజ్జఁగి, క్రొన్నీరున మోముఁ గడిగి కూరిమి మెలఁగ
న్నా నీరజముఖిఁ గౌఁగిటఁ, జెన్నారఁగఁ జేర్చి యెలమి చెన్నుదలిర్పన్. 62

క. కోమలి! మేనకకును వి, శ్వామిత్రమునీంద్రునకును జనియించిన బా
లామణివి నీవు నీ కే, లా మునికన్యలలోఁ గలంకము గలుగున్. 63

ఉ. నీకు విచార మేల మహనీయచరిత్రవు నీ మనంబు గం
గాకమనీయపావనము కల్మష మందఁగ నేర దెందు మం
దాకిని నిర్ఝరాకృతి సుదారగతిం జనుదెంచు నెల్ల ర
త్నాకరుఁ బొందఁ గాక యహహా చననేర్చునె చాటికుంటకున్. 64

గీ. చంద్రవంశోద్భవుండు దుష్యంతవిభుఁడు, నీకుఁ బతియౌటకుం దగు నీరజాక్షి
తగుదు పతనికిఁ గౌశికాత్మజవు నీవు, నెట్టి యనుకూలదాంపత్య మిరువురకును. 65

వ. ఆరూఢయౌవని వైననీకుం దగినవల్లభుండు గలుగ సుమావల్లభుని సేవింపం దాత కణ్వమునీంద్రుండు సోమతీర్థంబునకుం బోయి వ్రతంబుపూని వర్తించుచున్నవాఁ డేతత్కార్యంబు సిద్ధించిన నయ్యార్యచరితుం డుల్లసిలుం గాని పుల్లసిలండు చింత యుడిగి సంతసంబు నొందు మని పల్కి యనసూయ ప్రియంవద వదనంబునం జూడ్కి నిలిపి యిట్లనియె. 66

గీ. లెస్సచోటనె నిలిచె నీ లేమప్రేమ, తాత వినినను మిగుల సంప్రీతినొందు
ధరణిపతిచిత్త మేమిచందంబొ యనిన, నింపుమీఱఁ బ్రియంవద యిట్టులనియె. 67

క. ఆ విధము నించుకించుక, భావంబునఁ దోఁచె నా నృపాలుఁడు నిన్నన్
గేవలము మనచెలిం గని, తేవ ద్రొలఁగి మిగులఁ బల్లటిల్లిన చెలువున్. 68

ఉ. తేఁకువ దప్పి వడదేఱెడుకన్నులు మున్నువంటి యా
తూఁకువ లేక మేను గడుఁ దూలియ యున్నది మోముచందమున్
వేఁకువచందమామగతి విన్నన యైనది మన్మథాస్త్రము
ల్డాఁకినభంగిఁ దోఁచు వసుధాపతిఁ గాంచితి యాగశాలలోన్.

వ. మృగయావిహారవ్యాయామంబునం గల యలపు సొలపుం గాదు ప్రసవబాణ తప నవ్యథాజాతసంతాపశాంతియు సిద్ధంబు. ఆ మూర్ధాభిషిక్తునకు శుద్ధాంతకాంతా జనచింతాభరంబో శకుంతలాచింతాభరంబో నేఁటి రేపటి నెల్లి యెల్లుండి మెల్ల మెల్లనఁ దెలిసికొనియెద నీ లోన నిప్పల్లవాధర ప్రసవభల్లంబుల నుల్లంబు జల్లని యుల్లంబోయి యపాయంబు నొందకుండ నుపాయంబు విచారించుకొనవలయు ననిన న వ్వచనంబులు భూవల్లభుండు విని.

శా. బాలారత్నము కూర్మి నా వలన సంపాదించుట ల్వింటిఁ ద
న్మూలంబైన మనోజతాపమును గన్నుల్లల్లఁగాఁ గంటి నీ
వేళ న్నేఁ బొడసూపకున్న మరుఁడే విఘ్నంబు గావించునో
యాలస్యా దమృతం విష మ్మనెడు వాక్యంబు ల్పురితం బెప్పుడున్. 71

క. ఒప్పనిపని కాలస్యము, చెప్పుదు రింతియ శుభస్య శీఘ్రమనఁగా
నిప్పలుకు విచారించిన, నిప్పుడ పొడచూపవలయు నిభగామినికిన్. 72

వ. ఒక్క యుపాయాంతరంబునం గానుపించెదం గాక యని యొక్కయెలమావికి ఛద్మంబున బిసతంతువాగుర బాగుగా నమర్చి, యురివేఁటకానిలాగున శకుంతంబుల నిరీక్షించుచున్న వాఁడ పోలె శకుంతలయున్న వృక్షవాటి కల్లనల్లన చొచ్చివచ్చుట యు ననసూయాప్రియంవదలు కనుంగొని రాజు విచ్చేసె నని సంభ్రమంబున నా సనంబుల డిగ్గినం జూచి సమ్మదభయవినయకలితలజ్జాసముపేయం బగు రయంబున

చ. కిసలయశయ్య డిగ్గి యొకకేలివ శకుంతల నిల్చియుండఁ ద
త్కుసుమ నవాంక మంటుకొని క్రొత్తవిరుల్గనుపట్టె నెంతయు
న్నొసలిసిడంబువాని పువుముల్కులు నాటిన పోటుగం ట్లనన్
రసగిరిపేరఁ బడ్డ రుధిరంబుల యోడికతండమో యనన్. 74

ఉ. ఆ రతిబోడిఁ సజ్జచిగురాకులు పై పయి నంటియుండఁగాఁ
గీరముఖారుణచ్ఛవిని గెల్చి తనర్చిన యంగజాతుశృం
గారపుఁదోఁటలోని నవకల్పకవల్లియో యంచు రాజు నిం
పారఁగఁ జూచుచుండె మధురోల్లసముగ్ధము లైన చూపులన్. 75

క. బాలికఁ జూచుచు ధరణీ, పాలుఁడు పలు సుడిగి ప్రమదభరితుం డయ్యె
న్బాలికకును నా ధరణీ, పాలకునెడ లజ్జ మానబంధము నొందెన్. 76

వ. ఇవ్విధంబున శకుంతలాసౌందర్యసందర్శనసౌఖ్యపారవశ్యంబున రాజును లజ్జాభయ
రజ్జుబంధంబున మానిగంధగజయానయుఁ జిత్రరూపంబుల చెలువునఁ బ్రతిజ్ఞ
చేసికొనిన కరణిఁ గనుఁబొకవెట్టిన చందంబున మౌనినము త్రియంబులవలెనుండ
ననసూయ డాయవచ్చి భూనాయకున కిట్లనియె. 77

గీ. నిన్న నిచ్చట నీ యింతి నిన్నుఁ జూచెఁ, జూచుటయుఁ దప్పు గాఁ జూచి సూనబాణు
డింతఁ గాఁ జూచె విచ్చేసి తింతలోనఁ, గ్రంతగాఁ జూచుఁ గా కింకఁ గాంతసురుఁడు

ఉ. జాతకృపావిభూతి మదసామజయానను దేవయాన మా
తాత వెడల్చి తెచ్చె భయదం బగు కూపములోన నుండఁగా
భూతలనాథ నీవును ప్రభూతదయ న్వెడలింతుఁ గాక నేఁ
డీ తరళాయతాక్షిని రతీశుఁడు ద్రోసినతాపకూపమున్. 78

చ. అనిలము రోగముం గఱవు నగ్నియుఁ దోయము దైవికంబులై
చనుఁ దనవారుఁ జోరులును శాత్రవులుం బయివారుఁ జేయు పీ
డనములు మానుషంబు లగుటం బతి యంపని యీ ద్వివర్గము
న్మనమునఁ గాంచి నేర్పు మెయి మాన్పుటయొప్పుఁ బ్రజాభివృద్ధికిన్. 80

వ. ఈ యర్థంబున మాయంను చోరుండు మా మానిని మానధనంబు ముచ్చిలి తెచ్చి మా
కిచ్చిన చోరుండు భవత్సమీపంబునన యున్నవాఁడు స్త్రీధనంబులు రాజులకగ్రా
హ్యంబు లింతిసొమ్ము మగుడ నిప్పించి యశస్కరుండవై మనసిశస్కరుని శిక్షించి
విచ్చేయు మనిన మందస్మితవదనారవిందుండై యయ్యిందువంశసంభవుండు విస్రంభ
గంభీరంబుగా నిట్లనియె. 81

గీ. మొదల మా ధైర్యధనములు ముచ్చిలించి, యించువిలుకాఁడు దొంగ మీ యింతి కిచ్చె
నేము కోవెలపులుఁగుచే నెఱుఁగుటయును, గుసుమమా కిచ్చె మీ యింతి హృదయధనము

క. మా సొమ్ము మాకు నొసఁగిన, మీ సొమ్ము నీకు మగుడ మీ మా సొమ్ము
ల్వాసివడకుండ నూరకఁ, గోసనయేమిటికి మార్చుకొనియెన వెండెన్. 83

గీ. ఇందులో నిష్టమెద్ది మీ యిందుముఖికి, నడుగుఁ డెడమాటలకుఁ బొద్దునడివి లేదు
సాయ మవసానమైనను సవనరక్ష, కొదగవలెఁ గాని యిం కిట నుండరాదు. 84

మ. నయశాస్త్రంబులు మీ రెఱుంగనివి యెన్నం గల్గ వింతుల్మనః
ప్రియము వీక్షింపఁగదా స్వయంవరము కల్పింపఁబడె నీకు మా

వు యశోహీనులు లేవు కౌతుకము మీకు న్దన్కనిం గల్గనే
నియుఁ గావింపుఁడు మాకుఁ గోర్కులు మదిన్నిండార గాంధర్వముఙా. 85

వ. వివాహంబులు బ్రాహ్మ్యంబును దైవికంబును గారుడంబును బ్రాజాపత్యంబును రాక్షసంబును నాసురంబును గాంధర్వంబును బైశాచికంబును నను నెనిమిదితె అంగులం బ్రవర్తిల్లు నందు క్షత్రియులకు గాంధర్వంబును రాక్షసంబును ముఖ్యంబు లనిన నృపముఖ్యుని వాక్యంబులు శకుంతలవయస్యలు విని వినయంబున నిట్లనిరి.

చ. జనవర! నీవు చెప్పినది సత్యము నీ మది దుష్పథంబునం
జనమియు నే మెఱుంగుదుము, సర్వవిధిజ్ఞుఁడు కాశ్యపర్షియు
న్మనమున నొందు హర్షము నమర్షము నొందుఁడు మాకు నీ పరియో
జనము శుభంబె యైన నొకసంశయమున్నది మానసంబులన్. 87

వ. అది యెట్టి దనిన. 88

క. వేఁటమెయివచ్చి నృప మా, బోఁటికిఁ జిట్టంట్ల నంటి పోయిన పిదపం
దాఁటువడుం గులమునకును, మాటయుఁ గణ్వునకువచ్చు మానులచేతఙా. 89

ఉ. మా తరలాక్షిపైఁగలుగు మక్కువ నిక్కువ మయ్యె నేని యో
భూతలనాథ! యీ తలిరుఁబోఁడికి నీకునుఁ బుట్టుపుత్త్రుఁ బ్రి
స్మీతిగ యౌవరాజ్యపదపీఠమున న్నిలుపంగ సత్కృపా
న్వితుఁడవై మనోజ్ఞమహనీయముగా శపథంబు నీఁదగుఙా. 90

క. అనవుడు నవ్వనితలతో, జనపతి యీ పనికి నేలసందేహము, నా
ఘనలక్ష్మికిఁ గాశ్యపముని,మనుమని కంటెను మఱొకఁడు మాన్యుఁడుగలఁడె?91

సీ. నిజముగా నీ బోఁటినెలఁతపైఁ గూరిమిగలుగు నా యంతరంగంబుసాక్షి
కలహంస కీరకోకిలములుగొలువ నోలగమున్న యీ వనలక్ష్మిసాక్షి
కుధరకన్యానాథ కోటీరరత్నంబు చంద్రుండు మా కులముస్వామిసాక్షి
యలికలోచనమూర్తియైన కాశ్యపమహామునీందుపాదపద్మములుసాక్షి

తే. సారసత్యచరిత్రలు మీరు సాక్షి, యీ లతాంగికి సుతుఁ డుదయించుపుణ్య
మేనుఁ జేసిన నతని నా యేలు సకల, సింధునేమికి యువరాజుఁ జేయువాఁడ.92

వ. అని యివ్విధంబున నవ్విశ్వంభరాభర్త విశ్వాసంబుచేసిన విశ్వామిత్రపుత్త్రిం డెచ్చి గాంధర్వం బమంత్రకంబుగావున నా తాఱు హస్తంబునకు నారాజవదన కరసరోజంబిచ్చి శచియు శతమన్యుంను, శరధికన్యయు శార్ఙ్గపాణియును, శైలరాజకన్య.

యుఁ శశాంకశేఖరుండును బోలె శశివదన శకుంతలయు శశికులావతంసంబు దుష్యం
తుండును ననుకూలదాంపత్యసౌఖ్యంబు లవిచ్ఛిన్నప్రీతి ననుభవింపుదురుగాక యని
యనసూయాప్రియంవదలు దీవించి వాసనాప్రసవముకుళంబుల నిరువురిశిరంబులం
జల్లి పల్లవతల్పంబునకుఁ గొనిపోవునెడ. 93

సీ. ప్రళయసంధ్యానటత్ఫాలాక్షుఁడమరుకోచ్చండనిర్ఘోషంబు బెండుపఱచి
మందరాచలమహామథనవేళాగుంభదంభోధినాదంబు నపహసించి
గిరిగరుత్ఖండనక్రీడాసమారంభదంభోళిరుదితంబుఁ బ్రదస్తరించి
పుష్కలావర్తకాంభోధరోదరగళన్నిర్ఘాతరావంబు నీచపెట్టి
తే. వరుస దిక్కుంజములఁ బ్రతిధ్వనులు చెలఁగ, నాశ్రమారణ్యముల నెల్ల నాక్రమించె
మునులు భీతిల్లఁ గాళికాముఖమహోగ్ర, భూరిసన్నాహసమరభేరీరవంబు. 94

స్రగ్ధర. ఆ నిర్ఘోషంబుకంటెన్ హరదురుగతి మున్నాడి యొక్కింత యార్త
ధ్వానంబుల్ మౌనిరాజీవదనభవములై వచ్చె నస్మత్తపోర 96
క్షానిష్ఠాలోల హేలాసమరవిజయదుష్యంతభూపాల రక్షః
కీనాశుల్వచ్చి రుద్యత్క్రియఁ దపసుల రక్షింపు రక్షింపుమంచున్. 95

గీ. పిశితభోక్తల నిష్ఠురభేరిరవము, నధికభీతమునీంద్రుల యార్తరవముఁ
గోపకారుణ్యరసములు గుదిగొనంగ, నపరరావంబు భూవిభుఁడాదరించి.

సీ. సౌధాగ్రరత్నపంజరముల రంజిల్లు రాజకీరమనోజ్ఞరవముకంటె
భోగినీనఖరాగ్రముల మోహనంబైన వలమానవీణారవంబుకంటెఁ
గలకంఠకంఠులు కలరవంబులఁ గొల్పు రమణీయసంగీతరవముకంటెఁ
జామరగ్రాహిణీజనముల కరరత్నవలయమంజీరరావంబుకంటె
తే. మందిరోద్యానకాసారమధుపచక్ర, వాకకలహంస మధురరవంబుకంటె
నుత్తమక్షత్రకులజులు చిత్తగించి, యాదరింతురు కరుణతో నార్తరవము. 97

వ. ఇత్తెఱంగునఁ గురంగాంకకులమహీభర్త మహర్షుల యార్తరవంబు విని ముహూర్త
మాత్రంబునుం దడయక తదీయరక్షార్థంబు రక్షోవరులపై నడువసమకట్టి శకుంతల
వదనం బవలోకించు నప్పుడు. 98

ఉ. తాఁ గదలంగ బాష్పములధారలునుం గదలంగ నింతి దా
నాఁగకయున్న దుశ్శకున మౌనని ఱెప్పల నప్పళింపఁగాఁ
దోఁగిన యశ్రువారిఁ గనుదోయి భరంబయి యొప్పె నెట్లుగాఁ
గ్రోఁగిన సిక్తతోయము కాయజసాయకయుగ్మమో యనన్. 99

క. ఆ వేళ శకుంతలతో, నీ వేల లతాంగి యింత నెగులు పడంగా
నావేలము సమయింతును, నీ వేలం జిటికెవేసి నిలిచినమాత్రన్. 100
క. నా లావుకోలఁది నెఱుఁగక, బాలా! నెఱచెదవు కోణప నికాయముపైఁ
గోలాహలముం జేయుదు, హాలాహలహరుఁడు వచ్చి యడ్డంబైనన్. 101
క. అని తేర్చెఁ బ్రియంవదయును, ననసూయయు విభునిఁ జేరి యట్టిట్టనరా
క నిరీక్షింప నతని మే, లునకుం దమసఖికి వామలోచన మదరన్. 102
గీ. కాంచి మనములఁ గడుఁ గౌతుకంబు నొంది, యా శకుంతలతోడ నోయుఁ రుఁబోఁడి!
జయ మవశ్యంబు నీ నిజస్వామికి వును, నగు మొగంబున ననుచు భూనాథుఁ జూచి
ఉ. హస్తినిశాటభంజనుఁడు హైమవతీరమణుండు దేవతా
మస్తకరత్నపుంజరుచిమంజులపాదసరోరుహుండు లో
కస్తవనీయధాముఁడు జగన్నుతుఁ డా త్రిపురాంతకుండు దా
స్వస్తియొనర్చుఁ గాత! విలసత్కరుణామతి దానవాజిలోన్. 104
వ. అని యాశీర్వదించి సమ్మతింప నమ్మహీవరుండు వనబహిరంగణంబునకు సారథి యెదురు తెచ్చినఁ స్యందనం బెక్కి యుక్కరుండును నుక్కు మిగిలి త్రిపురాసుర వీరుల పయిం జను ఫాలలోచనుఁడునుంబోలె నాలంబునకు నడచునెడ 105

సీ. జడ లూడి యాహులకై వడిఁ జిక్కఁ జీరుగా నవనిపైఁబడి పొరలాడువారుఁ
బదిరైదు నంజలవరు వెత్తి చనలేక దగదొట్టి పెదవులు దడుపువారుఁ
గంపతాఁకులఁ జీరుగంటులై వీఁపులఁ జీరలంటుగఁ బొద ల్దూఱువారు
నెటకుఁ బోవఁగలేక యుటజకోణములలో నొఱగి యూరుపు పుచ్చ వెఱచువారు
తే. లేఁటిఁ బొడఁగని వెస బాతళించువారు, నైన మునులను జూచి హస్తాబ్జమెత్తి
వెఱ పుడుగుఁడోడకుఁడు భ్రమవిడువుఁడనుచు, నంచితాలాపముల భీతి నపనయించి.
క. యాగము గొదవడకుండఁగ, సాగింపుఁడు యుష్మదీయసవనానలకుం
డాగతవినీలధూమస, మాగమమున దనుజమశకమండలి గ్రగ్గున్. 107
క. అని తేర్చి యనిలరయమునఁ దన యరదము నరుగనిచ్చి దొదవ్వుల న
ద్దనుజులఁ గనుఁగొని రిపుఖం, డనచండభుజుండు విలు గుణధ్వని చేయన్. 108
మ. చెలిమిం జేసెద బాహువస్థలమునం జృంభించి యా చంద్రమః
కులభూపాలకబాహుదండవిలసత్కోదండటంకారము
న్గులిశారావగభీరఘోరరవమహాకోపోగ్రహుంకారము
ల్ప్రాళియారంభనటత్కృతాంతపటహప్రత్యగ్రభాంకారముల్. 109

క. ఆ రావము దమకుం గ, ర్ణారుంతుదమైన దానవాధిపుఁ డని పెన్
భూరమణుమీఁద దిక్కరి, సారుల మాకందశరభసైన్యాధిపులన్. 110

ఉ. వారును నేగుదెంచి జనవల్లభుపై మిహిరాంశుతీవ్రకిం
శారుపరంపరల్ వఱపఁ జంచలమొంద కమందదీప్తిమం
ద్దారుణతబాణయుగ్మముల దారితకంధులఁ జేసి వీరల
శ్శ్రీమ్రరమణీయభూతబలికి న్బలుగొట్టెలఁ జేసె నిద్దఱన్. 111

క. మాకందశరభు లిద్దఱు, నీ కరణిని సమరధరణి నీల్గుట విని యా
రాకాసిఱేఁడు కుపితయై, మాకారత నగ్నికణము లక్షుల రాలన్. 112

శా. ఏమేమీ మఖరక్షక న్మనులు ధాత్రీనాథముం దెచ్చి సం
గ్రామక్రీడకు నొడ్డిరే మఱచిరో కా కాత్మలం గర్జదం
భోమత్కల్పనిశాటవీరసుభటస్ఫూర్జద్భుజాకార్ముక
జ్యాముక్తాతికఠోరసాయకమహాశంబాళిసంబాధమున్, 113

వ. మాకందశరభులిద్దఱు నడ్డసేమితప్పె దర్పకారాతియే తెంచినఁ జక్రధరుండు విక్రమించిన తీచ్చ్వడని వియచ్చరకోటి సేన లెచ్చటికిం బోయెనని నిర్నిద్రనిర్నిరోధక్రోధంబున నసురనాథుండు సుభటయూథంబు నాయోధనంబునకుం బనుప వారునుం జని యుద్ధృత భేరీభాంకృతులును జటులమదకరిఘటాఘీంకృతులును దురగహేషాహీంకృతులును గుండలితకఠినకోదండజ్యాలతాటంకృతులును బదాతినదనాదసాహంకారహుంకృతులును నబ్జజాండకటాహంబు చిప్పలసందు వాపం గోపంబు పెక్కురూపంబులుగైకొన్న విధంబున వీరంబు బహుశరీరంబు లెత్తిన చాడ్పునమూఁకంగొని వేఁకనిడమి నాకంగొనక వీఁక నొక్కుమ్మడిఁ గవం గరిపురాధీశ్వరుండు దాఁకి నల్లగిరులుం గొను నొడళ్ల కాంతులు మొయిళ్లును, విస్ఫూర్జితాట్టహాసంబులు గర్జారవంబులుగ స్యందనపరిభ్రాపుంజంబులు మెఱుంగులుగా నంపవానలు ముంపఁ జలింపక నిలింపసత్వసారుండై యొకవీరుండు విల్లుం దెగఁగొని వాలంపవెల్లువ పెల్లుగాఁ బఱపినం బసని యశనిరోచిరు ద్భల్లంబు లగు మనుజవల్లభుభల్లంబులం గృతాంతపురపథికులగు రథికులును విశ్లథంబులగు రథంబులును వికర్తనతనయకింకరభృత్తులగు వీరరాహుత్తులును విగతత్రాణంబులగు ఖత్తుబాణంబులును విస్తీర్ణజీర్ణాంగంబులగు మాతంగంబులును విన్యస్తదైన్యంబైన సైన్యంబును విస్రస్తంబును, విధ్వస్తంబును వీటతాటంబును వీరాకుల విదళంబునుం గావించి విలోకించిన. 114

చ. అఖిలజగద్విహారకులహారపరాయణుఁ డుల్లసచ్ఛిఖా
శిఖిసఖఖడ్గపాణి రవిజహ్వుఁడు విస్ఫురితారిమండలీ
ముఖరులు వీరశేఖరులు ముప్పదికోటులు ముఖ్యనాయకు
ల్సఖులనుబోలె నుండ బలసంపదుపేతుఁ డభీతుఁ డాజులన్. 115

సీ. తురగరింఖాముఖోద్ధూతధూళీపాళి నభ్రగంగానది నడుసు రేగ
లసితశస్త్రజ్యోతు లాశాధినాథుల యిండ్లముందల్ల నీ రెండగాయ
దంతిసంతానదుర్దాంతఘీంకృతులచేఁ జెవులు ఝుమ్మనుచును జిల్లువోవ
విపుల సైన్యవరోగ్రవిన్యాసరవమున నుర్విప ట్టపలి యఱ్ఱూఁతలూఁగఁ

తే. గుండలీకృతచాపకోదండదీక్షు, నిష్ఠురజ్యారవంబుల నింగి వగుల
విక్రమాభిక్రమంబున నాక్రమించి, రభసమున వచ్చి దుష్యంతవిభునిఁ దాఁకె. 116

ఉ. తాఁకి పరేతరాజవరదత్తములైన మహోగ్రబాణముల్
వ్రేఁకని వీఁకతోడఁ బృథివీపతిపై నిగిడింప నాతఁ డ
క్కాఁకకు నోర్వలేక యలుకం బిశితాశనభర్తవక్షముం
దాఁకఁగ నేసె శాత్రవవిదారణదారుణవారుణాస్త్రమున్. 117

క. వారుణబాణమునకుఁ బ్రతీ, కార మెఱుంగక సురారి గతజీవుండై
ధారుణిఁ బడెఁ బవిధారా, దారితమై పడిన గోత్రధరు చందమునన్. 118

వ. రవిజిహ్వుఁడు వారుణబాణపాతంబునం బ్రేతపతిపురంబునకుం బోయినం గనలి కాళికాముఖుండు క్రోధపాటలముఖుం డగుటయుఁ బాటలవర్ణ మానాశి మర్త్యాశిత్రయం బగ్నిత్రయంబు ననుకరించి లోకత్రయదాహకులై ప్రచండవేగంబున నేనుంగుపురాధిపు సేన నేన సంహరింతునని పంతంబులాడుచు నా రాజసింహం బుపయిఁ గదిసిన. 119

శా. సంగ్రామంబున కుత్సహించుటయు నా క్ష్మాభర్త కల్పాంతవే
ళం గ్రీడించు లులాయవాహనునిలీలం గ్రుద్ధుఁడై యుద్ధసీ
మం గ్రోధాగ్నికిఁ జేసె నాహుతులుగా మానాసి మర్త్యాసి పే
ళ్లం గ్రూరాకృతిఁ గ్రాలు దానవుల ఖేలద్బాణయుగ్మంబునన్. 120

గీ. పాశ్చ్యవలిద్దఱు నబ్జాభిమిపాలు నిశిత, బాణయుగమున నిర్గతప్రాణులైనఁ
దూర్ణముగవచ్చి పాటలవర్ణుఁ డేసె, నవనిపతిమీఁద నైంద్రజాలాశుగంబు. 121

క. ఆ యింద్రజాలబాణము, మాయావిధ మేమిచెప్ప మహనీయంబై
యా యోధనసీమ మహీ, నాయకుకన్నులకు మునివనంబై తోఁచెన్. 122

మ. కకుబంతంబులు ముట్టి మ్రోయుచుఁ బరీక్షావేదఘోషంబుఁ దా
నొకచోఁ సధ్వరతంత్రమంత్రనినదం బొండొక్కచోఁ స్మార్తక
ర్మకలాపారవ మొక్కచోఁ లలితమీమాంసానినాదంబు వే
ఱొకచోఁ యుద్ధవిజృంభణం బుడిగి యయ్యుర్వీశ్వరుం డుండఁగన్. 123

క. ఆ రాక్షసమాయాస్థితి, సారథి యెఱిఁగింపఁ దెలిసి సారాస్త్రమున
న్వారించి యొక్కతూపునఁ, బౌరుం డిలఁ గూలనేసెఁ బాటలవర్ణున్. 124

శా. క్రవ్యాదుం బరిమార్చి యెంతయును నుగ్రింపశ్యుఁడై నిల్చి వా
యవ్యాస్త్రం బరివోసి యేయుటయు వాత్యావేగవిస్ఫూర్తి నా
ర్తివ్యాహారము లుప్పతిల్ల నుడువీథిం గొండ్లియాడించె దై
త్యవ్యాధు ల్తెరఁబొమ్మలట్ల నిగుడం దా నాటకాఁడుం బలెన్. 125

స్రగ్ధర. ఆజన్యంబందు నిర్మై నఖిలదనుజవీరాతి వీరోగ్రసారు
ల్రాజన్యాస్త్రాళిచేత వ్రణమునఁ బడిన న్రాక్షసాధీశుఁ డేగన్
రాజన్యానీకవాజివ్రజఖురజరజోరాజి ఘోరాజిభూమి
న్రాజీవాప్తుం గ్రహింప న్రభసమునఁ బయోరాసుల న్సంగ్రహింపన్. 126

వ. ఇట్లు సంరంభవిజృంభమాణుండై కాళికాముఖుండు బర్హిర్ముఖవిరోధిదిశాధిక
ముఖంబులం జలింపఁ బంచదశాక్షౌహిణీయుక్తుండై మూర్ధాభిషిక్తునిపయిం గవి
సిన నసిముసల భిండివాలముద్గరతోమరప్రాస శరాసనప్రముఖ నానావిధప్రహా
రణంబులం గుప్పించిన దప్పించుకొనుచు నుప్పరవీధికిం దత్తటిల్లతలం గల్పించు
పోలికఁ గనకపుంఖశిలీముఖంబులు వఱపి యాకసంబునం గనకసంఘంబువోలె
నల్లగరులశరంబులు దట్టంబుగ నేసియు విహాయసంబునకు రాయంచకదుపు లెగ
యు చందంబునం దెల్లపింజెలభల్లంబు లేసియు మహానక్రంబు సముద్రక్రోడంబు
నుంబోలె విక్రమాభిక్రమంబున నుక్కుమిగిలి యా శకారిసేనానక్రాకరంబుఁ
జొచ్చి శోధించి కలంచి కలగుండుసేసి మట్టిమల్లాడి వెరఁజ వెంపరలువెట్టి వచ్చి
పోయిన తెరు వెఱుంగరాక యెక్కడఁజూచిన రథమయంబై యేవంకఁజూచిన
దుష్యంతమయంబయ్యును నే నిశాచరుంజూచిన శరమయంబయ్యె నుండె నట్టి
బెట్టిదంపు మోహరంబున. 127

చ. తొడుగుట కానరాక వెసతొడన యేయుట కానరాక పై
నెడలుట కానరాక యుడువీథికిఁ బోవుట కానరాక యు

యయ్యెడువిభువంశసంభవుని యుగ్రశరంబుల దైత్యమస్తము
ల్వ్రాడుటయు రక్తవాహినులు వాఱుటయుం గనవచ్చె నాజిలోన్. 128
గీ. హస్తిపురరాజశరవాతహతిని ద్రెళ్లి, రాసులై యుండె సంగ్రామరంగమునను
నరిది ప్రోవులువేసిన నల్లపేటి, తాటికాయలగతి దైత్యతతుల తలలు. 129
ఉ. అఱ్ఱులు ద్రెంచి దానవుల సాహవభూమి విభుండుగూల్చినం
గొఱ్ఱెలఁ దెచ్చి జాతరకుఁ గోసినపోలికనుండె మేటముం
బుఱ్ఱును మాంసము ల్పవులుచూడము భూతములుండె నాజిలో
గఱ్ఱునఁ ద్రేన్పుచుం జయము గాథలు పాడుచు సోలియాడుచున్. 130
వ. ఇవ్విధంబున నుండె నంతట.
క. బలమెల్లఁ దెగిన నిజకో, ర్బలముం జలముం బ్రతాపపావకుఁడును ను
జ్జ్వలశస్త్రాస్త్రంబుల నిజ బలముగ నెసిరించె దనుజపతి నరపతితోడన్. 132
శా. నిన్నున్ మించితి సైన్యముల్ సరుగుపోనీ దీన నా కేమియు
న్విన్నంబాటు ఘటింపనేరదు సురానీకంబులం బోరుల
న్వెన్నుల్లన్నిన నన్ను మార్కొనెడుచో వీర్యం బవార్యంబుగా
సన్నద్ధుండవుగమ్ము చూపు నిజశస్త్రప్రౌఢియు ప్రూఢియున్. 133
మ. అనినం గొండొక నవ్వి యేల యిటు వీరాలాపము ల్మద్భుజా
ఘనకోదండము కాలదండము భవత్కావ్యంబు నవ్యంబు భూ
తనికాయంబున కిత్తుఁ బో విడువఁ బాతాళంబు భేదించి చొ
చ్చినఁ జక్రాంకుఁడు తోడువచ్చిన మహాశేషుండు దా వచ్చినన్. 134
క. అని వీరోక్తులతోడన, యనిసేయఁగడంగె మానవాధిపుఁ డచ్చో
మనుజాధిప దనుజాధిపు, లనువొందిరి రామరావణాకారములన్. 135
శా. ఉల్లంబు ల్రణకౌతుకంబున సముద్యోగించి సామ్యంబులై
యుల్లాసంబులు వీరశేఖులను సుద్యోగింప నొక్కింతలై
భల్లాసారము పెల్లుగా వసుమతీపాలుండు దైత్యుండు ఖం
భల్లీలాగతిఁ బేర్చి మార్కొనిరి ప్రాబల్యంబు తుల్యంబుగన్. 136
గీ. దనుజశరములు భూభర్తఁదునుము నృపుని, శరము లమరారిఁదునుము నయ్యిరువురకును
జయము నజయంబు నవ్యవస్థంబులయ్యెఁ, దూఁచివేసినగతి నుండె దోర్బలములు.
క. ఈ కరణి ధనూరణ మ,స్తోకగతిం జేయుచుండి దోర్బల మొప్పన్
భూకాంతుఁడు నొసలేసెను, భీకరబాణమున నసురపెడతల వెడలన్. 138

మ. సురవిద్వేషి తదస్త్రపాతమున సంక్షోభించి యొక్కుమ్మున
న్నరలోకేశు నురోవిభాగము వడి న్నాటించి యా అమ్ములం
గరము ల్నాయకసప్తకమ్మున బరుల్గట్టంగ జెట్టియ న్నా
ధరణీనాథుఁడు లెక్కసేయక తదుత్సాహంబు దాహంబుగన్. 139

క. ఆ తుదశితశరంబులఁ, బ్రక్షుభితుండగుచు నేసి ప్రధనక్రీడ
న్వీక్షింపు మనుచు రాక్షసు, వక్షము జయలక్ష్మికిని గవాక్షము చేసెన్. 140

గీ. ధారుణీపాలుఁ డేచిన దహనతీవ్ర, సమశిలీముఖములవేఁడిఁ జాల నొచ్చి
దర్పమెడలక విలుగుణధ్వని యొనర్చి, భీకరధ్వని దిక్కులు పెకలనార్చి 141

సీ. పలలాశివిభుఁ డేసెఁ బైశాచబాణంబు భైరవాస్త్రంబు భూపాలుఁ డేసె
వ్యాళక్షురప్రంబుఁ గాళికాముఖుఁ డేసె గరుడభల్లం బేసె నరవరుండు
పావకాంబకము విభావరీచరుఁ డేసె శశిమలీనుం డేసె జలశరంబు
తిమిరప్రదర మేసె దితినందనుఁడు భానుసాయక మిభపురస్వామి యేసె

తే. నా మహారాజుచేత దివ్యాస్త్రనిచయ, మచటఁ దోడ్తోన ప్రతిహతమగుటఁజూచి
తనకు నంతకుచే వరదత్తమైన, తీవ్రశక్తిం బ్రయోగించి తివురుటయును. 142

మ. శరదర్కద్యుతికర్కశాంశువగు నా శక్తి న్నివారింపఁగా
శరము ల్గానక యేసె దానవునిపై సంధించి బ్రహ్మాస్త్రము
న్సురవైరాకరసైననాథ నుపమాశుద్ధాంతకాంతాసుదు
ష్కరవైధవ్యమహావ్రతప్రకటదీక్షాసత్క్రియాశాస్త్రమున్. 143

గీ. ఆహవక్షోణియందు బ్రహ్మాస్త్రవహ్ని, విస్మయంబుగ సురవైరి భస్మమయ్యెఁ
ద్రిపురఘస్మరు నిటలాక్ష తీవ్రవహ్ని, భస్మమైనట్టి సంకల్పభవుఁడు వోలె. 144

క. దనుజుఁ బరిమార్చి ముందటి, కిని దానవబాధఁదీర్చి కృతకృత్యుండై
మునిజనములు హర్షింపఁగ, జననాయకమౌళి విజయశంఖం బొత్తెన్. 145

క. ఆవేళ వచ్చి మానులు, పావనమంత్రోదకములు పైం బ్రోక్షింప
న్భూవరు మేనికి శిశిరసు, ధావర్షంబై రణవ్యథన్ హరియించెన్. 146

వ. ఇట్లు సంజీవనమహితమంత్ర జలంబులచేతఁ బ్రమోదంబైన యాతుధానశాతశరజాత వ్యథనపనయింపంజేసిమునీంద్రులతనితో మాభాగధేయంబున నిచ్చటికి విచ్చేసినకతంబున యాగంబు సుప్రయోగంబుగఁ జాగె, నీ కాళికాముఖుండు పాకశాసనపావకపరేతరాజ పలాశిపాశిపవన పౌలస్త్యపన్నగాభరణులకు నజేయుండు,వీఁడు భవదీయబాహాదండకోదండకాండ ప్రచండశిఖిశిఖాముఖంబున భక్షితుండయ్యెఁ గావున నీ తత్క్షణంబుననుండి రక్షోభయం బెన్నటికిని సన్నంబయ్యె మా జపతపోనిష్ఠానుష్ఠానంబుల షష్ఠాంశంబుఁగొనం గర్తవు కీర్తనీయచరిత్ర!జగద్ధితకీర్తివై యీవంశ

కర్తలగు చంద్రసౌమ్యపురూరవశ్చక్రవర్తులంబోలి యేకచక్రంబుగాఁ జక్రాచలమధ్య మహీచక్రం బవక్రంబగు విక్రమంబున నప్రతిపదంబగు ప్రతాపంబున ననశ్వరంబగు నైశ్వర్యంబునం బరిపాలింపుమని యాశీర్వదించి యనుప ననుపమాన భయభక్తితాత్పర్యంబుల మునివర్యులకు నృపవర్యుండు నమస్కరించి వీడ్కొని విడిదలకు నరిగి మజ్జనాదికృత్యంబులు వెసవెసం దీర్చి శకుంతలావలోకనంబునకు లోకలోచనుం గనుంగొనుచున్నవాడు. 147

క. బింబఫలకాంతి రవిబిం, బం బరుణద్యుతి వహించెఁ బాశధరాశా
స్తంబేరమకంఠచ్యుత, జాంబూనదఘంటవోలెఁ జరమాద్రిపయిన్. 148

మ. మునిదత్తార్ఘ్యపయఃప్రహారకులిశంబుల్ దాఁకి మందేహదే
హనితాంతస్రుతరక్తధారచెలువంబై పశ్చిమాశాతటిం
గనుపట్టె న్నెఱసంజచాయల రుచుల్ గాంక్షించి యచ్చోటికిన్
జను కాకోలకులంబునా దెసల నోజం జీఁకటుల్ గ్రమ్మఁగన్. 149

ఉ. జారులు చోరులు న్మిగుల సంతసమందఁగఁ జక్రవాకము
ల్దారలఁ దారు నశ్రుజలధారలు గ్రమ్మఁగ సమ్మిళింప నిం
డార నజాండభాండమున నంతకశాసనకంధరాంతర
స్ఫారవిశాలకాలరుచిబంధురబంధు మదాంధకారముల్. 150

క. పాటిగ మిఱుఁ బల్లం బే, ర్పాటేమియు లేక కానఁబడె నీలశిలా
పేటివయి నదినిండఁగనిడు, కాటుకయుం బోలెనై జగంబునుఁ దమముల్. 151

ఉ. నాలుగుదిక్కులందును ఘనంబుగఁ బర్వినచీఁకటుల్ జగ
ద్గోళము నిండి దృష్టికి నగోచరమై వెసఁ బర్వుచుండఁగా
నీలపటంబుమీఁది విపణిం బచరించిన ముత్తియంబులం
బోలి వెలింగె నంతట నభోవలయంబునఁ దారకావళుల్. 152

వ. తదనంతరంబ.

మ. కుముదోజ్జీవనమంత్ర మంగజభుజాకోదండగర్వంబు సం
తమసానేకప కూటపాకలము జ్యోత్స్నావర్షి వర్షాపయో
దము పాంథవ్రజచిత్తశల్యము నిశాధమ్మిల్ల బంధూకగు
చ్ఛము ప్రాచీనగశృంగవీథిఁ బొడిచెం జంద్రుండు సాంద్రద్యుతిన్. 154

సీ. పాంథలోచనవారిఁ బదనీ నమర్చిన సంతప్తపరశువు కంతునకును
బ్రాచీదిశావతి పావడఁ బెనచిన మవ్వంపుఁ జిగురల్లి మన్మథునకు

నాత్మప్రతాపాగ్ని నవతారమొందంగ నంగారఖండ మనంగునకును
గౌముదీ జలధి వేడ్కకు నిండఁదెచ్చిన పసడంపుఁగుంభంబు భావజునకు
తే. ననెడు విచికిత్స జనులకు నావహిల్లఁ జక్రవాకము లెడఁబాయ జారసతులు
డాయ నబ్జవిలాసంబు డాఁపరేఁడు,ప్రాచికొనరించెఁ గుసుమపూబంతిచెలువు. 155
గీ. అంతఁ జాజాడగా రాగకాంతి విడిచి, యల్లనల్లన నుడురాజు తెల్లనయ్యె
రాగి బలుగట్టి సురసప్రయోగమునను, ధాతువాదిచే రజతమై తనరినట్లు. 156
గీ. గరళమునకింతమిన్న నక్షత్రనాథుఁ, డరయ నొకపాటిగాఁడు దోషాకరుండు
ఒడలుగందినయది యందయోషగాక, కవియునోయనఁబస్మ్రని కన్ను మొగిచె. 157
క. కాశహరహాసకుముదా, కాశనదీద్విరదరదనకరకాహీనునీ
కాశయదు యాసలం దవ, కాశము లేకుండ నిండి కౌముది కాసెన్. 158
మ. కలయం జంద్రికసోఁకఁ గర్ణికలు బొంకంబెక్క యంతంతకుం
గలికాగ్రంబులఁ బట్టువాపి నెరయంగా విచ్చి తోరంపుటు
గ్గులు వీడం బెడవీఁకవీడి వలి ఱేకు ల్నిశము ల్దాయలో
దళము ల్బింకము చూపఁగాఁ గలువ లందంబొందెఁ గొత్తావులన్. 159
చ. ఎఱకలు దిద్ది కంధరమునెత్తి మొగిం జరలాట మున్నుగాఁ
బఱచుచు లేఁతవెన్నెలలు పారణసేయుచు మించి చంచుల
న్నఱికినఁదోనపుట్టి కిరణంపుఁగొనల్గొని మోముమోముతో
నిఱియుచుఁబేర్చి ప్రేయసులకిచ్చుచు నాడె దివిం జకోరముల్. 160
క. ఆ సమయంబున వెన్నెల, బాసటమునఁ దోఁచి తోఁచి పార్థివమణిపై
నేసె మనోభవుఁడెంతయు. గాసిలి యొలదేఁటిఱెక్కగరుల శరంబుల్. 161
గీ. మునుల మంత్రబలంబున దనుజతీవ్ర, మార్గణవ్రణములబాధ మానెఁగాని
మాన కింతేనియును మేనుమండఁదొడఁగె,నరపతికిఁజిత్తభవమార్గణవ్రణములు. 162
మ. కుపితానంగశరాగ్ని దాహమున నా క్షోణీవిభుం డెంతయుం
దపియింప న్వెస నుగ్రభానురుచు లుద్గారించుచుం జంద్రికా
తపము న్మ్రించినఁ గ్రిందుమీఁ దిఱుకుడై తాపంబు రెట్టింప నే
యుపచారంబున మానునొక్కొ యిదియం చూహించి చిత్తంబునన్. 163
సీ. మోహానాస్పదములౌ బాహుశాఖలచేతఁ గమనీయకరపల్లవములచేతఁ
గోమలనఖశిఖాకోరకంబులచేత విమలహారప్రసూనములచేత

సమపీనవర్తులస్తనగుచ్ఛములచేత రమణీయదేహసౌరభముచేత
సంచారజస్వేదజలమరందముచేతఁ జికురోరుమధుకరశ్రేణిచేతఁ
తే. గలితమైన శకుంతలాకల్పలతిక, నీడ నొదుగకయున్న నేజాడనాఁబుఁ
గుటిలసంకల్పసంభవక్రూరపుష్ప. చాపశరజాలసంజాతతాపభరము. 164

ఉ. ఎత్తినమన్మథాగ్ని నెదయేఁచెడు తాపభరంబుఁ దీర్పఁగాఁ
గ్రొత్తవిరుల్మృణాళములు గొజ్జఁగినీరుఁ బటీరమోపునే
హత్తి శకుంతలాధరపుటామృతపూరము లూర్పువుచ్చకే
గుత్తుకబంటిగాఁ గడఁగి కూర్కొని కూర్కొని త్రావకుండినన్. 165

సీ. నలినాక్షి ననుఁజూచి యలకలు దీర్చెనేఁ దిరిపిక్వ నడవనే తేఁటినారిఁ
జంద్రాస్య నన్ను భ్రూసంజ్ఞ మన్నించెనే శిశువుల కొసఁగనే చెఱకువిల్లుఁ
గంబుకంధరి నన్నుఁ గడకంటఁ జూచెనేఁ జదలనేయనె పుష్పసాయకంబుఁ
గిసలయాధరి నన్నుఁ గెంగేలనంటెనేఁ జిదుమనే కొనగోరఁ జిగురుఁగత్తి
తే. నేలయేఁచుచున్నాఁడుహృదయభవుఁడు, నెలఁతయును నేనుసమదృష్టినిలిచినపుడు
వేలుపోవును దాన యీకీలెఱుఁగఁడు, తెల్లవాఱంగ వలెఁగదా దేవకృపను. 166

వ. అని యనేకప్రకారంబులఁ జింతాసంతప్తుండై శకుంతలామనోహరాకారంబు మనంబునం బెట్టుకొని పరబ్రహ్మంబు నవలోకించు పరమయోగిచందంబున భూకాంతుండుండె నంత నిక్కడ శకుంతలయు నాశ్రమవనాంతంబున. 167

క. అనికిం గిరిపురనాథుఁడు, చనినది మొదలుగను జయము సమకూరినచోఁ
గను నిష్టదేవతాప్రార్థనముం జేయుచును దత్పరత వర్తిలుచున్. 168

గీ. జయముఁ గైకొని తననిజేశ్వరుఁడు మగిడి, విడిదలకునేగె ననువార్తవినుచు లలన
వినియెఁ గర్ణద్వయీకటువిషమబాణ, ఝుంకృతిస్ఫారశింజనీటంకృతములు. 169

చ. తలఁగఁగ నిచ్చవెట్టు వసుధాపతి తారసమైనయట్టిచోఁ
దలరి మదీయశాసనముఁ దప్పుట యెట్లొకొ తాల్మి నంచుఁ దాఁ
జెలఁగి చెలంగి మానసము చిల్లులువోవఁగ నేసె బాలిక
న్వలపులరాచజోదు ప్రసవంబుల నేరచు గొర్వికోలలన్. 170

క. వాలికపూములుకులు త, త్కాలంబున నంటియంపగంట్లును రేఁగెం
జాలఁగ నురిసినపుండులు, కోలలఁ గెలకు నను టా శకుంతల కయ్యెన్. 171

క. గణనకు ఘనమై మరుమా, ర్గణములు చిత్తజుఁడు గురియఁగా నారమణీ
మణి లేచి పర్ణశాలాం, గణమున కేతెంచి నిలిచి కనుఁగొన నెదుటన్. 172

సీ. విరహులపైఁ జల్ల విషపుఁజూర్ణము నించిపట్టిన దంతంపుబరిణ యనఁగఁ
దెప్పించి పాంథులఁ దెగటార్ప శశికాంతశిలఘటించిన వధ్యశిలయ పోలెఁ
గాంతాపరాధులఁ గాముఁడిం దొడికింపఁ బెట్టిన పటికంపుబిందె యనఁగ
వెస వియోగులఁదెగవ్రేయఁ బుల్గడిగించి నిలిపిన గండగొడ్డలియనంగ
తే. ముకురువెన్నెల గిన్నెలమునుంచవచ్చు, కరణి నుత్పల్లకాశనీకాశయగుచుఁ
దెల్లవారి మధ్యందినాదిత్యుఁ డనఁగఁ దనరు శశిఁజూచె నా శకుంతల భయమున.
గీ. శంబరారాతి శరవహ్ని సైఁపలేక, పర్ణశాలాంచలంబుల బయల నిలుప
సకలు దేహంబువం దెల్లఁ జెఱచిపాఱె నతిపపైఁ వడజల్లెఁ జంద్రాతపంబు. 174
క. ఉడురాజదీధితులఁ దిరు, గుడుపడి తపియించుచును శకుంతల యుండెం
బుడమిజనంబులు వెన్నెల, వడఁదాఁకను మాట నిక్కువంబై యుండెన్. 175
వ. అయ్యవసరంబున ననసూయా ప్రియంవదలు తత్తలిరుఁబోఁడి మెత్త మెత్తనయెత్తు
కొనిపోయి క్రొత్తనెత్తమ్మిరేకులం గల్పించిన తల్పంబు సేర్చి శిశిరకృత్యంబులు
సేయం దత్సమయంబున.

సీ. చనుదోయిఁ బొందిన జలజపత్రంబులు రవరవరజములై రాలిపోయెఁ
గర్ణావతంసంబు కలువలు కన్నీళ్ళ నురిసి రేకులు పట్టు ముడిపివడియె
నురము గంధంబు చిట్టుడుకువట్టినఁ బొంగి యుందందమండఁ బేరావు లెగసె
హారవల్లికలుగా నమరించిన మృణాలకిసలయంబులు పచ్చిగిజ్జడయ్యె
తే. జిగివలిర్చివ క్రొమ్మావి చిగురుఁబఱుపు, పెట్టుపెట్టినచందాన నట్టకట్టె
నగ్ని కాజ్యాహుతులు వోసినట్టిపయ్యె సకియవిరహానలమునకు శైత్యవిధులు. 177
గీ. కొమ్మవిరహాగ్ని వేడినకొలఁది యొద్ది, పదతలంబుల నిగిడించు పరిసవరజము
మంగలంబున వేఁచినమాడ్కిఁ దెరలెఁ బెక్కుసఖులకు నఱచేతఁ బొక్కులెగసె.

క. ఎంతెంత శిశిరకృత్యం, బంతంతయు విరహవహ్ని యధికము గాఁగం
గాంత తనచెలుల చిత్త, క్లాంతియుఁ బడుపాటుఁజూచి కన్నీ రొలుకన్. 179
గీ. మానవతులార యిన్నాళ్ళు మరుఁడుకాఁడు;యింతనొప్పించినాఁడె నన్నెన్నఁడైన
నిండువెన్నెల యనుపేరి నేయిఁ జల్లి, చంపుచున్నాఁడు చంద్రుండు చల్లజంపు
సీ. తపరశ్మి నొల్లక తగువారిలో మను తమ్ములఁ జెఱచు పాతకుఁడు వీఁడె
చదువఁగాఁబోయి యాచార్యుని కులభామఁ గడుపుచేసిన దోసకారి వీఁడె
హరిణాంకమనుపేర నపగసం బగు నల్లఁ గుట్టుపట్టిన చెడుగొట్టు వీఁడె
పదునైను దినముల బ్రతుకుకై సరివాని దినసాథు నాశించు తిరిపె వీఁడె

తే. తనదురాకకుఁ గ్రాఁగి కాతరత నొంది, విరుల బోరియల డాఁగిన విరహిజనుల
చొప్పెఁబడి పట్టుకొని చుఱుముండ్లుమాఁడఁ గుసుమబాణునిఁ దెచ్చిన కొఱవి వీఁడె

వ. అదియునుం గాక.

సీ. తనకు బాడబ మహాదహనసంగత ఘోరమకరాకరంబు జన్మస్థలంబు
తన సహోదరులు కాదంబరీనామ హాలామహాభీల హాలాహలములు
తన శరీరముఁ బ్రోచుకొనుట తీవ్రకఠోర హరిదశ్వకిరణభిక్షాటనమునఁ
దనకు సంతత పాంథజనహర్త పాపిష్ఠి యంగహీనుఁడు కూర్మి సంగడీఁడు
తే. పద్మినికిఁ గీడొనర్చెడు పాపజాతి, చక్రవాక వియోగాగ్ని సామిధేని
విరహిజనములపాలింటి వేరువిత్తు, దురితముల కేల వాయొడుఁదుహినకరుఁడు! 183

వ. అని మఱియు నిట్లనియె. 184

సీ. భద్రకాళీభర్త పదతలాహతిఁ బొల్లి పరవోలె నెపమారఁ బ్రామఁడయ్యె
దక్షకోపజమైన యా క్షయవ్యాధి నిర్జీవిగా నా శిలఁ జేయదయ్యె
నమృత మంతయుఁ ద్రావి యంకసారంగంబు బింబమెల్లను నిండఁ జెరుగదయ్యె
నాచార్యుఁ డనక భార్యకుఁ దప్పినప్పుడు పొడుగఱ నీరంకు పొడువదయ్యె
తే. బ్రథమకళ యారగించెడు పావకుండు, మీఁగడయుఁ బోలెఁగడి చేసి మ్రింగఁడయ్యె
నేల యిటు సేయఁ బాంథులఫాలవీధి, వనజగర్భుండు వ్రాసిన వ్రాఁతఫలము. 185

వ. అని యుపాలంభించి యా రంభోరువు కరాంభోరుహంబులు మొగిడ్చి మహాప
రాధంబుఁ జేసితినని యతండు మన్మనోనాథు వంశనాథుండు వంద్యుండుగాని
నింద్యుండు కాఁడని. 186

శా. స్వామీ చంద్రమ! తావకాన్వయుఁడు దుష్యంతుండు భూపాలచూ
డామాణిక్యము నీకుఁ దా మనుమఁ డౌట న్బెక్కు వాక్యంబులే
లా మా తాతవు నీవు నే మనుమరాలం గాన మేలంబుగా
నా మాటల్విను తప్పుపట్టకు మది న్మన్నించు గారామునన్. 187

మ. జననంబొందితి దుగ్ధవారినిధి నా సర్వేశు జూటంబుపైఁ
జను దే ప్రొద్దుఁ బ్రశంససేయ నవతంసంబైతి నీ ప్రాభవం
బునకుం బాంథజనాపకారియగు నా పూవిల్తునిం గూడి నా
రనిదుష్కీర్తిగఁ దిట్టునంబడకు చంద్రా! రోహిణీవల్లభా! 188

వ. నన్ను మన్నించుమని యక్కన్నె వెన్నెలరాచవేలుపుం బ్రశంసించి నృశం
సుండగు ప్రసవబాణు నుపలక్షించి, 189

సీ. వావిఁ దప్పించితి వనజాసనుని యంతవానికిఁ గూఁతురువలపుఁ గలిపి
దోషంబుఁ గట్టితి యిందుని యంతవానికి గురుకళత్రంబుపై మరులుఁ గొలిపి
బలు గోడిఁ జేసితి పాకశాసనునంతవాని నహల్యకై వాసి చెఱచి
సెరను బట్టితి పరాశరులంతవాని నట్టేటఁ జాపరుకన్నెఁ గాటుమఱపి
తే. నీ ప్రతాపంబు లెన్ని యెన్నికకు లేవ, తోడిఁబడితి నాఁటుదాన నీతో యమునను
నన్ను మన్నింపు దుష్యంతునకు ఘటింపు, మయ్య వెఱతును మదన! జోహారు నీకు.
సీ. పావకన్నెలు మేఁతపట్టి పో విడుచుచో వెసగాడ్పు లెక్కులు విఱిగె నేని
గలకమామిడిపండ్లఁ గల జీడి మధుకరపోతంబు నాలుక పొక్కె నేని
చంపకప్రసవవాసన సోఁకి యెలఁదేఁటి కూలి నిజ్జునఁ దన్నుకొనియె నేని
నిగురుమేఁతల నొగ లెక్కి కోకిలకును వడిఁ బొమ్మ గడిసిలఁబడియె నేని
తే. దీయవలఁ జీమగమి దొల్చి తీసియె నేని, బొదలు నా పేఁడియార్పులఁ బువ్వుఁ జేరు
కమలెనే ఇట్టబయలగు గర్వరేఖ, విషమసాయక విచ్చేయు విడిదలకును. 191

వ. ఇట్లు బహుప్రకారంబుల మన్మథవికారంబులకుం గలాపంబులుగాఁ బ్రలాపంబులు నెఱపుచు వాగురయష్టి మృగయుండునుం బోలె భూపాలుఁడు తనపాలికి వచ్చిన భావంబు భావించుచు నయ్యాదిగర్భేశ్వరుండు నర్మగర్భంబులుగా సఖీజనంబుల తోడ వాడిన సల్లాపంబులం దలంచుచు నా సింధురపురవరాధీశుండు గాంధర్వంబునం దనుం గరగ్రహణంబొనర్చిన విలాసంబు లాసించుచుఁ గారాకుచప్పుడైన నప్పుడప్పుడమి జేనిరాకగా శంకించి దిగ్గనలేచి దిక్కులవలోకించుచుం గానక కళవళించుచుం జింతాపరిక్లాంతిం గనుమూసియు మాయమి నన్నరేంద్రచంద్రునిం గలం గలయంగాంచి బయలు గౌఁగిలించుచుఁ గలవరించుచుఁ బలవరించుచుం గుందుచుం బొగలుచుం దెరలుచు వసరుచుం గసరుచు నొగలుచుం బొగులుచుం గసరుచుం గొసరుచు వేసరుచు వాసరుచు నసురుసురనుచు నుసురుసురనుచు నుల్లంబొల్లంబోయి మూర్ఛిల్లిన నప్పల్లవాధరిం గనుంగొని. 192

గీ. వరుసననసూయయును బ్రియంవదయుఁ జేరి, యల్లనల్లన శిశిరకృత్యంబులు సేయఁ
గ్రిమముతోడుత వెడవెడఁ గనులు దెఱచి, సమధికామోదతాళవృంతములు నూచి.
మ. విసరం జాడకుఁడమ్మ పూవుసురటుల్ వ్యాక్రాంతిమూలంబుగా
ననువుల్ వాపుఁ దతంతరాంతరనితాంతామోదహేలాలతాం
తసమాక్రాంతకృతాంతరూపపవమాన ప్రేంకణప్రక్రియా
ఘసరోదంచిత ఘ్రాణసౌరభరసవ్యాలోలరోలంబముల్. 194

ఉ. నూఁదులు ద్రిప్పు చంద మగుచు న్వెతవెట్టకయుండ నెచ్చెలు
ల్దూఁదులు వెట్టరే చెవులలోపల సంతత పాంథలోక హృ
ద్భేదులు మత్తరాజశుక భీషణభాషలు బాలపల్లవా
స్వాదకపారకంఠవిలసత్కలకంఠకటుస్వనంబులన్.

గీ. తెల్లవాఱిన వెఱవ నే దేవతలకు, వల్లభుఁడు నన్ను రక్షింపవచ్చుఁ గాన
భావజునిచేత నీలోనఁ జావకుండ, నరయుఁడని యన్న నెచ్చెలు లతివఁ జూచి. 196

మ. వనితా! యాతనిఁ బోలలే ననెదు నీ వంత స్మరుం డంతరిం
చు నిజం బప్పుడు వేల్పు ల ప్పడపికి న్సోధించి పట్టాభిషే
చనమున్ జేయుదు రర్థి ని న్నిట రతిస్థానంబున న్నిల్పి రూ
పున దుష్యంతనృపాలుఁ డర్హుఁ డగుటం బుష్పాస్త్రపట్టంబునన్. 197

వ. అని సఖీజనం బుపలాలించు న య్యవసరంబున. 198

ఉ. తోయజపుష్పబాంధవుఁడు తూరుపుఁగొండకు రాఁదలంచె, భూ
నాయకుఁడు న్శకుంతల మనంబలరం జనుదెంచుఁ, దుమ్మెద
ల్మ్రోయకుఁడీ, శుకంబులు నెలుంగులు సేయకుఁడీ, పికంబులుం
గూఁయకుఁడీ ప్రమాదమని కూకలువేసినభంగిఁ గొక్కొరో
కో యని బిట్టు మ్రోసెఁ దొలుకోడి నికుంజకుటీరవాటికన్. 919

వ. త దనంతరంబ. 200

సీ. కుముదంబు లర్థమర్థము మొగంబు మొగిడ్చె నర్ధమర్ధంబు తోయజము విరిసె
స్యందనాంగం బింతనంతనుం జరియించె నింతనింతఁ జకోర మీఁక విరిసె
విధుకాంతశిల నెడనెడ నీ రిగిరె తీసె నెడ సూర్యకాంతంబు వెచ్చనయ్యె
నిసి యించుకించుక దెసల యంచుల నిల్చె నించుకించుక దివం బీరికెత్తెఁ

తే. దొలఁగిపోయెడు కుముదబంధుద్యుతియును, దోఁచుచున్న సరోజబంధుద్యుతియును
కబళమై శ్వేతరక్తముల్ సంక్రమించె సకలదిశలను బ్రత్యూషసమయమునను.

సీ. కావిగోణాము లాకాశసన్యాసి కంబరకపాలికునకు మర్లుజడలు
చిగురాకుబరికెలు గగనచూతమునకు పలఁతి యూడలు వియద్వటమునకును
సట లంతరిక్ష కేసరికంధరమునకు జమిలియీఁకలు నభశ్చాషమునకు
రాగిమీసంబు లభ్రకిరాతునకు మొగమునఁ బగడంపులత లుడుపథపయోధి

తే. కనెడు సందేహచింతనం బావహిల్ల, యాచకద్రవశేఖల యంద మొంది
పట్టునూత్రవితానంబుఁ బరిభవించి, యాకసము ప్రాఁకెఁ దూర్పున నరుణరుచులు. 202

సీ. ఒక్కింత వెన్నెలయూర్చి తీసినభంగి నుదధిశుండిశకునై యొడిగిలియెఁ
గమలిమిం జెడలిన కంచుటద్దమువోలె నస్తాద్రికడఁ జంద్రుఁ డస్తమిల్లె
జలము లూటలుగ్రమ్మ శశికాంతపాషాణనీలంబు లీటారి నీరుదివియ
భానుభృత్పాషాణఫలకమధ్యంబులఁ గోకయుగ్మము కంతుగోష్ఠి నెఱప
తే. నబ్జగంధంబు తేఁటుల నామతింపఁ, దికమశలుగొని నాలుగుదిక్కులకును
విచ్చివిచ్చి చకోరము ల్వెళ్ళఁబాఱ, నల్లనల్లనఁ దూరుపు తెల్లవాఱె. 203
క. అంతటఁ బ్రాతస్సంధ్యా, సంతర్పణఫలముఁ గాంచి సంయములకు ది
గ్దంతి గొని యొత్తివై చెనొ, యింతటఁ బడ ననఁగఁ బ్రాచి నినుఁ డుదయించెన్. 204
ఉ. అంకిలిలేక చందిరకులాగ్రిణి నేఁడు శకుంతలామన
శ్శంకరుఁ డయ్యెడుం గలుగు శాత్రవ మాతనితోడ నందు మీ
నాంకున కంగరక్షకయి యామిని తాఁ డొనరించినట్టి యా
మంకెనపూవుకేడెమన మండలమొప్పె మరీచిమాలికిన్.
వ. ఇట్లు సూర్యోదయం బగుటయు దుష్యంతమహీకాంతుండు సంధ్యావందనం బొనర్చి స్యందనారూఢుండై విడిదల వెడలి యవక్రపథక్రమమహీసురసమూహపఠ్యమాన వేదనాదంబుల నవిచ్ఛిన్నహూయమాన మహాగ్నిహోత్ర స్వాహాశబ్దంబుల ముఖరితంబగు మఖవాటంబుఁ జేరవచ్చి నైకటికంబున రథావతరణంబు చేసి యర్చిష్మత్తుల్య తేజు లగు మునీంద్రులకుం గృతనమస్కారుండై. 206
క. ఎన్నఁటికిఁ జుక్క కెదు రిచ, టన్నరభోజనుల కయ్యె నపగతభయులై
జన్నముఁ గావింపుఁ డవి, చ్ఛిన్నముగాఁ జాల సంతసిల్లిన మతులన్. 207
గీ. అంత నింతను సేనను వరసికొనుచు, సంచరించెద ననిన నా సంయమీంద్రు
లనుమతించిన వీడ్కొని యా శకుంత, లా విహారవనాంతరస్థలముఁ జొచ్చి. 208
మ. కలకంఠధ్వనుల న్మరాళిమల ఝుంకారంబులం గీరభా
షల మందానిలు రాకల న్బరిమళశ్లాఘ్యంబులై యొప్పు పు
ష్పలతాకుంజగృహంబుల న్విరహతాపం బద్భుతంబై శకుం
తల మున్నున్న పరిసూనతల్పములకుం దాఁ జేరి చింతించుచున్. 209
సీ. సెలువ బాష్పముల విచ్చిన కల్వపూబంతు లందంద కన్నుల నద్దుకొనుచు
వనిత యూర్పుల వాఁడి వత్తైన పయోజముకుళంబు లొత్తిలి యూరుకొనుచు
నువిద మైసెకఁ దాఁకి యులిసిన బిసలతావలిహారములు మేన వైచికొనుచు
రమణి డెందంబు వేఁడిమి మాఁడి మసిరైన పుష్పాడి మెయినిండఁ బూసికొనుచుఁ

తే. పొలఁతి సంతాపభరమునఁ బొరలువెట్ట, నెండి యొసురుల్లఁబోయినయిగురుఁబాన్పు
మీఁదఁ బొరలుచు విరహాబ్ధి నీఁదుకొనుచుఁ, జిత్తజోన్మాదవృత్తి నా క్షితివరుండు.

క. ఆ చంద్రవదనరాకలు, చూచుచు నిట్టూర్పువుచ్చుచుం బానుపుపై
లేచుచుఁ బవళించుచు మఱి యీ చందంబునఁ జరింప నింతటిలోనన్. 211

ఉ. పూని కరంబులం బొదివి పోఁటులు తోడ్కొని తేఱ మన్మథ
గ్లాని వహించి చాలఁ గనుగందిన శకుంతల ప్రాణనాయక
ధ్యానముతోడఁ గన్నులనె ప్రాణము నిల్పి శరీరమాత్రమై
తా నట కేగుదెంచె వడఁదాఁకిన చెందొవకాఁడవైఖరిన్. 212

ఉ. వచ్చి లతాగృహంబుతలవాకిట పోఁటులుచెప్పిచూపఁ గ
న్విచ్చి మనంబులో వెఱపు నెయ్యముఁ దియ్యము నాదరింతయు
న్మచ్చికయుం గుతూహలము మక్కువయుం దడఁబాటు నొందఁగా
న చ్చపలాక్షి చూచె లలితానన చంద్రుని మానవేంద్రునిన్. 213

క. భూతలనాయకుఁడును నా శాతోదరిఁ జూచె సంతసము సంభ్రమము
న్బ్రీతియుఁ దగులును వలపును, గౌతుకమును మానసమున గత్తరకలముగన్. 214

వ. అ య్యవసరంబునఁ గన్యావరుల యన్యోన్యప్రీతియును బరస్పరవిస్ఫురద్రోమాంచ
సంచయంబును నితరేతరకాతరతా దర్శనంబును మిథశ్శ్లథధీరతాభావంబును
భావించి చూచి యనసూయాప్రియంవదలు శకుంతలాదుష్యంతుల నేకాసనంబున
నునిచి యొద్దియోనియు నొక్కప్రయోజనవ్యాజంబున నేకాంతంబిచ్చి యొఱ
కలుగఁజని రంత భూకాంతుండును బ్రియాముఖంబున దృష్టినిలిపి కపోలంబుల
నఖంబులు నటింపంజేయుచు. 215

సీ. రతికిఁ జేరినయును జేరమిఁ బాసిపోవఁగా విధియొనర్చిన యూరివేర మొకటి
కదనంబులో గెల్పు కలదో లేదో యను సంశయోద్భవమైన జాలి యొకటి
మోము చూచినదాఁక నేమ మెవ్వారలచేతను వినరాని ప్రీతి యొకటి
యనుచితం బని రాత్రి చనుదేర నిల్చిన నామీఁది కోపసంతాప మొకటి

తే. నడుమ జాజరకాఁడు మన్మథుఁడు వచ్చి, రాత్రి మల్లడిగాఁజేయ రాయిడొకటి
యొంతనొప్పించెనో కదా యింతినను చుఁ గరయుగంబున బిగియారఁగౌఁగిలించి. 216

మ. కొసరుంగొంకును దీర్చి నెన్నొసటఁ జిక్కుల్గొన్న నీలాలక
ల్గొసఁగం దీర్చి ప్రియుం బొనర్చి సరవిం బూసెజ్జకుం దార్చి ము
న్గొసుమాస్త్రాహతి సంభవం బయిన యాకుం దార్చి పొందార నిం
పెసఁగం గౌఁగిటఁ జేర్చి తేల్చె రమణిన్ హేలాసుఖాంభోనిధిన్. 217

వ. ఆ య్యవసరంబున. 218

సీ. శ్రవణసౌఖ్యంబుగా సాధుస్వనంబున మ్రోల నాలాపించె నొకరి తేఁటి
మనసు రింగులువార మణితక్వణంబునఁ జెంత నల్లన విలాసించె శారి
యెలదొక్కుపలుకులఁ గులికి కుల్కి నటించెఁ గలికియై తేనెలు చిలుకఁ జిలుక
యింపు పొంపిరివోవ నింత నంతను నిల్చి పంచమశ్రుతిఁ బిసాళించెఁ బికము

తే. సమ్మదమ్మగ సురతశ్రమమ్ము దీరు, నంతమాత్రంబె పొలసె మందానిలుండు
తాఁకఁ బరిమళ మొకపాటి సోఁక నేసె, వలపుఁదూపులు మరుఁడు భూవరునిసతిని. 219

సీ. అన్యోన్యసంప్రీతి నలపరించుచునుండ నలరాజు కూటమి గలుగనయ్యె
రమణీయ నూతన రతిరహస్యములకుఁ గామశాస్త్రంబులు కడమలయ్యె
నుద్వేల మగుచుఁ బెల్లుబ్బెడు రాగవార్ధులు లేశమైనను దొంకవయ్యె
నితరేతరప్రీతి వెడలింపఁదలఁచిన ధృతికి రాఁ దెఱపి సిద్ధింపదయ్యె

తే. మమతలును దత్తరింతలు మక్కువలును, జొక్కులును గౌతుకములును సోలడములు
బ్రియములును గాముకతలుఁ దబ్బిబ్బులుగను, సతియుఁ బతియు రతిక్రీడ సల్పునపుడు.

శా. పాలిండ్లన్ నవనీలికాకలికలన్ బ్రాలంబముల్ వేసి కం
కేళీకుట్మలరత్నహారములతోఁ గీలించి కర్ణంబులన్
దా లోప్పారఁగఁ గర్ణికారములఁ దాటంకంబు లర్పించుఁ దా
నా లోలాక్షికి నవ్విభుండు నవపుష్పాలంక్రియాఖేలనన్. 221

క. రేయిఁ జకోరస్థితిఁ గవ వాయక జక్కవల భంగిఁ బగలు మిథునమై
పాయక రేయును బవలును, నా యవనీపతి సుఖించె నతివయుఁ దానున్. 222

క. పొలయలుకలు ప్రియమైనను, వలయుం బాయునని యెఱుపక భీతుండై
నలవోకైన శకుంతలఁ గలయింపఁగ వెఱచుఁ దాను గలఁగఁగ వెఱచున్. 223

వ. ఇవ్విధంబున నవ్వధూరత్నంబుతోడి క్రీడలం దగిలి మునిసమాజసేవావ్యాజంబున
నా రాజరతిరాజు నిలిచి సారథిని రథంబుఁగొనిపోవ నియమించి హోమకాలంబున
యాగశాలలకుం బోవుచు నొక్కొక్కవేళ మందపవన పరిస్పందనంబునం గందువం
గని ముందలయి యందంద వచ్చు నిందిరంబుల క్రందునం జిందిన మకరందంబునం
బొందలరు నలతు గురువిందపందిరుల క్రింద నొక్కొక్కవేళఁ బల్లవంబుల సంకులం
బెల్లనుం బెల్లంగొనిన విరులమొల్లంబుల నుల్లంబు నలవరించు వల్లరులం దావివిల్లులు
వెదఁజల్లు నుత్ఫుల్లమల్లికామతల్లికాగృహంబుల నొక్కొక్కవేళఁ దావుల క్రొవ్వులగు
తమ్మిబావులకడలం దూవరుల నీవలిం జెంగలించు తరులతావులు దేవలగు క్రొమ్మావుల

క్రేవలను నొక్కొక్కవేళ నప్పటప్పటికి నుప్పతిలం జిప్పిలు కుప్పరసంబు చప్పరించుచు నుప్పరంబునం గొప్పరంబు లెగయ దెప్పరంబుగఁ గుప్పిగంతులుం గొను షట్పదంబుల పదంబులం బడి నొప్పదొరుగు పుష్పావడిం గదిసియొప్పెడి విప్పుం గల సరోవరంపు టిసుకతిప్పలను వేల్పుటుత్పలగంధియుం దానును గందర్పదర్పం బనల్పంబుగా వర్తింప సప్తరాత్రంబులరిగె నతిరాత్రసత్రతంతువుం బరిపూర్ణంబయ్యె నంత హస్తినాపురంబున. 224

గీ. శాలికాముఖనామరాక్షసపతికిని, దమఘతికి యుద్ధమైన విధంబుఁ గింవ
దంతిగా విని యంచితోత్సాహమునను, దంతిరథవాజిఘటసముత్కరము గెరలి 225

రగడ. లలితహృదయము లెగిరి లంఘించు నరదములుఁ
గులగిరుల నైన డీకొను మదద్విరదములుఁ
దెరలి యురువడి గాలిఁ దెగఁబాఱు వాజులును
సురరాజు సరివచ్చు చుట్టంపురాజులును
దివిజగురుతోడ నుద్దికి వచ్చుమాత్యులును
దవిలి సేవించు తాతలనాఁటి భృత్యులును
జాఱు గలుగక నిల్చు సంధిసౌజన్యులును
వే ఱొకింతయు లేని విశ్వాసమాన్యులును
సమరసమదుఃఖులగు సత్కృపాపాత్రులును
జెమట నెత్తురుగాఁగ సేవించు మిత్రులును
వేఁటాఱు తునుకలుగ వేయఁగల సాదులును
నూటిపప్పక యేయు చొక్కంపు జోదులును
కోరి గిరువులు వెట్టి కొలుచు జగతీపతులుఁ
బోరులకు ముఖరులై పొలుచు సేనాపతులుఁ
దొలు పోటు కయ్యమునఁ దొడరు నాసీరులును
బలిమినై జము నైనఁ బఱచు భటవీరులును
గలహావిక్రమకళాకలితులగు పాయకులు
నలఘు బలసంపన్నులగు లెంకనాయకులు
నసిచర్మసంగరసహాయులగు పారకులు
నసమశాత్రవజయ సమర్థులగు దారకులుఁ
గొండ లగ్గల పరవఁగొనని పేరాయులును
ధండివనదుర్గభేదకు లయిన క్రోఢ్యులున్ను

మఱియు గుణముఖ్యు లగు మల్లురులు నొంటరులు
నెఱబిరుదు శూరులును నెన కెనయు గెంటురులు
వీరాదిగాఁగల్గు వీరపరివారంబు
చారురుచి నొప్పాఁగు సమరశృంగారంబు
నల్ల జల్లెడలతో నడగా రడవి భంగి
బల్లిగట్లంగడల ప్రభల మ్రింగఁగ నింగి
పులికి సింగంబునకుఁ బుట్టు వొందిన కరణి
బలుపు శేవును గల్గు భటుల బింకపు సరణి
మొనసి గుబ్బల కేడెముల ఘంటికలు మ్రోయ
మొనలముందట సబళముల సాధనలు సేయ
నరిగె బిళ్ళలతాఁకు నశనిఘోషము దొరయఁ
దివురులో నడిదము ద్రిప్పి యొండొరు మొరయఁ
గోలతో విల్లు దెగఁగొని జిత్త పేరెములఁ
గాలుకోలఁదియుఁ బఱచు కదనప్రకారములఁ
బొడ వెగురవైవ నప్పుడ వచ్చు కుంతలములఁ
దడయు కోరపుగఁ బట్టి తగనిచ్చు వంతములు
వెలయు ఝామిడికములును వెనుపకమ్మల జోళ్ళ
నలమికొన నొకఁడు పదురై తోఁచు పడవాళ్ళ
మొనలు చక్కఁగఁదీర్చి ముఖరులై నడపింప
ఘనవాద్యనాదముగ ఘనఘంటపూరింప
మెండుకొని కడిమి భూమీజనంబుల చూడ్కి
నిండి సేనాసమితి నేల యీనినమాడ్కి
నహితులకు గుండె లల్లాడంగ నంతంత
మహితసైన్యము నిల్చె మాలినీనదిపొంత. 226

వ. విడిసిన నట్టియెడ నమాత్యసేనానాథులు భూనాయకుం డున్న యాగశాలకుం బోయి మునులకు నమస్కారంబులు చేసి సముచితప్రకారంబున జనవరు సమ్ముఖులై నిలుచుటయు. 227

క. మునివరులు రాజువదనముఁ, గనుఁగొని సైన్యంబులెల్లఁ గదనవిధంబు
న్వినిపచ్చినార్లు తోడుగ, నెనయఁగ నీ సత్వజవము తెలుఁగఁగనన్నుమీ. 228

గీ. అనిన భూపతి వారితో ననఘమతులు, ధరణి సత్కీర్తి నాకు నీఁ దలఁచి యుష్మ
దీయశక్తి నాయందు వర్తింపఁజేసి, గెలుచుటలు గాక నరులు దైత్యులకు నెదురె. 229
క. మీ కరుణ యెంపు నాకున, మీకజయము గలుగుటెల్ల మీ లోకలక్ష్యం
బేకోణపకీటంబులు, మీ కినుకం బడిన నష్టమించు జగంబుల్. 230
సీ. ప్రసవసాయకవైరి నొసటఁ గన్గూపిన నఱకాలఁ గన్గూపినట్టి మహిమ
యవతారమిషమున నవనిపై జనియింప హరిమీఁదఁ గినిసినయట్టి శక్తి
ధాతకు గుడిపూజ ధరణి లేకుండంగ శాసించినట్టి యాజ్ఞాబలంబుఁ
జండాంశు రథముతో జగతిపైఁ ద్రొక్కంగఁ గన్నెఱ్ఱచేసిన గర్వరేఖ
తే. గల మహామహులకు మీకు గణనసేయఁ గ్రవ్యభుక్కులనంగఁ బుల్గాసి పురువు
లేను ధన్యుండ మాన్యుండ నిట్టికీర్తి. క్షితిని నెగడించి గారవించితిరి గాన 231
వ. అని యత్యంత వినయవచనరచనలం బ్రీతులం జేసిన మునిముఖ్యులా నృపముఖ్యుని
దయాసుధామయంబు లగు విలోచనంబులం గనుంగొని. 232
సీ. నీవు వచ్చినమృగయావిహారం బది సమయంగఁ ద్రోమ్మృగములకయ్యె
నన్వయాగతమైన యదిమీకు ననువాసరంబు నం చితధర్మరక్షణంబు
కామసంహారుఁడైన కాశ్యపమౌనిసత్తమున కాశీరమంత్రంబవైతి
పరయఁ బరోపకారార్థ మిదం శరీరం బను వినుతవాక్యంబు నిదియె
తే. దయయు దాక్షిణ్యమును నుపాదానములుగఁ, గనకగర్భుండు నీపుణ్యతనువొనర్చె
నీవ నినుఁబోలుదువుగాని నిన్నుఁబోల, జగతి నన్యులు లేరు దుష్యంతభూప. 233
సీ. ఆకాశకరులలో నైరావతము వోలె గ్రహములలోఁ దిగ్మకరుఁడు వోలెఁ
దోయాకరములలో దుగ్ధసింధువు వోలెఁ దరులలోఁ గల్పపాదపము వోలె
విహగవర్గములలో వినతాసుతుఁడు వోలె గిరులలో మేరుభూధరము వోలె
విబుధవర్గములలో వృద్ధశ్రవుఁడు వోలె ఫణులలో శౌరితల్పంబు వోలెఁ
తే. దారకావళిలో భవద్వంశకరుఁడు, చంద్రుఁడును వోలె నధికప్రశస్తిఁ గాంచి
వంశకరునందనుని జక్రవర్తిఁ గాంచి, భువనభర్తని యగు కీర్తిఁ బొందు మధిప. 234
గీ. యాగసంరక్షణమునకై యడ్డు పెట్టి, యునిచితిమి నిన్ను నిన్నాళ్లు మనుజనాథ!
వేఁటవచ్చుటగాని యీ విధ మెఱుఁగరు, దనుజయుద్ధంబుఁ గని జనులలఁకినారు. 235
క. ఇచ్చట యాగక్రియయును, సచ్చరితుఁడ వీవు గలుగఁ జాగిఫలించెన్
వచ్చి తడవయ్యెఁ బురికి, న్వచ్చేయుదు గాక జనుల నేత్రము లలరన్. 236
వ. అని యాశీర్వదించి మంత్రపూతంబులైన హరిద్రాక్షతంబులు శిరంబు నందునుపఁ
బ్రణామపూర్వకంబుగా వీడ్కొని వెడలి కాశ్యపమహామునియుటజంబున్నకడ్డ

బోవలయు మీ రిచ్చట నుండునది యని యమాత్యసైన్యపతుల నొక్కయెడ నునిచి శకుంతలసమక్షంబునకు వచ్చి. 237

సీ. చెప్పంగఁ జూచుఁ జూచి ముఖాంబుజము దెసఁ దప్పక చూచును జెప్ప సోదుఁ
బోక నిల్చు నుపాయములు మతించు మతించి నేర్పు దేలేక నిట్టూర్పు పుచ్చు
నుండ రామిని జెప్ప నూహించు నూహించి పురమున కనియర్థమునన నిల్చు
ననసూయఁ జూచుఁ బ్రియంవదఁ జూచు నా మేనకాత్మజఁ జూచు మీఁదఁ జూచుఁ

తే. దరుణిదెస మోహలతఁ జూడ్వఁ బురముదెసకుఁ
గార్యలత యీడ్వఁ రెండువంకలకుఁ జనుచు
భావ్య మిది యని కార్య మేర్పఱుపలేక
యుల్లముయ్యాలలూఁగె భూవల్లభునకు. 238

క. ఈ లీల మనసు డోలాం, దోళనమై చెప్ప నాల్కతుదఁ గదలింపం
గాలేక తలిరుటాకున, వాలికనఖమున లిఖించి వనితకుఁ జూపెన్. 239

ఉ. ఆ లిపిఁ జూచి నెచ్చెలుల యగ్రమునం బడవైచి మూర్ఛతో
వ్రాలెను దంతి త్రెంచి ధరవైచిన యయ్యలదీవకైవడిన్
హా లలనామణీ యని ప్రియంవద దా ననసూయ బెగ్గిలం
గాలువలై నృపాలకునికన్నుల నశ్రుజలంబు లొల్కఁగాన్. 240

వ. ఏతత్ప్రకారంబునఁ గొంతవడి నిలిచి రంత నితాంతధైర్యవతియగు ననసూయ ప్రియంవదం దెలిపి రాజుం గుస్తరించి శకుంతల నల్లనల్లనఁ దేర్చి యయ్యిందువదన వదనంబుఁ గెంగేల నెత్తి సుధామధురవచనంబుల నిట్లనియె. 241

మ. పురికిం బోయెద నన్నమాత్రమున నంభోజాస్య యిట్లైదురే
ధరణీనాథులు భూమిపాలనముచేత ల్మాని క్రీడారతి
న్నరకింటం గొనియున్న బూజ్యయగు రాజ్యశ్రీ కొనల్సాగనే
యరయంగా మెడఁ బెట్టుకొంచుఁ దిరుగన్ వారంబులే భామినుల్. 242

గీ. పోవు టెన్నఁడు నినుఁ గొనిపోవు టెన్నఁ, డంతవట్టును నిజముగా నరసికొనుము
రమ్మనినఁ బోవు టెన్నఁడు రాకమనిన,వచ్చుదినములు గణనకుఁ దెచ్చుకొనుము 243

వ. అని రాజుం జూచి. 244

చ. నగరము లుజ్జగించి విపినంబుల రాజులు రాజనీతియుం
దగవును గాదు పోవుటలు ధర్మము నాపని యట్ల యుండనీ
తగులము పెంపున య్యానుకుఁ దాల్మియు నెయ్యమునీ వెఱుంగు దీ
న్నగునకు నున్ని గొన్యాది క్రమంబుఁ గ్రమ్మఱ్ఱఁడ వానతీ కృపన్. 245

సీ. అనిన భూపాలుఁడిట్లను సఖీమణియును నను బాసి నిమిషమైనను సైరింప
నోపదు నేనున య య్యువిదఁ బాసి ముహూర్తమును నిల్వనోపని ముగ్ధ యెఱుంగు
గాంధర్వవిధిఁ గరగ్రహణంబును సమస్తమును ముని విజ్ఞానమునను దెలియు
ఘనుఁడు కాశ్యపుఁడంపఁగా గొనిపోవుట తగుఁగాని కాదన్నఁ దప్పగున్
తే. నేను బోయిన కొన్నాళ్ళకీ లతాంగి, వెనుకఁబుత్తెంచి గారెల్లననుప రాక
వైభవంబునఁ గొనిపోవవలయుఁగాని, తెలియ యేనుంగు నెక్కాల సిద్ధిగాదె? 246

వ. కావునంబుట్టినింటినుండి యత్తవారింటికిఁగన్నియలు వచ్చుచందంబున మునీంద్రుం
డనుప వైభవంబునం గొనిపోయెదంగాన నందాఁక నొక్కక్షణంబు లేకుండిన నా
జ్ఞాచక్రంబు వోరగల్లువడు నిది శిలను గానట్టి ముద్రాంగుళీయకంబు మీ విద్రుమా
ధరి ధరియించుంగాక యని తన వ్రేలియుంగరంబు నొసంగి కురంగనయనయం గు
రిం బెట్టి యొట్టు కేలకు ననుమతివడసి యనసూయాప్రియంవదలఁ బ్రియంబుచేసి
యనిపించుకొని, 247

గీ. చిత్తమచ్చట మునికన్యచేతి కిచ్చి, దేహమాత్రంబు రాజ్యప్రతిష్ఠకొఱకు
నాశ్రమస్థలి వాసి సైన్యాన్వితముగ, నమృతకరవంశకరుఁ డేగె హస్తిపురికి. 248

శా. హేమాద్రివ్రతదానశౌండ ధిషణాహేలాసురజ్యేష్ఠ ది
క్సీమాలంఘనకేళిజాంఘికగుణా శ్రీలోలపద్మాలయా
రామామందిర నాగయప్రభుకుమారా శీతశైలాబ్ధివే
లామధ్యక్షితిపాలమంత్రి మకుటాలంకారహీరాంకురా. 249

క. కంబుజలజాతజలధర, శంబ ధనుఃకలశచక్రచాపాంకితహ
స్తాంబుజయుగ సల్లలితా, జంబూద్వీపావనీప సచివోత్తంసా. 250

స్రగ్విణి. భామినీ మన్మథా భాగ్యసంపన్నధీ, యామినీనాథరేఖావతంసాంఘ్రిపూ
జామలస్వాంత విద్యానిశాంతా సదా, స్వామికార్యక్రియాచారు నీతిక్రియా. 251

### గద్యము

ఇది శ్రీభారతీతీర్థగురుచరణకరుణాలబ్ధ సిద్ధసారస్వత పవిత్ర గాదయామాత్య
పుత్ర యారాధితామరవీరభద్ర పిల్లలమఱ్ఱి పినవీరభద్ర ప్రణీతంబైన
శకుంతలాపరిణయం బను శృంగార కావ్యంబునందు
తృతీయాశ్వాసము.

శ్రీరస్తు.

# శకుంతలాపరిణయము.

## చతుర్థాశ్వాసము.

శ్రీహాస్త ముకురలీలా
మోహనముఖపంకరుహా సముల్లసిత సుప
ర్వాహారమధురమృదుళ
వ్యాహారఫణీంద్ర వెన్నయప్రభువంద్యా. 1

గీ. ఇవ్విధంబున దుష్యంతుఁ డిభపురమున, కరిగియుండఁ దదీయవృత్తాంత మెల్ల
జ్ఞానదృష్టి విలోకించి సంతసిల్లి, కణ్వముని వల్లభుండు శంకరు గుఱించి. 2

సీ. పాలితాఖిలహరిత్పాలకాదిసుపర్వమండలుం డురగేంద్రకుండలుండు
సురదైత్యమకుటభాసురరత్నఘటితసింహాసనుండు మనోజశాసనుండు
కలికాలకల్మషకల్మాషభవబంధమోచనుండు కృశానులోచనుండు
కఠినహుంకారఝుంకారనిర్గతప్రాణసమవర్తి దేవతాచక్రవర్తి

తే. యంబికాభర్త యఖిలలోకైకకర్త, శంకరుడు భక్తలోకవశంకరుండు
అచిరకాలంబునంద ప్రత్యక్షమయ్యె, నస్మదీయ మనోరథం బంది యిచ్చె. 3

సీ. గిరిజావిభుండు మాయింటి పెన్నిధానంబు కృత్తివాసుండు తంగేటిజున్ను
గోరాజగమనుండు గుజ్జుమామిడిపండు కుసుమాస్త్రహరుఁడు మాకొంగుపసిఁడి
శీతాంశుధరుఁ డఱచేతిమాణిక్యంబు కద్రూజకటకుండు గాదె కొలుచు
కరటిదానవవైరి పెరటి కల్పద్రుమం బసమనేత్రుఁడు సిద్ధరసము చెలమ

తే. విషగళుఁడు గాడిఁగట్టిన వేల్పుటావు, హాటకాచలధన్వి సిద్ధాంజనంబు
పురహరుఁడు పెట్టెలో నున్న పరుసవేది, ప్రమథభర్త చింతామణి భక్తులకును. 4

గీ. అహహ యభ్యాసవేళ బాల్యంబునందు, వ్రాసి చదివిన యాయక్షరముల చేత
వశ్యునిగఁ జేయవచ్చు భావజవిరోధి, నేల యెఱుఁగరో యీ మర్మమిత్రజనులు. 5

క. త్రిణయనునిఁగూర్చవచ్చును, బ్రణవంబునఁగూర్చినట్టి పంచాక్షరిచే
నణిమాది గుణస్థితిఁద్రుణ, కణములుగా నొసఁగు మంత్రగతి యెట్టిదయో. 6

శా. ఆజ్ఞాసిద్ధికరంబు ముక్తిదము చిత్తానందసంధాయియై
వజ్ఞానాంతరసిద్ధబీజము ప్రభావప్రౌఢసంవిత్కళా
జిజ్ఞాసావిభవప్రదాయకము లక్ష్మీకారణం బూర్జిత
ప్రజ్ఞామూలము భక్తలోకమునకుం బంచాక్షరం బిమ్మహిన్. 7

గీ. అనుచుఁబంచాక్షరంబు నొయ్యన జపించు, కొనుచు నుమరాజశేఖరు గుడికి నేగి
యష్టమూర్తికి భక్తిసాష్టాంగ మెరఁగి, కేలుగెందమ్ము మౌఁదలఁగీలుకొలిపి. 8

మ. హర సర్వేశ్వర శర్వశూలధర నీహారాద్రికన్యామనో
హర మృత్యుంజయ కృత్తివాస యురగేంద్రాకల్ప కందర్పసం
హర కాకోలకళంకకంఠ భవ కల్యాణాగకోదండ యీ
హరయంబార ఘటించు పోయెద మదీయస్థానముం జేరగన్. 9

గీ. ఎఱిఁగి నిన్ను నుతించు వాగీశ్వరాదు, లైన దేవతలకు నైన నలవి గాదు
ఎఱుఁగకునికియు వారును నేను నొక్క, సరియు కావున నభవ నీకరుణయురవు. 10

వ. అని మఱియు నద్దేవునకు నమస్కరించి యాశ్రమంబునకు వచ్చి శకుంతలయిచ్చిన
యర్ఘ్యపాద్యంబు లంగీకరించి తద్వదనంబునం జూడ్కి నిలిపి. 11

సీ. స్వాగతం బేనీకు సకియలకు ననసూయాప్రియంవదల కనామయంబె
వత్స! నీ మతి ధర్మవర్తిని యై యున్నె యతిథిసపర్యాసమాభిరతిని
స్నానార్థనియమిత జలజాకరంబున బాలిక! జలము లేపాటిగలవు
గ్రీష్మకాలంబిది యీమొక్కల వడదాఁగి పసిమి దప్పవుగదా పాదపములు

తే. రమణి సుఖమున్నదా మదాశ్రమమృగంబు, చెలులవర్తింతురా నిన్నుఁగలసి మెలసి
వత్సలతఁజేసికదు గారవమునఁ బెనుచు, నీవన జ్యోత్స్నయున్నదే నీలవేణి! 12

వ. అని యంతరాంతరంబుల యోగక్షేమంబు లడిగి కాలత్రియజ్ఞానశీలుండు సకలం
బును నెఱింగియు నెఱుంగనివాఁడ పోలె నమ్మెలుఁగుఁబోఁడి తెఱఁగు తన్ముఖంబు
నవినసున్ముఖుండై యిట్లనియె. 13

ఉ. ఎన్నఁడు లేని క్రొత్తసిరి నీనెడు నీ వదనాంబుజంబుపై
చెన్నను నూత్నరేఖ విలసిల్లెడు భావము లెన్నియన్నియు

స్మృన్నిటి భంగిఁ గాక కడు మోహనలీలలఁ గ్రాలుచున్న నీ
యున్న నిజంబు దాఁచుకొనియుండిన నాపయి నాన వెట్టెదన్. 14

గీ. అనిన గజగజ వడఁకుచు నశ్రువారి, కన్నుఁగవ రాల గద్గదకంఠయగుచుఁ
గొంతయును మాటువెట్టక కోమలాంగి, మునికి విన్నప మొనరించె మునికిమునికి. 15

చ. విని యొలనవ్వుతోడ నరవిందనిభానన నిన్ను నింతగాఁ
బెనిచిన నాకొకింత వినిపింపక చేసితి నీవు నర్హకాం
తుని ఘటియింపఁ జేయుటకు ధూర్జటిఁ గొల్వఁగ సోమతీర్థమేఁ
జనినయెడ న్మనఃప్రియుఁడు చయ్యనఁ గల్గిన సంభ్రమంబునన్. 16

గీ. వనిత యనసూయయును బ్రియంవదయును నీకు, వరుని ఘటియించి పెట్టినవారు నీవు
వారు సుఖముండు డెక్కడో వాఁడనయిన, యేను దీర్ఘంబు లేగెద నెచటికైన. 17

వ. ఇంక మా భాగంబు వాసె రాజపత్నివైతివి రాజ్యానుభవసుఖంబుల మమ్ము మఱువక నీ వరునికిం జెప్పి యాశ్రమం బప్పటప్పటికి యోగక్షేమంబు లరయించుకొనుచుండు మమ్మయమ్మ యని యక్కొమ్మశిరం బురంబునం జేర్చుకొని యందంద యానందజలంబుల జలకం బార్చి భయంబుఁ దేర్చి యిష్టసల్లాపంబులు సేయుచున్న సమయంబున. 18

మ. దళితక్రోధు లకించను ల్నములు మేధావు ల్సదాబ్రహ్మచా
రులు నీరాగులు నిత్యనిర్మలులు నిర్మోహు ల్నిరీహుల్ని రా
కులచిత్తు ల్నిగమాంతవేత్తలు విరక్తుల్భక్తిసంప్రేమము
ల్వేలయ న్వచ్చిరి కణ్వమౌనికడకు న్వృద్ధాదిపూర్వంబుగన్. 19

గీ. వచ్చిన మునీంద్రులకు గౌరవంబుచేసి పెద్ద పిన్నంతరువుల సంప్రీతినునిచి
కుశలములు వేఱువేఱఁ బేర్కొనుచు నడుగ, సరవిఁ జెప్పుచు వారు ప్రసంగగతిని. 20

క. అతిరాత్రము సేయుటయుం గ్రతువిఘ్నకరుండు కాళికాముఖరక్షః
పతి వచ్చుటయును నిభపుర, పతిచేఁ జచ్చుటయు విని తపస్వులతోడన్. 21

క. సోమకులశేఖరుం డా, భూమీశుఁడు వేడ్క యాగముం గాచి జయ
శ్రీమహిమఁ బెంపుగని యా, సోమకళాధరుఁడు నాకు సుముఖతనొందన్. 22

ఉ. పూర్వనృపాలకోత్తములఁ బోలెడు హస్తిపురీవరుండు దా
గుర్వనురాగసంపద శకుంతలయుం దొనర ఘటించి గాం
ధర్వవిధి న్వివాహమయి ధన్యత నొంది మదీయ యుష్మదా
శీర్వచనాభివృద్ధి ఫలసిద్ధి బ్రసిద్ధిగ నేగినాఁ డొగిన్. 23

క. విశ్వామిత్రతనూజకు, విశ్వోన్నతుఁడైన ప్రాణవిభుఁడు ఘటిల్లె
న్శాశ్వతుఁడు సోమతీర్థమ, హేశ్వరుఁ డిట నా ప్రియాసమీహితమెంచెన్ 24

గీ. కాలకంఠపమానుఁడు గాధిసూనుఁ, డతని తనయుఁడు జగినచో టయ్యెవరుని
యన్వయము నుద్దిచెలిసిన యదియ మైన, వినుఁడు మును విన్నవారును విననివారు.

సీ. జననసంస్థాన మెవ్వనికి మందాకినీనాథుఁ డాఅచసింధునాయకుండు
నిజసహోదరు లెవ్వనికి దివ్యమణికల్పక శ్రీమరుద్ధేనుకౌస్తుభములు
కారణం బెవ్వనికళలసంపన్నత యోషధివైభవాభ్యున్నతికిని
దానకం బెవ్వని కానతామరపాదపంబైన యభ్రపుకపర్దసీమ

తే. మనుచు నెవ్వండు తన్నిచ్చి యనలభాస్కరాదిదేవనికాయంబు నర్థితోడ
నతఁడు మృత్యుంజయునకుఁ బర్యాయతనువు, తారకశ్రీకరుండు సుధాకరుండు.

గీ. కాంతిగుణముల రూపరేఖావిభూతిఁ, దెలియఁ బ్రతిబింబముమబోలె దీపమునను
దీపమునుబోలె నుదయమందిన బుధుండు, కాంచె ఘనశక్తి నాల్గవ గ్రహపదంబు.

క. ఆ సౌమ్యునకును భూసుర, భాసురహస్తములు గాదెబండరువులుగాఁ
జేసిన పురూరవుఁడు ది, గ్వ్యాసితసితకీర్తి చక్రవర్తి జనించెన్. 28

ఉ. తామరసప్రియుండుఁ గుముదప్రియుఁడుం గులవృద్ధులైన మా
తామహుఁడు న్పితామహుఁడు నర్థ్య మదెవ్వని కట్టిరాజను
త్రాముఁబురూరవుం డగు నిరంతరమూం గణుతించి పేర్కొనం
గామగవీ సుపర్వ మణికల్పక సోదరహస్త పల్లవున్. 29

క. ఆ చక్రవర్తి నిలిపెను, క్ష్మాచక్రమునందు దిగ్విజయశాసనము
ల్ప్రాచి నవాచిఁ బ్రతీచి ను, దీచిని వరుసం గడుం బ్రతిద్వీపమునన్. 30

వ. ఆ పురూరవచక్రవర్తికిం గీర్తనీయచరిత్రుం డాయు వను రాజన్యుండు నిరభివంది సౌజన్యుండు జన్మించె న మ్మహారాజునకు నసదృక్షదక్షిణభుజాస్తంభసంభావిత కుంభినీమహీషుండు నహుషుం డుదయించి సముంచితక్రమంబున. 31

క. శీలించె నఖిలవిద్యలుఁ, జాలించెఁ బ్రధానిజనుల శాసనమునకుం
దూలించె బుధులలేములు, కీలించె వితీర్ణిచేతఁ గీర్తులచేతన్. 32

మ. అతిధన్యుం డగు నా నృపాలమణి సమ్యగ్దక్షిణా లాలిత
క్రతువు ల్నూ రొనరించి పుణ్యవిభవాకల్పం బనల్పంబుగా
స్తుతచింతామణి నిల్పి వేడ్క సుమనస్తోమంబు సేవింపఁగా
శతమన్యుం డయి యేలె వజ్రితరభాస్వద్దుర్గము స్స్వర్గమున్. 33

క. ఆ నహుషునకు యయాతి య, శోనిధి జననంబు నొందె శుక్రున కెలమిం
దా నల్లుండై తత్స్నం, తానంబునఁ బూరుఁ బుణ్యతమునిం గాంచెన్. 34

వ. అపూరుండు జఘన్యాత్మజుం డయ్యును తండ్రికి శాపవశంబున సంప్రాప్తం బైన జరాభారంబుఁ దా భరించి జనక ప్రసాదంబున సకలమహీమండలంబునకుం గర్త యయ్యె, నమ్మహాభాగునకు జనమేజయుండు సంభవించి యశ్వమేధత్రయంబుఁ జేసి జగత్త్రయవిఖ్యాతిం గాంచె నా పుణ్యనిధికిం గుమారుం డుదయాచలపర్యంతంబుఁ బ్రాచిదిగ్విజయంబు నొంది ప్రాచీశుం డనం బరఁగె నా రాజునకు సంయాతి జన్మించె నా భూపతికి నహంయాతి యుదయించె నన్నరేంద్రునకు సార్వభౌముం డుదయించె నా రాజన్యునకు జయత్సేనుండు జనియించె నా పట్టభద్రునకు సురాధీనుండు ప్రభవించె నవ్విభునకు మహాభౌముండు పుట్టె నా సుచరిత్రునకు యుతానీయుతుండు గలిగె నా యశోధనునకు నక్రోధనుండు పుత్త్రుండై ధాత్రీమండలం బేకచ్ఛత్త్రంబుగా నేలె నా మూర్ధాభిషిక్తునకు దేవాపి జననం బొందె నవ్యేకవీరునకు రిక్షకుండు సాధుజనరక్షకుండు సుతుం డై. 35

శా. ఏలె న్భూభువనంబు సర్వమును దా నేకాతపత్త్రంబుగాఁ
దోలెన్ వైరుల వెన్ను దన్ని హిమవద్దుర్గాటవీవాటికిం
బోలెం బూరుఁ బురూరవు న్నహుషుని న్భూరిప్రతాపంబునం
జాలెం దిక్కరిదంతపఙ్క్తులయశోజాలంబుఁ గీలింపఁగన్. 36

చ. అతనికిఁ బుణ్యవంతుఁడు దయానిధి విక్రమచక్రపాణి దా
మతిధరుఁ డుద్భవం బయి సమగ్రవిభూతి సరస్వతీతటాం
చితధరణీప్రదేశమునఁ జేసెను ద్వాదశవార్షికంబుగా
వ్రతము ధరించి భూభువనవర్ణిత వైభవసత్త్రయాగమున్. 37

ఉ. ఆ హరిణాంకవంశజుని యం దనురక్తి వహించి తా జగ
న్మోహిని యైన చారుతరమూర్తి వహించి సరస్వతీమహా
వాహిని తాన యిచ్చ మెయి వచ్చి జనంబులు చోద్యమందఁగా
గేహిని యై సుఖించుచు నికేతమున న్వసియించె బేర్మితోన్. 38

వ. ఆ మతిధరునకు నసదృశయశస్వి దృశుండు సంభవించె నక్కామినీవల్లభునకు సమగ్రయశోవిశాలుండు నీలుం డుదయించె. 39

ఉ. ఏలెను ధారుణీవలయ మెల్లను వైరము లేక యుండఁగా
వ్రాలిన యన్యభూభుజుల వంచి వశంబుగఁ జేసి జన్నము
ల్చాల నొనర్చి భూసురుల సంతసమందఁగఁ గీర్తనీయుఁడై
వెల్గుఁడు నిత్యకీర్తి రమణీరమణీయుఁడు మాన్యుఁ డైంతయున్. 40

ఉ. సంతతపుణ్యుఁ డా నృపతిసత్తముఁ డుత్తమపుత్రుఁ గాంచె దు
ష్యంతుని నిత్యనిర్మలయశఃఫలితావధిభూమిశాపర
ధ్వాంతుని వైరి భూపరకృతాంతు నితాంతకృపాసమంచిత
స్వాంతుని రూపనిర్జితజయంతుని సత్ప్రియభాషణక్రియా
కాంతుని భూరిసద్గుణ నిశాంతుని భూరిలసద్విశాంతునిన్. 41

వ. ఏతాదృగ్వంశకులాభిజాత్యంబుల శకుంతలకు ననుకూలదాంపత్యంబు దైవఘటనం
ఘటిల్లె నిది మీ యందఱకు మనోహరంబ కదా యనిన వారలు కీర్తించి మీ పరి
గ్రహానుగ్రహంబులు గలచోటికి దైవంబు ననుకూల్యత వహించుట యేమిచో
ద్యంబని కొనియాడుచుండఁ జండకిరణమండలంబు గగనఖండంబునకు మధ్యవర్తి
యగుటయు మధ్యాహ్నకాలానుష్ఠానంబున కనిపించుకొని యా నీవారముష్టింపచు
లరిగిరి, కణ్వమునీంద్రుఁడును స్నానార్థంబు తరంగిణి కరిగె ననంతరంబ. 42

ఉ. వానుకిహారముం బెదరువన్నెలకానును గమ్మవిల్తుని
న్మేసినకన్ను రెంటి కిరుమిక్కిలి కేల్గవయున్ హలాహల
గ్రాసకళంకకంఠమును గల్గిన యా కలికంఠమూర్తి దు
ర్వాసుఁడు నిల్చెఁ గణ్వమునివల్లభపర్ణగుహాంతరంబునన్. 43

క. ఆసన్నుఁడైన ముని దు, ర్వాసునిఁ గనుఁగొనియుఁ బ్రాణవల్లభుపైఁ జిం
తాశక్తి శకుంతల తా, నే సత్కారమును జేయ నెఱుఁగక యున్నన్. 44

ఉ. శాపముఖంబునం గొనలు చాఁగి యిగుర్చు తపోమహీజ మ
త్తాపసి యట్టి మార్గమున తాలిమిలేక నిజేశుఁ డెవ్వఁ డా
క్ష్మాపతి యీ సతి న్మఱచుఁ గా కని యెంతయు నిర్దయాత్ముఁడై
కోపముఖంబున న్వడి శకుంతల కిచ్చెఁ గఠోరశాపమున్. 45

క. ఘనశాప మిచ్చి యరుగం, గనుఁగొని యనసూయ భీతకంపితయై వం
దన మొనరించుచు శిశు వది, యనుకంపకుఁ గాక కినుక కది లక్ష్యంబే. 46

గీ. కాశ్యపుఁడు తండ్రిగాఁగ నిక్కన్నియకును, బుత్రి యిది మీకుబుద్ధిచెప్పదురుగాక
యింత యలుక వహింపంగ నేమి గలదు, అనఁటిపం డోల్వ నేటికి నినుపగోరు.

మత్తకోకిల. ఫాలలోచనుఁ డైన నిల్చి తపస్విసత్తమ తాపకో
త్కలకోపకృశాను వేఁడిమికి స్సహింపఁగ నోపఁ డీ
బాల యోర్చునే కిన్క మీ రొకపట్టున న్నదలించినం
జాలదే కటా తోఁటకూరకుఁ జంద్రహాసముఁ బెత్తురే. 48

గీ. ప్రియుఁడు మఱచిన యేని నీబిసరుహాస్య, యును బడంబడి తనలోన నొకటియైనఁ
గాశ్యపుఁడు పడు దుఃఖసాగరములోన, నందు నీకు మనఃక్లేశ మావహిలదె. 49

గీ. తల్లి విషము వెట్టఁదలఁచిన నది మాన్పఁ, గలరె యొరులు జగతిఁ గాశ్యపునకుఁ
బుత్త్రి నీకుఁ బుత్త్రి పొలఁతుక నిఁక నీశ్వ, ముంచు పాలించు మునివరేణ్య. 50

వ. అని వినయవచనంబుల విన్నవింపఁ గృపాళుండై యెప్పుడేని ప్రియుండు ముద్రికా
దర్శనంబు సేయు నప్పుడ విద్రిమాపరిఁ గలసి సెలంగం గలవాఁ డీపువ్వుఁబోఁడి
గర్భంబునందలి యాదిగర్భేశ్వరుండైన యర్భకుండు చక్రవర్తిపదంబు నొందు
నని వరంబిచ్చి వీడ్కొని చనియె, నమ్మునిపుంగవునిశాపం బమోఘంబు గావునం
దత్ప్రభావంబునం దుష్యంతమహీకాంతుండు శకుంతలానామమాత్రంబును మఱచి
రాజ్యానుసంధానంబు సేయుచుండఁ గ్రమక్రమంబున. 51

క. ఇంతియుదరంబునను దు, ష్యంతుని వీర్యంబు నిలిచి చారుశమీగ
ర్భాంతరలీనాగ్నిక్రియ, నంతర్గతమై వెలింగె నభినవభంగిన్. 52

చ. వెల మసలెం దనూలతిక నిద్దము దోఁచెఁ గపోలపాళిక
ల్తెలతెల నయ్యె వెన్నడిమి లేములు వాసె వళిత్రయంబు ను
గ్గులు విరిసె న్జవు ల్చెడియెఁ గూరుకు పెద్దయు నయ్యెఁ జిట్టుము
ల్పులుమఱుఁ బుట్టె నొక్కొకటి పై నుదయంబును బొందెఁ గోరికల్. 53

చ. కిటకిట నయ్యె వెన్నడుము కేసరిమధ్యకు నాఁడు నాఁటికిం
బుటపుట నయ్యె నారు కడుఁ బొల్పు వహించెఁ దనూలతాద్యుతు
ల్నిటనిట నయ్యె సోలము జనించె విశాలవిలోచనంబులు
న్వటవట నయ్యె సొంపుఁగల వాతెఱ కెంపును బూఁటపూఁటకున్. 54

మ. నవనాభీసరసిం బురందరదృషణ్ణాళంబుతో వీఁకమై
కవబంగారపుఁదమ్మి మొగ్గ లొదవంగ న్వాని యగ్రంబులన్
దవిలె న్మత్తిలి షట్పదంబు లన నందంబయ్యెఁ జూలందనా
ధవళాబ్జాక్షికి నాఱుఁ జన్నులును మీఁదం జూచుకద్వంద్వమున్. 55

సీ. ఉరుకీర్తి యనుమూర్తి యుదరంబులోఁ జాలు నిలిచి యుండుటఁ మేను వెలకఁ బాఱె
భువనభారవహుండు పుత్త్రుండు కడుపులో వృద్ధినొందుటఁ గడు వ్రేఁగునయ్యెఁ
నమృతాంగుఁ డగు పట్టి యంతర్గతుండౌటఁ జవు లెల్ల నొగి నరోచకములయ్యెఁ
గమలాయతాక్షుండు గర్భస్థితుండౌటఁ దెలిమించు వాలుగన్నులు జనించె

తే. ధరణియెల్లను భుజియించు తనయుఁడౌట, మోద మొదవె సదా మృదాస్వాదమునకు
నవకమై యుదరంబు నభాభియగుట, నభ్యుదయ మొందుచును వచ్చె నబ్జముఖికి.

ఉ. శాశ్వతకీర్తులం దిశలు సారణ సేయఁదలంచు సర్వభూ
మీశ్వరభామినీజనము నెల్లఁ బరుల్గొన నిచ్ఛగించు నీ
విశ్వము నేలుకో దివురు వ్రేఁకటికోరుకులందు నాదిగ
ర్భేశ్వరుఁ గుక్షిలోన ధరియించినయట్టి మహానుభావతన్. 57

శా. సూయం గర్భాలయనం ధరించి సుతతేజోరాజనం బెట్టితో
ధ్యానం బెప్పుడు నాథుపై నిలుపు నా తన్వంగి నేవేల నే
తానై వచ్చినదాఁక నేమిటికిఁ జింతాదైన్యముంచున్ మదిం
బూనెం గర్వము తన్ను నేఁచు మరుఁడుం బూవిల్లు మ్రోగింపఁగన్. 58

వ. ఇత్తెఱంగున నాదిగర్భేశ్వరుండు గాఁగల యర్భకుం గర్భకుహరంబునం బూని
నిధానగర్భయగు రత్నగర్భ ననుకరించు నద్దేవికిం గ్రమంబున నవమాసంబులుఁ
బరిపూర్ణంబు లగుటయు. 59

క. భానుని బొందక యుచ్చస్థానంబున గ్రహము లైదుఁ దనరఁగ ఫలదం
బైన శుభయోగమునఁ దే, జోనిధి భాగ్యోన్నతుండు సుతుఁ డుదయించెన్. 60

క. శిఖి నర్తించెఁ బ్రదక్షిణ, శిఖులను దశదిశలు నుల్లసిల్లెను నానా
సుఖసులభగంధవాహము, లఖిలజనానందకరములై వీతెంచెన్. 61

సీ. తల యంటి రతిపుణ్యతాపసాంగనలు, నెంతయు నింగుదీ ఫల తైలమునను
నుటజాంగణమునఁ గాఁ పునిచిరి తపుటితో వెల్లిపాగ యిచ్చి వీతిహోత్రుఁ
జాగించి రంచితోత్సవము యుష్ఫరుటాలి వైభవంబు తృతీయవాసరమున
నాఱవదివసంబునం దాచరించిరి బహుయోగినీగణప్రార్థనములు
తే. కొలనుగుడి పేరి దినముల కొలఁది యెఱిఁగి, యఖిలమునిధర్మపత్నుల నామతించి
విన్నఁబోకుండఁ గ్రియ లెల్లఁ, విస్తరిల్లఁ, దగ నొనర్చిరి పురుటాలి తగవు లెల్ల. 62

వ. తదనంతరంబ సకల మౌనివర్గంబును రావించి కణ్వమహామునీంద్రుండు పుణ్యా
హంబు చేయించి భరతుం డను నామంబు దౌష్యంతికిం బెట్టి వెనుకఁ గ్రమప్ర
వర్ధమానుండగుచు. 63

సీ. నృపకిరీటంబుల నిలుపుదు నను మాడ్కిఁ బొదగిటిలోనుండి పదము లెత్తు
క్షితి మిన్నువడ్డను జేయొడ్డి రక్షింతు ననురీతిఁ జేతులల్లార్చియాడు
దానాంబువులు వట్టి తగవిప్రులకు నిచ్చువడువునఁ బిడికిళ్ళు బట్టువిడుచు
నెలయఁ బ్రతాపాగ్ని మొలపించి యారయుపగిదిఁ బ్రేమమునఁ దీపంబుఁ జూచు
తే. నద్యతనరాజవిభవంబు లపహసించు, తెఱఁగు దోఁప నలంతి నేఁడుములు నవ్వుఁ
గాశ్యపర్షి మనంబునఁ గౌతుకంబు, సంతతంబు జనింప శాకుంతలుండు. 64

వ. అంత నొయ్యనొయ్యన పర్యాయంబున.

సీ. సింహాసనంబునఁ జేరి రాజులు గొల్వ నుండుచందమునఁ గూర్చుండ నేర్చె
ధర్మంబు నాల్గుపాదంబుల నడిపింతు ననురీతిని నడిచి యాడ నేర్చె
దొరలునో యన్నృతంబు తఱచుమాటల ననుపగిది నొక్కొకపలుకఁ బలుక నేర్చె
వర్ణాశ్రమంబులు వరుస దప్పక యుండ నిలుపుదు ననుభంగి నిలువ నేర్చె

తే. ధాత్రి కరమందు నంశమై దనరెదనను, నర్థమును పోల్కి ధాత్రి కరాంగుళమునఁ
గడఁకబట్టి యల్లల్లన నడువ నేర్చె, నాఁడు నాఁటికి నిభపురనాథసుతుఁడు. 66

శా. బాల్యంబంతట నుజ్జగించి పలుసంబ్రాయంబునం బొంది సా
శీల్యంబొప్పఁగఁ జేసె నధ్యయనము న్స్వీకించె శస్త్రాస్త్ర సా
కల్యంబు న్గురుశిక్షఁ జెంది చదివె న్నానావ్యాగమాము ల్మనో
శౌల్యం బింతయు లేక కోవిదజను ల్శ్లాఘింప జేతం డౌ ననన్. 67

గీ. కొఱంత లేకుండ విద్యలు నెఱపెఱింగి, క్షత్రవీర్యంబు గాన నిసర్గమైన
శౌర్యమును సత్వమును రాజసమును, బెంపు మదము బాహుబలంబును నదటు మిగుల.

సీ. ముంజేతఁ గరకాండములు చుట్టుకొని వనద్విరదరాజంబులఁ దిగిచి తెచ్చి
కొనవెంట్రుకలు పట్టుకొని పంచరించిన పంచాననంబులఁ బట్టి తెచ్చి
వాలాగ్రముల ముళ్ళువైచి లంకెలను శార్దూలపోతకములఁ దోలి తెచ్చి
దొడ్డికట్టుగ నాఁగి తొలఁగి పోవఁగనీక యచ్ఛభల్లములఁ బెల్లార్చి తెచ్చి

తే. కర్ణమూలంబు లులిమి లేఁగలను బోలె, సేకలంబుల నొండింటి నీడ్చి తెచ్చి
దామెనలు గట్టి యాశ్రమస్థలమునందు, శైశవక్రీడలాడు దుష్యంతసూతి. 69

వ. ఇట్లనన్యసాధారణం బగుసత్వంబున నుగ్రసత్వంబుల నెదురులేకయే హేళిం
జరించు నా రాజసూనునకుఁ గాననౌకసులు సర్వదమనుం డను నామంబు వెట్టి
ప్రేమంబు సేయుచుండ నొక్కనాఁడు కాశ్యపమునీంద్రుండు కుమారకల్పుం
డగు కుమారు నూరుపీఠంబున నునుపుకొని యుపలాలించుచున్న శకుంతలం గనుఁ
గొని సంతోషిత స్వాంతుండై మధురగంభీరస్వనంబున నిట్లనియె. 70

క. తొలుపుట్టువు నీ నోముల, ఫల మెట్టి దకో మనోజ్ఞపతిఁ బడసి సుతుం
గులదీపకరునిఁ గంటివి, లలితాంగీ! చక్రవర్తి లక్షణయుక్తున్. 71

గీ. పెద్దకాలంబు చనియె నీ ప్రియుఁడు వాసి, తెలియ యేలొకో పిలువఁబుత్తేకతడసె
నెఱచెనో మన్మనఃప్రీతి విధ మెఱుఁగక, మఱచెనో రాజ్యసుఖకేళి మగ్నమతిని.

ఉ. నేరము లెన్ని గల్గిన గణించుట నేరము లల్లు వారిపై
నేరుపులైన యల్లురును నేరము లెన్నుదు రత్తవారిపై

వారల నేర్పు నేరములు వంకలు దీర్ప నయుక్త మెల్లెడం
గౌరవహీనులై జగతిఁ గన్నియ నిచ్చినవారు కోమలీ. 73

గీ. రాజులంట మీఁద వారలే యోజఁ జనిన, భద్రగజములు నడచిన పథము లలిత
లసితమై యుండునట్లు సాధ్వసవు నీవు, ధవుని బెడఁబాసి యునికికిఁ దలఁకుగదుర.

సీ. జీవితేశ్వరుఁ బాసి చిరకాలవసతిగాఁ బుట్టినింటనె యునికి బుద్ధిగాదు
పొరుగిండ్ల నిరుగిండ్లఁ బ్రొద్దువోకలకైనఁ బలుమాఱు నరుగుట పాడిగాదు
దాసీజనులతోడఁ దఱచుగాఁ గూడి త్రస్తరమాటలాడుట తగవుగాదు
తన కెంత యాప్తులైనను నన్యపురుషసంసర్గంబుఁ జేయుట జాడగాదు

తే. జనకగృహములనైనను మనసువఱపి, కూరనారసఁ బంపుట గుణముగాదు
హాస్యకథలందు గీతవాద్యములయందుఁ, బ్రీతినెఱపుట మగనాలికీర్తిగాదు. 75

సీ. జలక మాహారంబు శయనసౌఖ్యము భర్త కంటెను మున్నుగాఁ గాదు సేయ
విభుఁ డారగించిన వెనుకఁ దద్భాజనంబునఁ జేయు సర్వంబు భోజనంబు
ప్రియుఁ డల్గి తనుఁ జేరఁ బిల్వకుండిన భూమి నింపుతోడుతఁ బవ్వళించుటొప్పు
వ్రతములు దేవతార్చనలు కాంతుఁడు సమ్మతింపక చేత యెంతేని కలుష

తే. మప్రియంబులు చేసిన నధిపుమీఁదఁ, జిన్నఁబోవక మది సంతసింపవలయు
మంచిదైనను బ్రాణేశుమనసు రాని, పనిని మానుట ధర్మంబు వనితలకును. 76

శా. ఏ భంగి న్నుచినామనో పతిమనం బే భంగి రంజింతునో
యే భంగిం గులకీర్తి దాఁ గలుగునో యే భంగి వర్తింతునో
యే భంగి న్మతిరాక యుండఁగలదో యేశాత్ములం దంమ నా
యా భంగి న్మతియుంచుచుండఁదగుఁ బుణ్యస్త్రీకి నెక్కాలమున్. 77

ఉ. కంచెలయుం బటీరతిలకంబును బాపటచెందిరంబు ఫా
లాంచనసీమ లేఁబసుపు టచ్చతబొట్టుఁ జెవాకు గాజులుం
గొంచెపువీడ్యము న్విరులు కొప్పున నొప్పు నొనర్ప నెప్పుడుం
జంచలనేత్రి యుండఁదగు సంతతభర్తృఫలాభివృద్ధికిన్. 78

సీ. జలమాడి మడుఁగువస్త్రముఁ గట్టి కై చేసికొనికాని కవయ బోఁజనదు ప్రియుని
మనుపు మేల్కొని భర్త మోముఁ గన్గొనికాని కాఁగాదు వీక్షింపఁగా నితరులఁ
గడపమీఁదను సన్నెకలుమీఁద రోలుమీఁద నునికి విభునికిఁ దఱుఁగు యాళము
తడికాళ్ళతో వీడుదలతోడఁ గర్ణపత్రములతో నిద్ర పుణ్యంబు దఱుఁగు

తే. సంది దలయంటుకొనుట వస్త్రంబులేక, మజ్జనము చేత విడియాకు మట్టగించి
తాల్చుటయు నిరుగేలను దల పుణుకుట, భర్తగలభామినులకు కష్టప్రదములు. 79

క. వ్రతములు నుపవాసంబులు, మతియుంప నిరర్థకములు మానవతులకున్
బ్రతివాసరంబుఁ గేవల, పతిభక్తియె చాలు నిహముఁ బరము ఘటింపన్. 80

చ. తెలియక వల్లభుండు పరదేశము వోయిన నన్నెమాని తా
నచెలికి నల్లపూసలును నచ్చతబొట్టును మట్టెవన్నెగాఁ
గులమణులైనపుట్టమును గూడఁగదువ్వనిమైలకొప్పునై
మఱుగిడియింటిలోఁ బతిసమాగమమున్ మతియింపు టొప్పగున్. 81

సీ. వనితకు నిష్టదైవము జీవితేశుండు భామకు ముంగొంగుపసిడి భర్త
సుదతికి నఱలేని చుట్టంబు పెనిమిటి తరుణికిఁ బ్రాణమిత్రంబు ధవుఁడు
వనజలోచనకుఁ బెట్టనికోట దయితుండు నాతికి నఖిలార్థదాత ప్రియుఁడు
కాంతకు మానరక్షకు డింటియూతండు సతికి నాఱడిలేని హితుఁడు వరుఁడు
తే. కంబుకంఠికి నిత్యశృంగారవిభవ, వల్లికకు నాలవాలంబు వల్లభుండు
పల్లవోష్ఠికి సౌభాగ్యభాగ్యలక్ష్మి, గణన యొనరింప నేల యేడ్గడయ మగఁడు. 82

వ. అని ప్రసంగవశంబునం గొన్ని కులకన్యకాధర్మంబు లెఱింగించి యనసూయా
ప్రియంవదలు మున్నుగాఁ గొందఱు వృద్ధతపస్వినీజనంబులను జతురమతులగు నిద్దఱు
శిష్యులం దోడువెట్టి శకుంతలం దుష్యంతుపాలి కనుప సమకట్టె. 83

ఉ. పొమ్మన జూచుఁ జూచి, మదిఁ బుట్టిన ప్రేమము పేర్మి బాష్పముల్
గ్రమ్మినఁ గ్రమ్మఱం బెడమొగంబయి కన్నుల నీరు గ్రుంగుచుం
గ్రమ్మఱఁ దాశకుంతల మొగంబగు నశ్రులు నించుఁ గొంత సే
పమ్మని జాలిఁ బొంది ధృతియంతయు నిల్వక విచ్చి పాఱఁగన్. 84

ఉ. ఎంచ మునీంద్రులందు విజితేంద్రియుఁడైన తపస్వి కూర్మిగా
పెంచి శకుంతలం బెనిచి విస్మృతినొందిన మోహపాశముల్
ద్రెంచుకొనంగలేక తియతీపులఁ జిత్తము గాసివెట్టె శీ
లించిన నెవ్వఁ డింక వదలింపఁగ నోపెడు మోహబంధముల్. 85

సీ. క్రకచధారాకఠోరంబైన కక్కుల కొఱ్ఱవ్రాఁడి కోడవంటఁ గోయరాదు
శూలాయసోద్దామశుద్దాలములఁ దఱ్ఱివి వ్రేళ్ళతో బెకలించి వేయరాదు
సమిదాజ్యముల నగ్ని సమకొల్పి దారుణ శిఖలఁ గాఁచి నీఱుసేయరాదు
ఘనముష్టిఁ గబళించి కపటపద్ధతిఁ బట్టి తెగఁ జేతితోడ రాఁచివేయరాదు
తే. హృదయమను పాదులోపల నుదయమంది, తల్లిదండ్రులమీఁద సోదరులమీఁద
దనయ బంధు కళత్ర మిత్రములమీఁద, యూరివోవంగ బ్రాఁకిన మోహలతను. 86

వ. ఇట్లు బంధురం బగు మోహలతాబంధమున న మ్మౌనిసింధురంబు కట్టువడి ప్రకృతి
జనంబుకై పడి శకుంతలాభిముఖుండై. 87

సీ. అత్తమామలకు నీయాపనేమి పెట్టుచుఁ గనుసన్నఁ జేయుమీ పను లెఱింగి
ప్రాణమిత్రములుగా భావించి యేపొద్దు సవరింపుమీ ప్రేమ సవతులందు
భర్త యొక్కొకవేళ బహుమాన మొనరింపఁగదియ రానీకుమీ గర్వరేఖ
పతిచిత్త మెఱిఁగి తత్పరిజనంబులమీఁదఁ జేయుమీ విపుల దాక్షిణ్యగరిమ
తే. కలఁక నొందకుమీ ధవుఁ డలిగినపుడు, సుఖములను జేరనీకుమా పగసపవము
వీని వెలిగాఁగఁ దిరుగు నే వెలఁదియైనఁ గులమునకు నాధియగుఁ జూమీ కూఁతుఁ గుజ్జ 88
ఉ. నా పయి కూర్మి తద్గురుజనంబులపై నిడి మానికన్యకా
స్థాపితవృత్తి బంధువనితాతతి యందు ఘటించి యిష్టస
ల్లాపములందు నిచ్చటుఁ దలంపక నిచ్చలుఁ బ్రాణనాథ సే
వాపరతంత్రవై యెటుల వన్నియఁ దెచ్చెదో నాదుఁ బుత్రికా. 89
ఉ. ఎన్నఁడు నా మది న్మఱతు నే నిటఁ బుత్రిక పూఁటపూఁట యా
సన్నసరోవరంబునను సంస్మరణం బొనరింప సంతత
స్విన్నమరందసిక్తసరసీజముఁ జూచి మదంతికంబునం
గన్నుల నీటితోడఁ బుళకం బగుచున్న భవన్ముఖాబ్జమున్. 90
ఉ. కొంత సుఖంబునుం గలదు కోమలి నా కిటఁ బర్ణశాలికా
ప్రాంతమునందు నీవు పెనుపం బరువొందిన మాలతీలతా
క్రాంతమనోజ్ఞమైన సహకారముఁ గన్గొనునప్పు డెల్ల దు
ష్యంతుఁడు మాశకుంతలయు సంగడి నుండుటగాఁ దలంచఁగన్. 91
వ. అని ప్రేమాతిశయంబున లతాతరువితానం బవలోకించి. 92
సీ. అల పెఱుంగక తావకాలవాలములకు నెమ్మితో నిరవొంద నీరుపోసి
క్రమవృద్ధిఁ బొందు మార్గంబు లారసి వచ్చి పూఁటపూఁటకుఁ జాలఁ బ్రోదిచేసి
ప్రేమాతిరేకత ప్రియమండనమునకుఁ జిగురాకుఁ గొనఁగోరఁ జిదుమ వెఱచి
పరిపాటి నల్లన ప్రసవోద్గమంబైన సఖులు దాను మహోత్సవ మొనర్చి
తే. తల్లియై పెంచె మిమ్ము నీ తలిరుఁబోఁడి, యత్తవారింటి కరిగెడు నాలతాంగి
క్షితిరుహములార పుష్పితలతికలార, యనుమతింతురుగాక కళ్యాణయాత్ర. 93
గీ. తోడునీడయుఁ బోలె నీ తోయజాక్షి, పెరిగె నిన్నాళ్ళు మీలోనఁ బెద్దయయ్యెఁ
బురుషునింటికి ననుపక పుట్టినింట, నునుచుకొనరాదుగా యంచు నున్నవారము. 94

వ. ఎట్టకేలకు ధైర్యంబు వట్టికొని శకుంతలం దోడ్కొని యగ్నిహోత్రంబునకు దం
డంబు వెట్టించి మునులకు నమస్కారంబు సేయించి పుణ్యతపస్వినీజనంబులకు
మ్రొక్కించి తదీయాశీర్వాదంబులతోడం దాను దీవించి యనుపుటయుం దండ్రి
పాదంబులకుం బ్రణామం బాచరించి. 95

సీ. జనకుఁ డుండెడు ననుష్ఠానవేదికఁ జూచుఁ జూచి క్రమ్మఱఁ బోయి చూడవచ్చు
స్నానార్థనియమిత జలజాకరముఁ జూచుఁ జూచి క్రమ్మఱఁ బోయి చూడవచ్చు
నిజహస్తపోషిత కుజవల్లికలు చూచుఁ జూచి క్రమ్మఱఁ బోయి చూడవచ్చుఁ
గుంజకోటరకుటీక్రోడవీథులు చూచుఁ జూచి క్రమ్మఱఁ బోయి చూడవచ్చుఁ
తే. దండ్రిఁ బాయంగ లేని సంతాపకలము, నత్తవారింటి కేగెడు హర్షజలము
గోరువెచ్చైన పాలిండ్లకొనలు గడుగ, నెడపడపనఁ బయ్యెద దుడిచికొనుచు. 96

సీ. కదలు నాలుగు మూఁడుఁ బదములు క్రమ్మఱ తండ్రిపాదంబు లౌదల ఘటించుఁ
గొంత దవ్వేగు నేగుచు వచ్చి కణ్వుని కడుపులోఁ దలమోపి కౌఁగిలించు
నరుగుఁ గొండొక వేగఁ దిరిగి మానులకు మా యయ్యనుఁడీ యని యప్పగించు
గమనించుఁ బెడమఱ్ఱి కాశ్యపుదెసఁ జూచి నేఁ బోదునంచుఁ గన్నీరునించు
తే. జనకుఁ డుపలాలనము సేయ సంయమీంద్ర, భామ లదలింప ననసూయ పట్టి తిగువ
నిగిడి యడుగిడె నొకభంగి మగిడి మగిడి, చూచుకొంచు శకుంతలాసూనగంధి. 97

క. మునిభామలు నలువంకలఁ, జను దేఱఁగ నిర్మలోర్మి సంగతయగు న
ద్యానిమిషనది రత్నాకర, మున కేగెడు భంగిఁ గదలిపోవుచు నెదురన్. 98

సీ. కీరకోకిలశారికారావముఖరిత బహిరంగణారామభాసురంబు
దళదబ్జకైరవోత్పలమనోహారిణీరాగాధపరిఘాసమావృతంబు
స్ఫాటికమణిశిలాప్రత్యగ్రరచనాతివిస్తృత ప్రాకారవేష్టితంబు
శుభ్రరోచిరదభ్రవిభ్రమాభ్రంకష బహువిధప్రాకారబంధురంబుఁ
ఆ. గాంచి రంత మౌని కాంతాశకుంతల, లబ్ధిమేఖలాసమంచితాంఘ్రి
నూపురంబు నతిమనోజ్ఞకల్పితరత్న, గోపురంబు హాస్తినాపురంబు. 99

వ. కాంచి యనేకవారణతురగరథఘటసేనాధిపచ్ఛత్రచామరాన్వితసత్పురీసమంచిత
వైభవంబులకు నాశ్చర్యాద్భుతప్రమదరసమగ్నహృదయులగుచు నల్లనల్లన యరిగి
యప్పట్టనంబుఁ బ్రవేశంబు చేసి రాజమందిరద్వారంబున నిల్చి తమ రాక ఫణిహారులచేతం
బుత్తెంచుటయును వారునుం జని యాభూమింజయుం గాంచి కణ్వాశ్రమంబుననుండి
యిద్దరు తపస్వులు కతిపయతపస్వినీజనంబును దేవరకుం బొడసూపననివచ్చి వాకిట
నున్నవారని విన్నవించిన నన్నరనాథుండు మునినాథుఁ డిట్లు పుత్తెంచుటకు

నెయ్యొది గతంబొకో యని విస్మయభయంబులు మనంబునం బెనంగొన సభాస్థలం
బున స్త్రీజనులం బొడగనూపించుకొనుట యనర్హంబని యందఱి వీడుకొలిపి నగరి
లోనికింజని యంతఃపురాంతికంబున నేకాంతసౌధంబున నాసీనుండై మాన్యలగు
వృద్ధకాంతలం బనిచి వారల రప్పించుకొని యుచితసత్కారంబు లొనర్పం బ్రీతు
లై పురోభాగంబునం గాశ్యపశిష్యులు వారివెనుక సంయమిరాజకాంతలు వారి
మఱుంగునం గుమారయుక్తయై శకుంతలయు నిలిచియుండి రయ్యెడ నా సంయ
మిశిష్యులు దుష్యంతు నాశీర్వదించి. 100

క. జననాథ మద్గురుం డగు, మునినాథుఁడు మీ సమీపమున కనిపెడుచోఁ
దనమాటలుగా నీతో, ననుమనె నవి చిత్తగింపు మవధానమతిన్. 101

మ. లలితాఖేటరతి న్మదాశ్రమము లీలంజొచ్చి యచ్చో శకుం
తల గాంధర్వమున న్వివాహమయి కందర్పాజ్ఞలోన న్మహో
త్కలిక న్గొన్నితిథు ల్చరించి యటమీఁద న్రాజ్యరక్షాకుతూ
హలివై క్రమ్మఱఁ జిత్తగింపవ తదీయంబైన వృత్తాంతమున్. 102

గీ. ఏ మెఱుంగనిపని యని హృదయవీథి, వెఱచునో కాక మఱచెనో వెనుకఁ జింత
మఱపులేదైన బహుకార్యమగ్నమతులు, ధారుణీనాయకులుగదా దానికేమి. 103

క. మా సరసీరుహనేత్రకు, నీ సంగతిఁ బుత్రకుఁడు జనించెను నరక
త్రాసకరుండై నరక, త్రాసకరుం డగుటఁ జక్రధరుఁడును బోలెన్. 104

సీ. కులము మేదినిమీఁద ఖిలముగాకుండంగ నభివృద్ధికారణం బాత్మజుండు
సౌఖ్యదం బైన సంసారద్రుమంబుల కాలవాలస్కంధ మర్భకుండు
జంపతులకు హర్ష జలరాశి యుబ్బింపఁ బూర్ణేందుబింబంబు పుత్రకుండు
గృహమేధిధర్మలక్ష్మికి పేఁపుమోపంగఁ జెనుపైన యాధారభిత్తి సుతుఁడు

తే. తనయుఁ డా లోకపథమున కనుపువాఁడు, మందిరాంతరదీపంబు నందనుండు
సూనుఁ డిలు వీటిఁబోకుండ సొమ్ముకర్త, యపరవయసున నాలంబయష్టి కొడుకు.

ఉ. కేవల పుత్రుఁగాఁగఁ బరికింపఁగఁ జాలినవాఁడు గాఁడు దా
నీ వనరాశివేష్టితమహీతలచక్రము చక్రవర్తి ల
క్ష్మీవిభవంబు నొంది పరిశీలనఁ బాలన సేయు నన్యథా
శ్రీపరమాళిరత్నఘనదీప్తిథగద్ధగితాంఘ్రిపీఠుఁడై. 106

క. ఏణాంకవంశచూడా, మాణిక్యంబయిన నీ కుమారుని సకల
క్షోణికి యువరాజ్యరమా, పాణిగ్రహణం బొనర్పు పరమప్రీతిన్. 107

వ. అని జననీసమీపముననున్న భరతుం గొనివచ్చిసమ్ముఖంబుచేయించి యనసూయా
ప్రియంవదలచేత శకుంతల నంతికంబునకు రప్పించి. 108

క. జననాథ! యిదె శకుంతల, యనసూయారుంధతులకు నణుమాత్రంబై
నను వట్రపడదు శీలం, బున నియ్యెడ కింతి ననిచి పుత్తెంచుటయున్. 109

ఉ. సద్గుణశాలివైన నిను సంస్తుతి చేసి కుమారిఁ జూచుచున్.
హృద్గత మైన మోహభర మే మని చెప్ప నృపాలచంద్ర యు
ద్యద్గళదశ్రువు ల్వెఱదలై వదనాబ్జము డిగ్గి పాఱఁగా
గద్గదకంఠనాళుఁడయి కణ్వుఁడు మీ కనిరెం బ్రియోక్తులన్. 110

క. జనయిత్రి కనిరె నింతియు, జననం బాదిగ నితాంత సమ్మదమతియై
యనువాసరము శకుంతలఁ, బెనిచితి వే ముక్తిబాలఁ బెనిచినభంగిన్. 111

సీ. మహనీయ సంయమంబ మహాధనంబుగా మతియించి వర్తించు మమ్ముఁదలఁచి
యొసఁగ శాపానుగ్రహ సమర్థుఁడైన బ్రహ్మయత తేజు గాధేయుఁ దలఁచి
గణనకెక్కిన దేవగణికాతతికి రత్నముకురమై వెలుఁగు మేనకఁ దలంచి
యాఖేటరతి వచ్చి యాశ్రమస్థలిఁ దడఁబాటు చేసిన చెల్లుఁబడి దలంచి
తే. మిక్కిలిగ మన్ననయుఁ జేసి మెలఁగవలదు, తక్కువయుఁ జేయవలవ దంతఃపురంబు
సతులలోపల సరియకా సరణితోడ, నీ శకుంతల భూకాంత యేలుమనిరి. 122

గీ. అనిన నమ్మాటలకు నసహ్యంబు నొంది, యొఱఁగుపై నున్నవాఁడు బిట్టులికిలేచి
కర్ణములుమూసికొని శిరఃకంప మొదవఁ, దొలుత హారహర యంచును బలికిపలికి.

క. మునికన్యక యఁట నేనఁట, వనమున గాంధర్వమున వివాహంబఁట సూ
నుని గనెనఁట మఱచితి నఁట, వినఁగూడునె యిట్టిభంగి విపరీతోక్తుల్. 114

ఉ. కాయజవైరి సన్నిభుఁడు కాశ్యపుఁ డాతనిపుత్రి నిచ్చునేఁ
జేయుట యెట్లు కార్యఫలసిద్ధి వహించుట యెట్లు భస్మముం
జేయఁడె చంద్రమఃకులము చిన్నగుసన్నను వింత యెంతయ
న్యాయపుమాట తీఁటగొనినం గొఱవిం దలగోఁకికొందురే. 115

గీ. చదువనే మున్న ధర్మశాస్త్రంబులన్య, కామినీరతి కలుషంబుగా నెఱుఁగనె
యన్యసతిమాత్రమే కాశ్యపాత్మజాత, యరయ నంగారకల్పితయైనప్రతిమ. 116

సీ. గజరాజగామిని కంఠసూత్రంబులు కాలసూత్రంబులుగాఁ దలఁపక
పద్మపత్రేక్షణ బాహుపాశంబులు కాలపాశంబులుగాఁ దలఁపక

కోమలి పీనవక్షోజచక్రంబులు కాలచక్రంబులుగాఁ దలఁపక
యుండు రాజవదన మృదూరుదండంబులు కాలదండంబులుగాఁ దలఁపక
తే. కాలసూత్రంబు లెబ్భంగిఁ గడచు నరుఁడు, కాలపాశంబులేభంగిఁగడచునరుఁడు
కాలచక్రంబు లే భంగిఁ గడచునరుఁడు, కాలదండంబు లెబ్భంగిఁగడచునరుఁడు.

వ. నా హృదయంబు పరవధూసుఖంబునకు విముఖంబుగాని సుముఖంబుగాదు; మీర లెచ్చటనుండి విచ్చేసితిరో యచ్చటికి నరుగుండు మీకు నిదె సేవాంజలి యనిన వారలు విని రహస్యప్రయోజనం బెఱుంగమింజేసి యొండొరుల మొగంబులుచూచికొనుచుండ ననసూయా ప్రియంవదలు డగ్గఱి ధీరగంభీరస్వరంబున నిట్లనిరి. 118

శా. ఆహా! లెస్సవిచారమే మొదల నీ వాఖేటకేళి న్మహో
త్సాహం బొప్పఁగ వచ్చి యాశ్రమము నిచ్చం జొచ్చి యచ్చోట స
స్నేహప్రీతి శకుంతలం గలఁచి గాంధర్వక్రియాలక్ష్మి ను
ద్వాహం బైనప్రకారమంతయును నాత్మన్విస్మృతిం బొందితే! 119

శా. మత్తు ల్వక్రరతు ల్నవప్రియులఁ గామధ్వాంత కాలు ల్కృపా
విత్తుల్ నిత్యనవస్వభావులు శఠు ల్విశ్వాసహీనుల్ చల
చ్చిత్తు ల్దూరపదార్థకాంక్షులు బహుస్త్రీలోలుపుల్ ప్రేరకా
యత్తు ల్రాజు లనంగ విందు మది సత్యంబయ్యె నీపట్టునన్. 120

సీ. నెలఁగలనైనఁ బెన్నెఱివేణి పోషింపఁ దలఁపఁ జేరఁగ నీదు తైలధార
ఋతుమతియైనచో దేహశుద్ధికినైన మైనాడనొల్లదు మజ్జనంబు
మాసికండూతి ముమ్మరమైనఁ గట్టు దుద్వాసించి వేఱొక్కవల్కలంబు
ప్రాణరక్షార్థంబు పర్ణాంబువులుగాని మూతిముట్టదు కందమూలఫలము
తే. లెన్ని దివసంబులో నీవు తన్నుఁబాసి, నాఁటినుండియు నీ శకుంతల నృపాల!
నేఁటిదాఁకను నడపె నిర్నిద్రనిష్ఠఁ, దీవ్రతరమైన విరహవీరవ్రతంబు. 121

క. పరమపతివ్రతయగు నీ, తరుణీమణిఁ బాయ నెట్టిధైర్యము కలిగె
న్వరుసఁ దనయంతవచ్చిన, నరవర! యెఱుఁగ నన నెట్లు నాలుక యాడెన్;122

గీ. గుణవతియుఁ బుత్రవతియును గులవతియును, నైనభామను విడుచు నన్యాయకారి
కిహపరంబులు లే వనియెడు సమిద్ధ, ధర్మశాస్త్రంబు లెఱుఁగవా? ధరణినాథ?

ఉ. అద్దములోని నీడవలె నాకృతియం దొకలేశమాత్రము
బిద్దము గాక నీకుఁ బ్రతిబింబము పోలె వెలుంగుచున్న నీ
పెద్దకుమారు భూవర యభిన్నమతి న్మొగ మెత్తి చూడుమా
ముద్దియ నీ పయిం గలుగు మోహము భక్తియు గానరయ్యెడున్. 124

వ. అనిన నవ్వచనంబులకు రాజు కటకటంబడి మీర లాఁడువారలు మీతోడ నిట్టి
ట్టనుట యుక్తంబుగాదు. ఆశ్రమంబునకు నేఁడు రేపట యెల్లి యెల్లుంట వచ్చి
కణ్వమహామునీంద్రునిం గని తదాదిష్టమార్గంబున నడచెదంగాని పొం డని దిగ్గున
లేచి పెద్దమొగసాలకు వచ్చి సభామధ్యంబున నుండఁ గాశ్యపశిష్యమౌని మానవ
త్యనసూయాప్రియంవదలు శకుంతలాకుమారుల వెన్నఁడి దోడుకొని వచ్చి యుచి
తస్థలంబున నిల్పి రంత ననసూయాప్రియంవదలు కోపపిహితేక్షణలై యంత
రిక్షంబునకు హస్తంబు లెత్తి యెత్తి సకలజనంబులు విన నిట్లనిరి. 125

సీ. దేవతలార యో దిక్పతులార నక్షత్రంబులార యో గ్రహములార
చంద్రార్కులార యో సప్తాంబునిధులార నదులార యో గోత్రనగములార
పరమపూరుషులార పంచభూతములార వృక్షంబులార యో పక్షులార
దిశలార యో నిశానిశలార పార్వతీశ్వరులార యో రమాచక్రిలార
తే. జనునివృత్తంబు మీ కెఱుంగనిది గలుగ, దీ శకుంతల మేలుఁ గీడేర్పరించి
...................ప్రకటముగఁ జేయుదురుగాక ప్రజ లెఱుంగ. 126

మ. అను నాలోనన తత్సభాజనము లత్యాశ్చర్యముం బొంద నో
జననాథోత్తమ! యీ శకుంతల మహాసత్యవ్రతాన్విత, త
త్తనయుండు భవదీయవీర్యజుఁడు సత్యంబౌ మఱి న్నన్యథా
ననుమానింపకు మంచు మ్రోసె వడి నయ్యాకాశవాణీధ్వనుల్. 127

ఉ. ఆ పలుకు ల్విన న్వినుచు నాగ్రహవృత్తి శకుంతలాంగుళి
స్థాపితమైనయుంగరముఁ జయ్యన నూడిచి మీఁదవైచి యో
పాపపురాజ! యెట్టిదియు బాలిక వేలికి వచ్చెఁ జెప్పుమా!
యీ ప్రజ లే గతిం బనిచి రే గద మా గతినన్న నయ్యెడన్. 128

సీ. విస్మయాక్రాంతులై వినువారు కొందఱు జగతీశు నెడఁ జాల నెగులు వడిరి
మహనీయమతి నధర్మంబు చేసితివి నీ వని రమాత్యులు మాన్యులైనవారు
నృపతి నేమియు ననఁ గేర కూరక వృద్ధులును బంధువులుఁ జెవు ల్మూసికొనిరి
ధ్యాఱడి నోములే యయ్యెను దవకంచు వెస శకుంతల వెక్కి వెక్కి యేడ్చె
తే. నంగుళీయకభానూదయంబుచేత, నతిసంభవశాపజంబైన నృపతి
మేనకాసుతమీఁద నజ్ఞానమొందవఁ, గ్రమ్ముకొనియున్న చిమ్మచీఁకటులు విరిసె.

వ. ఆ య్యవసరంబున. 130

సీ. విశ్రామగతి వేఁట వెడలిన చందంబు మునిజనాశ్రమము చొచ్చిన తెఱంగుఁ
దత్తుని పేర్చనవేళఁ దా నొగినవిధంబుఁ గణ్వనందనఁ బొందఁగనిన రీతి

యన్యోన్యసంప్రీతి నలరినలా గిడద్దును విరహాగ్ని వేఁగిన విధంబు
గాంధర్వవిధిఁ గరగ్రహణమందిన జాడ యచ్చోట సంగమంబైన భంగి
తే. గమనరీతి వియోగప్రకార మింత పట్టు, భావంబులును మొనకట్టుకొనుచుఁ
గూడియేతెంచిమనముఁ దోఁగుప్పగొనిన. మోహభర మోరువక మూర్ఛ మ్రొగ్గెవిభుఁడు
గీ. అల్లనల్లన తెలిసి ధైర్యంబునూఁది చక్కఁ గూర్చుండి తలయూఁచి ముక్కుమీఁద
వ్రేలు ఘటియించి మిగులఁ గ్రొవ్వేఁడి యొదవ, దట్టముగ దీర్ఘనిశ్వాసధార వఱపె.
సీ. అత్యంతకుపితాత్ములై తన దిక్కు చూచు ప్రియంవదను ననసూయఁ జూచి
కన్నీరు మున్నీరు కాలువలై వెల్లిగొనఁ జేయు మేనకాతనయఁ జూచి
యవయశ్రీఁ దన యచ్చొత్తిన ట్లున్న కులదీపకరుఁడైన కొడుకుఁ జూచి
నామాక్షరప్రమాణదినంబునకుఁ దేరగిరవున్న ముద్రియుంగరముఁ జూచి
తే. ద్రష్టలైయున్న మంత్రివర్గంబుఁ జూచి, ధర్మ మడిగితి వనెడు మిత్రులఁ జూచి
పలుతెఱంగుల నాడెడు ప్రజలఁ జూచి, తనయవజ్ఞాప్రకారంబుఁ దలఁచి చూచి.
శా. ఆ చంద్రాన్వయసంభవుండు మృగయావ్యాపారముం బుచ్చ నా
రాచప్రేరితుఁడై శకుంతలకు ధర్మస్వాంతము ల్సాక్షిగా
వాచానిష్ఠవరంబు లిచ్చుటయు సర్వంబు న్వృథార్థంబుగాఁ
దూ చా తప్పకయుండఁ జెప్పెనిజబంధు ల్మంత్రు లాప్తుల్వినన్. 134
గీ. కొడుకు నాయంతవాఁడయ్యెఁ గడునెదిగెను, దేహమాత్రంబె చిక్కెఁ గాఁ దేయతనయ
తలఁపు లే కింతకాలంబు తడయుటెట్టు, తెలివకిచ్చిన సత్యంబు మఱచుటెట్టు 135
సీ. గణనాధికముగ యాగములు గావించినఁ బాయునే యీ మహాపాతకంబు
చతురబ్ధిమధ్యభూస్థలి దాన మిచ్చినఁ గడచునే యి మ్మహాకల్మషంబు
సప్తముక్తిప్రదేశములు దర్శించినఁ దొలఁగునే యి మ్మహాదుష్కృతంబు
కర్మహారేశ్వతాగ్రం బెక్కి పడినను గెడయునే యి మ్మహాకిల్బిషంబు
తే. ధర్మపథవర్తు లిటుఁ దన్నుఁ దలఁచినపుడు, కర్ణములు మూసికొనియెడఁ గలుగఁజనరె
పలుకులేల యసత్యవాదులకు నెల్ల, నుర్విపై నేన యగ్రగణ్యుండనైతి. 136
వ. అనుచు నిందానురూపంబు లగు ననులాపంబులం జరుపుచున్న యవసరంబున 137
సీ. కర్పూరనవపరాగవిపాండుతనుకాంతి యకఠోరచారుచంద్రికలు గాయ
వికటారకూటవల్లికశార మగు పెద్దమగుటంబు శిరమెండ జిగుల నీన
హారిణాజినోత్తరీయచ్ఛాయ బ్రహ్మతేజఃకృశానునిహాగచాయ నెరయఁ
గుటి ఒఘావిర్మశీకుబ్జలలామంబు న్గొసలిప్పెఁ జీఁకటినూగుహార్ద

తే. నచతురాననపద్మజుం డనలికాక్షు, శంకరుం డచతుర్భుజచక్రపాణి
యఖిలలోకైక సంపూజ్యుఁడరుగుదెంచె, శారదుఁడు కాంతిజితశరన్నీరదుండు.

క. చనుదెంచిన మునిపతికిం, జనపతి యెదురేఁగి వినయసంభ్రమముల న
ర్చనలొనరఁగ సముచితాసన, మున యం దుపవిష్టుఁడై ప్రమోదముతోడన్. 138

వ. రాజు వదనంబునం జూడ్కి నిలిపి, యింత యేల సంతప్తమానసుండవై యున్న వాఁడవు నీస్వాంతం బత్యంతనిర్మలంబు నీకు నొక దోషంబుఁగలుగ నేర్చునే ఆశ్రమంబుననుండి నీవు పురంబునకునరుగుదెంచునెడ భవదీయవిరహాక్రాంతయైనశకుంతల దూర్వాసమునీంద్రుండు వచ్చిన నుచితసత్కారంబులు సేయ నెఱుఁగకున్న నతం డలిగి యిచ్చిన శాపతిమిరంబు నిన్నుం గానసీదయ్యె, ముద్రికాదర్శనంబు శాపావధియుం బ్రసాదించె నని తద్వృత్తాంతం బాద్యంతంబునుం దెలియం జెప్పి చిత్తంబు నుత్తలంబు డించి కుమారునిం జూపి యీ శాకుంతలుండు సకలమహీచక్రంబును జక్రవర్తియై పాలించు; భవద్వంశంబు నితని పేరభరతవంశంబునం బ్రసిద్ధిం గాంచు, నితని యువరాజుం జేసి శకుంతలయు నీవు నేకకాలంబు దాంపత్యసౌఖ్యం బనుభవింపు మనినం ద దనుశాసనంబున. 501

సీ. మునిభామినులతోడ ననసూయతోఁ బ్రియంవదతో శకుంతలావనజవదన
నంతఃపురంబున కనిపినం బతియాజ్ఞఁ బరిచారికలు భయభక్తులలర
జడల యల్లికలూడ్చి సంపెంగనూనియ శిరసంటి సీకాయజిడ్డు దిగిచి
గంగాంబువుల జలకంబార్చి తడియొత్తి రమణీయ చీనాంబరములు గట్టి

తే. చెంద్రుకలు చిక్కువాసి క్రొవ్విరులు దుఱిమి, పలుచగా మేనఁ జందనపంకమలది
యవయవంబుల శ్రర్ద్వాంబులైనభంగి, లలితమణిభూషణముల నలంకరించి. 141

చ. ఇనుఁడు పరిభావిలాస మెరమెచ్చినొకో యన మేనఁ బొల్చు నూ
తనమణి భూషణద్యుతివితానము గ్రమ్మఁగఁ గ్రొమ్మెఱుంగు చా
ద్పున నడ నేర్పు చిత్తరువుపోలికఁ బుత్తడిబొమ్మభాతి మో
హనగతితోడ మంగళగృహంబునకుం గొనివచ్చి యచ్చటన్. 142

గీ. హేమపీఠంబుమీఁద న య్యింతి నునిచి, రాజునకు విన్నవింప శారదపురస్స
రంబుగా వచ్చి శుభముహూర్తంబునందు, నమితకళ్యాణఘోషములు చెలఁగ.

క. నరపతి ప్రమోదరసమం, భరితుండయి, తనకు నగ్నిమహింషింగా సు
స్థిరమతితోఁ దశకుంతలఁ, భరునడి ఋషిజనెల్ల మెచ్చ బత్తుముగ్రైన్.

గీ. ఇంతిఁ బట్టముఁగట్టి యనంతరంబ, తనకు దండంబువెట్టిన తనయుఁ గ్రుచ్చి
బిగియఁ గౌఁగిటఁజేర్చి సంప్రేమఁ జేసి, మానితానందజలముల మజ్జనంబు. 145

సీ. సచ్చందనముకంటెఁ జందనంబునఁ గల్పంబు చేసిన కప్పురంబుకంటెఁ
బుప్పొడికంటెఁ బుప్పొడిలోనఁ బొరలించి వెలసిన చెంగల్వవిరులకంటె
హిమజలంబులకంటె హిమజలంబులలోన నానిచినబిసపల్లవములకంటె
నిండువెన్నెలకంటె నిండు వెన్నెలచేతఁ బదనైన చంద్రబింబంబుకంటె

తే. గారయఁగూర్చిన వీనియన్నింటికంటె, నినుమడియు ముమ్మడియు నైన మనుజవిభుని
యుల్ల మెల్లను మిగులఁ జల్లఁజేసె, నందనాలింగనమునఁ జెన్నొందుసుఖము. 149

వ. ఇత్తెఱంగునఁ బుత్రాలింగనసంగసౌఖ్యంబున నానృపాలపుంగవుండు కొంతతడవు తన్మయత్వంబు నొంది యనంతరంబ శతానందనందనానుమతంబున నందనుని యువరాజపట్టంబుగట్ట సమకట్టి యమాత్యులం బిలిపించి సముచితాసనంబులనునిచి శతాననంబులం బ్రసన్నావలోకనంబులు నినిచి మధురగంభీరధీరస్వరంబున నిట్లనియె. 147

ఉ. ఏలితి నేను భూభువనమెల్లను వైరములేకయుండఁగా
వ్రాలిన భూమిపాలకుల వంచి కరంబులు గొంటి జన్నము
ల్వాల నొనర్చితిం బ్రజలు సంతసమందఁగ బంధుకోటిచే
మే లనుపించుకొంటిఁ దగు మీ ఘననీతిబలంబు పెంపునన్. 148

గీ. నాకు మీ నీతిపదము సుశ్రీకి నెలవు, మంత్రి లేకున్న రాజ్యంబు మనుజపతికిఁ
బెక్కువదియెంత కలిగిన బీలికాఁడు, లేని పేరోడ చక్రంబు లేని రథము.

క. కావున మీ ఘనబుద్ధి, శ్రీవిభవం బూఁతగాఁగ శేషాహికుల
గ్రావశిరోభరితం బగు, భావలయము భరము నేను బూనితిఁ బేర్మిన్. 150

గీ. పెద్దవాఁడనైతిఁ బృథివిభారం బింకఁ, బూనవయసు గాదు పుత్రుఁ డెల్ల
భరముఁ బూనఁగాఁ దపస్వినై సుఖలీల, వనమునందు నుండ వయసుగాని. 151

క. లక్షణయుతుఁగా భరతుని, వీక్షింపుం డర్హుఁ డయ్యెనేఁ గావింపుం
డీ క్షితి యువరాజ్యరమా, ధ్యక్షుండై రక్షసేయ నభిషేకంబున్. 152

క. నావుడు వారలు విభుతో, భూవర! భవదీయవాక్యములు మా కానం
దావహములు నీ తనయుం, డీ విశ్వము నేలఁజాలు నిద్ధవిభూతిన్. 133

సీ. ఆయతలోచనుం డాజానుబాహుయుగళుఁడు కవాటవక్షస్స్థలుండు
కోమలజంఘుండు గూఢజత్రుండు విశాలఫాలుండు వృషస్కంధధరుఁడు

కఠినహస్తతలుండు కమఠోపమానాంఘ్రి యభిరామశిరుఁడు మహోహానుండు
చండాంశు తేజుండు సంపూర్ణపూర్ణిమా శరదిందుబింబ భాసురముఖుండు
తే. నీతిమంతుండు గాంభీర్యనిధి వివేక, మహితమూర్తి యలోకసామాన్యబలుఁడు
నీ తనూజుండు పెంపున నిన్నుఁబోలుఁ, గట్టుపట్టంబు యువరాజుగాఁగ నధిప!

వ. అని విన్నవించు మంత్రులవాక్యంబులకు సంతసిల్లి పురోహితహితభృత్యబంధుమిత్రాదిమాన్యజనంబుల రావించి సంభావించి తాను గావించు ప్రయోజనం బెఱిఁగించి మంత్రిల సమ్మతంబునఁ బ్రజలయనుమతంబునఁ గార్తాంతికోపదిష్టం బగు శుభముహూర్తంబున గార్తస్వరభద్రపీఠంబునఁ గుమారు నలంకరించి యనిచి. 155

చ. అనఘులు ధారుణీసురు లయ పవిత్రమంత్రము లుచ్చరింప శో
భనకరవాద్యఘోషములు బంధురభంగిఁ జెలంగ సర్వభూ
జనములు సన్నుతింప విలసన్మతి బంధులు సంతసింప వేఁ
కని విభవంబు పెంపెసఁగఁ గట్టె సుతు న్యువరాజ పట్టముకా. 156

మ. తనయుం బట్టము గట్టి డెందము ప్రమోదం బందఁ బంకేజభూ
తనయుం గన్గొలి కేలు మోడ్చి మునివేదండా భవచ్ఛాసనం
బున శాకుంతలు యౌవరాజ్యపదవిం బొల్పారఁగా నిల్పితిం
జనతాపాలనహేతునీతి నుపదేశం బిమ్ము నీ విమ్మలన్. 157

క. అని నిజనందను నజనం, దనుచరణంబులకు వందనము సేయింపకా
మునిపతి సంతుష్టుండై, జనపతి నాశీర్వదించి శాకుంతలునికా. 158

వ. గాఢాలింగనంబు చేసి సమీపంబున నునిచికొని తదీయ వదనారవిందంబునం జూడ్కి నిలిపి యిట్లనియె. 159

సీ. మణులగద్దియచుట్టు మండలేశులు గొల్చియుండఁ బెంపునఁ గొలువుండునపుడు
సౌధాగ్రవీథులఁ జంద్రశాలలయందుఁ జెలువలతో వినోదించునపుడు
గీతవాద్యకళా వినూతన సుఖగోష్ఠి నిచ్చమైఁదగఁ బ్రొద్దుపుచ్చునపుడు
రాజపూజ్యములైన రాజభోగంబులు కెలుకుగాకుండ భోగించునపుడు
తే. వసుమతీరక్షయందు మానసము నిల్పి, లలితసప్తార్ణవీ మేఖలాధరిత్రి
నేకపురిఁ బోలెఁ బాలించె నింతకాల, మనఘ! నీ తండ్రి వినుము దుష్యంతవిభుఁడు

క. నీ తండ్రియట్ల నిర్మల, నీతిపథంబునఁజరించి నిజభూప్రజకుం
బ్రీతియొనర్పుచుఁ బొందుము, ప్రీతఃపాండురవయోజభాసురకీర్తిన్. 161

గీ. నీతిపథమున మతి గెంటనీక పూర్వ, రాజచర్యకు నతితత్పరత ఘటించి
వసుధఁ బాలింపు తగులకు వ్యసనములను, వ్యసనికగు చందములు వినువరుసవత్స 162

సీ. మొదల సద్ధ్యయంబునకు సుత్తిగ వెట్టుఁ బెట్టి జీవనము పైఁ బ్రీతి విడుచు
విడిచి యసద్భావ్యవృత్తికిఁ జొచ్చుఁ జొచ్చి యాచారంబు చాకసేయుఁ
జేసి దుర్జనులగోష్ఠికి మానసము దూర్చు దూర్చి ప్రాభవలక్ష్మిఁ దోలుఁ గఁదోలుఁ
దోలి ధూర్తస్థితి మేలుగాఁ దలపోయుఁ బోసి యన్యాయంబు పొత్తుగుడుచుఁ

తే. గుడిచి బంధుకోటి గొడ్డముగా వాయు, బైకి పోకార్చుకొనఁ బాపపంకనిహతిఁ
గూలుఁ గట్టాడి వారక కూడముననఁ, సంతత స్త్రీరతుండు దుష్యంతతనయ. 163

సీ. ఆహారవేళ శయ్యారతి సంతఃపురాంగనాకేళి సౌఖ్యములు దొఱఁగు
గెలుపోటములు రెంటివలన నుత్సాహదైన్యములఁ జిత్తము ప్రీతినొంద దెపుడుఁ
దమియు మత్సరము డెందమున సంతింతకుఁ బొడమికానఁడుప్రొద్దుపొడుపుఁ గుంకు
నెకసాయమై పందె మెక్కించి యోడెనేఁ గలధనం బెల్లను బొలిసిపోవుఁ

తే. గెలనినోడించుపథముఁ దాగెలుచువిధముఁ దలఁచుకొనుచును రాజ్యతంత్రంబుచాఁగు
రీతిఁ గోల్పడి యంచితఖ్యాతిఁ బాయుఁ, నెరపనొప్పదు జూదంబు నృపకుమార! 164

సీ. పొలంబు పరువులఁ బొడము ఖేదంబున దగదొట్టి వడదాఁకి తనువు నలగు
నన్నోదకంబు లాయాయి వేళల లేక యొకరోగ మెద్దియే నుద్భవించు
వేమి జీ క్రూరసత్త్వము లాగ్రహంబునఁ బయిపచ్చె నేని నొప్పమి ఘటిల్లుఁ
దప్పివేచి పొదలలోఁ దరులచాటున శత్రులనరుగాఁచినఁ బ్రాణహాని పుట్టు

తే. నన్వయాగతధర్మంబు లాచరింపఁ గాలవేళలు తప్పుటఁ గలుగు మందు
నంము నష్టతఁ బొందు రాజ్యాభివృద్ధి, వలను గానిది వేఁట భూవరతనూజ! 165

సీ. త్రావి యానాఁడు మత్తా గొని పొరలాడు నెఱుఁగఁ దుల్లములోన నెదిరిఁదన్నుఁ
బనిలేక చూపుఁ గోపప్రసాదంబులు భావింప నేరఁడు వావి వరుస
విప్రలాపములాడు విడుపఁడు మేలంబు నూట నొక్కటిలేదు మాట నిజము
గుప్తి సేయఁగనోపఁ డాప్తరహస్యంబు లొఁగాములను దెలియంగ లేఁడు

తే. లజ్జ వొలియించుఁ దాలిమి యుజ్జగించు, నింద కొడిగట్టు శీలంబు చిందఁజేయు
బ్రహ్మహత్యాదు ములునూవు పాపవితతి, పాపగోష్ఠివిధంబు భూపాలపుత్ర. 166

సీ. తల్లిదండ్రులకు డెందము విరక్తి భజించు నన్నదమ్ములకుఁ బేరాసపడును
గులకళత్రము పుట్టినిలు సేర నూహించుఁ బ్రాణమిత్రుండును బగతుఁడగును
బావలు మఱఁదు లేర్పడ మోముఁజూడరు దాసదాసీజను ల్వేసరుదురు
తలఁగి పోవుదురు తాతలనాఁటి హితులు జుట్టాలు మేల్గోడు మాటయు నెఱుఁగరు

తే. పాలనము సేయఁ జేపట్టి ప్రజలఁ గావు, సకలజనులను నట్లింటి శత్రుఁ జేయు

నయము గడ యీక యెల్లవేటలను దెలుచు, మాటపరుసదనంబు కుమారచంద్ర!
సీ. అపరాధమునకు నర్హము గాక వెగ్గలం బగు శిక్షఁ బ్రజ చాల వెగడు గుడుచు
వెగడొంది మనసునఁ జేఁడెత్తి నిలుపక వేఱొండు కడఁ గాపు విచ్చిపోవు
వినయ హీనతఁ గాపు విచ్చిపోనిచ్చిన నచిరంబ పాడదయగు ధరిత్రి
ధరణి పాడదయైన సరిగోరు మొదలుగాఁ దనకు ఘటిల్లు నాదాయనష్టి
తే. ధాన్యధనములయందు నాదాయనష్టి, యైన నిర్ధనుఁడగు ధనహీనుఁడైనఁ
దొడిగి పట్టు దరిద్రింబు దోలఁగులక్ష్మి, యుగ్రదండంబునను నృపాలాగ్రనూతి.
సీ. ధీజనస్తుతముగా దేహసౌఖ్యమున నంకిలిలేక యుండ భోగించుచోట
బడి దప్పి నిరయకూపములఁ జూడక యుండఁ దిగిచి ధర్మంబు సిద్ధించుచోట
వృద్ధరాజులు గారవించు లోకత్రయీవర్తిని యగు కీర్తి వచ్చుచోట
నశిశంకతోడ మూఁడవ యుపాయంబున వైరిదుర్గంబులు చేరుచోట
తే. బుధుల హితులను బంధులఁ బ్రోచుచోట, నెంత చేసిన నది ఫలియించుఁగాని
వల దనర్థకముల సొమ్ము వమ్ముసేఁత, మతిఁ దలంప రాజాన్వయక్షితిపహంస. 169
చ. నెలఁతయు జూదముం బగటి నిద్రయు వేఁటయుఁ బానము న్సదా
వలవని నిర్గమంబుఁ బరివాదము వ్యాజము నాటపాటలు
న్నిలనగు కామజంబు లివి యిందునసక్తుఁడుగాక మైపడిన్
వలయు నొనర్ప నెందు దశవర్గమున న్శశివంశభూషణా. 170
క. అంగములు పతికి విను స, ప్తాంగములును వానిఁ దగుసమంచితగతిసా
రంగాంకవంశతిలక పొ, సంగును రక్షించుకొనఁగ జననాథునకున్. 171
సీ. శక్తిత్రయంబునఁ జతురుఁడై చతురుపాయంబులకును సమయంబెఱింగి
పంచేంద్రియముల నిర్జించి స్వాయత్తుఁడై షడ్గుణీగరిమఁ బ్రశస్తిఁగాంచి
వ్యసనంబులేడును వర్జించి రాజదోషములు పద్నాల్గుఁ జిత్తమునఁ దెలిసి
సాక్షిమాత్రంబుగా సచివుఁ బ్రతిష్ఠించి యాత్మయత్నము లేశమంతయైన
తే. నింగితాకారచేష్టల నెఱుఁగనీక, పరుల నెవ్వరి విశ్వసింపక మనమున
సంతతంబు శరీరరక్షాక్రమంబు, లేమఱకయుండవలయు మహీవిభుండు. 172
సీ. పతిహితుం డతిధర్మపరుఁడు నీతిధురీణుఁ డింగితజ్ఞుండు జితేంద్రియుండు
మంత్రరక్షకుఁ డన్యమర్మభేది ప్రజానురాగి శుశ్రోత నీరాగి భోగి
యుచితయత్నతరస్వియుత్కోచవిముఖుండు శాంతుఁ డతిప్రౌఢసత్యవాది
పరధనపరదారపరపరివాదవర్జితుఁడు ప్రఖ్యాతుండు శ్రీకరుండు
తే. బ్రాహ్మణుఁడు మంత్రిఁగాఁ దగుఁ బరిగణింప, గుణము లిట్టివిగా సమకూరలేని
క్షత్రియుని శూద్రు [illegible] దప్ప సచివపదవి, వైశ్యు నిలుపంగఁదగవు భూవల్లభునకు. 173

సీ. కూరిమి భృత్యుఁ డెక్కుడు లావు పలచేయు మతిరంజకుఁడు పీఠమర్దకుండు
కట్టిన యలుగు సంగరసహాయుఁడు మాని పఱుఁగు పెట్టనికోట మంత్రహితుఁడు
చనవరి దొర ప్రతిజ్ఞాపాలకుఁడు బహిఃప్రాణంబు పట్టపు భద్రగజము
ముంగొంగు పసిఁడి సప్తాంగరక్షకుఁడు చేదోడు నెచ్చెలికాఁడు తోడునీడ
తే. యనఁగ నిన్నిగుణంబుల నాపహిల్లి, పాలు నీరును బోలి యేర్పఱుపరాని
సముచితస్నేహమున నెడసందు లేని, మిత్ర మహ్వాంబు వసుధాధిశత్రునకును. 174
సీ. తన యేలు వసుమతీజనులఁ బీడింపక యేరికి మొదలిచ్చి కోరుపాలు
సవరగాఁ గొంచు దండువులు పర్వనములు కోలాసగొన కూళ్లు గుత్తకీక
కమ్మతంబులలోన గనులు ద్రవ్వించి బేహారమాడించి యన్యాయధనముఁ
జోరనీక పట్టాంశ మెఱిగొంచు నీతిబాధలు ఘటింపక యుండ ధనముఁ గూర్చి
తే. దానిఁ జతురంశములు చేసి దానధర్మ ములకు నొకపాలు సైకొని మూఁడుపాళ్ళ
వెచ్చమునకును రానీక యచ్చువోడిచి, కాపవలయుఁ బ్రభుఁడు భండారమునను. 175
సీ. ఏటికాల్వలు పరిపాటిగాఁ ద్రవ్వించి చెఱువుల నీరండు నొఱపుదెలిసి
దేవమాతృకలు నదీమాతృకలునైన గ్రామసీమక్షేత్రగతులు దెలిసి
నీరునేలలు వానకారులు పరికించి వరిపొలంబుల పంట వలఁతు లరసి
కోరాయములు పచ్చు కొలఁది విచారించి పడియాళ్లకొకరిఁ దీర్పటిగఁ జేసి
తే. చనవుకారలు పనివారు శాత్రవులును, జోరులును జేయుబాధలు జేరకుండఁ
బ్రజలఁ బాలించుకొనుచుఁ దత్పరతసాను, రాగుఁడై ప్రోవవలయు రాష్ట్రంబు రాజు.
సీ. అగడిత యాఁతనీరగునట్లు త్రవ్వించి కొత్తడంబులతోడఁ గోటఁ దీర్చి
యట్టళ్ళు కల్పించి యడ్వరి విరివిగా వలనొప్ప ఘటియించి వంకధార
గవనులు పరిపాటిగా వినిర్మింపించి లోన నూతులు బావులును నగాధ
జలములుగాఁ జాలఁ గలిగించి రసవర్గములు వేఱ సంపూర్ణములుగ నించి
తే. చుట్టు బామడచుట్టును నూదిమోప, నెడము కల్గకయుండఁ బేరడవి పెంచి
నగసమీపంబుగల పట్టనంబు రాజ, ధానిగా నుండుటురవగు ధరణిపతికి. 177
సీ. తఱితోడ జీతంబు కొఱఁతగాకుండ రొక్కంబు భండారుధనంబ యిచ్చి
బంటుఁ దొలంగించి ప్రీతియు వెట్టకయుండ గమి లెక్క తక్కువగాకయుండఁ
గఁడగి వేశ్యాగామి గాకుండఁ బరికించి ప్రతిభానువారంబు భటులతోడు
చూచుచుఁ దనవన్నె జోకయైయుండినవాని మన్నించుచు లేనివాని
తే. నాజ్ఞ సేయుచు జీవిక కష్టపడక, యుండఁ బరికించికొనుచు నా యోధనమున
నైదు పదిసేయ కుత్సాహియైన యాప్త, బలము నేలఁగవలయు భూపాలకుండు.
క. అని యిది మొదలుగ మఱియును, జనపతులకు వలయు నీతిసమధికబుద్ధిన్
జనపాలనందనునకును, మునిపాలుఁడు చెప్పి యుల్లమున ముద మొదవన్ 179

వ. ఆశీర్వదించి దుష్యంతు నభినందించి కణ్వమునీంద్రుండు పుత్తెంచినశకుంతలం దోడ్తో నివచ్చిన మునులను మునిపత్నులను ననసూయాప్రియంవదలను బ్రియపూర్వకంబుగ సముచితసత్కారంబుల ననిపించి దుష్యంతుని వదనంబునం జూడ్కి నిలిపి నరేంద్రచంద్ర యింద్రుఁడు జయంతునిం బోలి నితాంతప్రీతి నీకు శాకుంతలుండు సంపాదింప శచీపాకశాసనులం బోలె శకుంతలయును, నీవును నితాంతసౌఖ్యవంతులరై రాజ్యసుఖం బనుభవింపుం డని దీవించి యాశ్రమంబునకుం బోయెదననిన భూమింజయుండు కంజాసనసమానునకు నంజలిచేసి మంజుభణితి నిట్లనియె.

సీ. ఇందువంశజులలో నేఁ గృతార్థుఁడనైతి నా జన్మ మధికధన్యత వహించె
రాజదోషములు చేరవు నన్ను నిఁకమీఁద మంగళంబులకు సద్మంబనైతి
నంతరాయములు శూన్యతఁ జెందె రాజ్యరమాభివృద్ధికి సంశయంబు వాసెఁ
బుణ్యంబులెల్ల నిర్వడఁ జాలఫలియించె నఘసముచ్చయం బణఁగిపోయె

తే. నెన్నికకుఁ బెక్కు మద్వంశ మితరవసుమ, తీశ్వరులలోన నాకరుండ్లలోన
సంయమీశ్వరతిలక యిచ్చటికి మీరు, చిరకృపామతితోడ విచ్చేయుటయును. 181

వ. అని బహుప్రణామంబు లాచరించి విరించినందనుననిచి కుమారుండు యువరాజపట్టభద్రుండై సకలమహీచక్రంబు నవక్రపరాక్రమంబున ననన్యసామాన్య సౌజన్యంబునఁ బాలనంబునం బ్రజలను లాలనంబున బంధులోకంబును బరమానందంబు నొందఁ జరింప శకుంతలయుం దుష్యంతుండును బెద్దకాలంబు పూజ్యంబగు రాజ్యసౌఖ్యంబు లనుభవించుచుండె.

శా. కంజాటోపమధైర్య విభ్రమవతీకందర్ప దర్పి ద్విష
త్కుంజాతామృత ధామధీమహితవాతాశ్యన్వయగ్రామణీ
మంజీరాంఘ్రిసరోజ పూజనమహామందారలోకత్రయీ
మంజూషాహితకీర్తి మౌక్తిక సుధామాధుర్యవాగ్వైభవా. 183

క. హారిదంతదంతిదంత, స్థిరకీర్తివిహార సకలధీజనవినుతా
గురుధిషణ ధర్మమోదక, శరనిధిగాంభీర్య బంధుసముచితరక్షా. 184

మాలిని. సతతసుకృతభాజా సంతత శ్రీబిడౌజా, క్షితిజనసురభూజాచింతితత్యాగభోజా
ప్రతినవరవితేజా భవ్యభాషాపరాజా, హతవిమతసమాజా యన్నమాంబాతనూజా.

గద్య. ఇది శ్రీభారతీతీర్థగురుచరణకరుణాలబ్ధసిద్ధ సారస్వతపవిత్ర గాదయామాత్య
పుత్రయారాధితామరవీరభద్ర పిల్లలమఱ్ఱి పినవీరభద్ర ప్రణీతంబైన
శృంగార శాకుంతల కావ్యంబను శకుంతలాపరిణయంబునఁ జతుర్థాశ్వాసము

సర్వంబును సమాప్తము.

శ్రీమదుమా రమణార్పణమస్తు.



శ్రీ వి[illegible]ముద్రాక్షరశాల, రాజమండ్రి:—1939.